సంస్థాపకులు
కీ॥ శే॥ వి.వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సచిత్ర మాసపత్రిక
అక్టోబర్ 1977

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 15 విషయసూచిక సంచిక 9



నవలానుబంధం



ముఖచిత్రం : 'అమరదీపం'లో జయసుధ

జ్యోతి, 17 B రాజారాం కాలనీ, P. B. నెం 2650, మద్రాసు 600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు. 42/-.

# పాపాయిని ఫారెక్స్‌తో పెంచుతున్నందుకు నిజంగా నేను గర్విస్తున్నాను



## మా డాక్టర్ అన్నారు: "పాపాయికి 3 నెలలు వచ్చాక కేవలం పాలు మాత్రమే ఇస్తే చాలదు. వానికి కావాలి ఫారెక్స్".

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు ?**

అందుకు రెండు కారణాలున్నాయి. పెరిగే మీ పాపాయికి కావలసిన మొట్టమొదటి సంతులిత ఘన ఆహారాన్ని ఇది పూర్తిగా సమకూరుస్తుంది. సున్నితమైన పాపాయి జీర్ణకోశానికి ఇది సరిగ్గా సరిపోతుంది కూడా.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం ?**

పాపాయి మెదడు, శరీరం పెరుగుదల కోసం ఫారెక్స్ సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను తగినంతగా అందిస్తుంది. పాపాయికి శక్తినిచ్చేందుకు కార్బోహైడ్రేట్లను కూడా సమకూరుస్తుంది. ఫారెక్స్‌లో పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ ఉంది. మరో విషయం. ఫారెక్స్‌లో మీ పాపాయికి దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తోడ్పడే కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ $డి_2$ తగినంతగా ఉన్నాయి.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు ?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. ఇప్పటినుంచే ఫారెక్స్ ఇచ్చినట్టయితే పెద్దవాడయ్యాక తినే ఆహారాన్ని సరిగ్గా నమిలి చక్కగా జీర్ణం చేసుకోగలడు.

**బంగాళ దుంపలు ఉడికించి మెత్తగా చేసి ఇస్తే కాదా ?**

మీ పాపాయికి ఏదైనా ఘన ఆహారం పెట్టే ముందు పాపాయి జీర్ణశక్తి గురించి కూడా కొంచెం ఆలోచించండి. 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగా ఉంటుంది. అందుచేత, అతడు సులభంగా జీర్ణం చేసుకోగలిగే ఘన ఆహారమే ఇవ్వాలి. పైగా, మామూలుగా ఇచ్చే ఆహారాలు సంతులితమైనవి కావు. మీ పాపాయికి అతి ముఖ్యంగా కావలసిన ఐరన్, కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ $డి_2$ మొదలైన వన్నీ అవి సమకూర్చలేవు. అందుకే 3 నెలలు వచ్చాక మీ పాపాయికి ఫారెక్స్ తప్పని సరిగా ఇవ్వాలని డాక్టర్లు చెప్పడంలో ఆశ్చర్యం లేదు.

**"పెద్దలు తినే ఆహారాన్ని" ఎప్పటి నుంచి ఇవ్వవచ్చు ?**

మొదటిసారిగా పాపాయి తప్పటడుగులు వేసినప్పుడు అతడికి పళ్ళు, కూరగాయలు, పప్పు, గుడ్లు ఇవ్వండి. అయితే ఫారెక్స్‌ను మాన్పించకండి. మీ పాపాయికి మూడేళ్ళు వచ్చేవరకు, కొంచెం ఆలోచించి/అతడు తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి పెట్టండి.




**సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదలకోసం పాపాయి మొట్ట మొదటి ఘన ఆహారం.**

లింటాస్-GF.57-1710 TL

# తొలిమాట

శ్రీశ్రీ పదబంధ ప్రహేళిక-విజేతల సంఖ్య చాలా ఎక్కువ కావడంతో బహుమతి సొమ్మును పంచి ఇస్తున్నాము గత రెండునెలలుగా. అయితే చాలామంది ప్రహేళికలో పాల్గొనే పాఠకులు చాలా చిన్నమొత్తంలో అందరికీ ఇచ్చేకంటే లాటరీవేసి అయిదుగురికో, పదిమందికో బహుమతి ఇస్తే బాగుంటుందని సూచించారు. ఈ సంచికలో విజేతలకు అలాగే బహుమతులు అందిస్తున్నాము. రెండు నెలలుగా అత్యధిక సంఖ్యలో పాఠకులు ప్రహేళికకు సరైన సమాధానం పంపుతున్నారు. ఈ విషయం శ్రీశ్రీగారి దృష్టికి తేగా "కుప్పుస్వామి అయ్యర్ మేడీజీ చేద్దామా" అన్నారు నవ్వుతూ. బహుశా పాఠకులు కొంచెం కష్టపడవలసి వస్తుందేమో ఈనెల నుంచీ ప్రహేళికలు పూర్తి చెయ్యడానికి.

*   *   *   *

ముందుగా ప్రకటించినట్లు జ్యోతి దీపావళి నవలల పోటీలో బహుమతి పొందిన నవలను దీపావళి ప్రత్యేక సంచికలోకాక దీపావళి ప్రత్యేక సంచిక వెలువడిన వారంరోజుల్లో విడుదలయే డిశంబర్ '77 సంచికలో అందిస్తున్నాము. నెలనెలా పూర్తి నవల నందిస్తున్న జ్యోతి—దీపావళి ప్రత్యేక సంచికలో నవలకంటే — ఎప్పటిలాగానే ఎక్కువ సంఖ్యలో మంచి కథలూ, ఇతర ఆకర్షణలూ ఆశిస్తున్నామంటూ కొందరు పాఠకులు రాశారు. మాకూ ఆ సూచన నచ్చింది. దీపావళి ప్రత్యేక సంచిక మీరు మెచ్చే రీతిన తయారౌతూంది.

*   *   *   *

జ్యోతిపై విమర్శనా సమీక్షలను సమీక్షిస్తూ మేం ప్రచురిస్తామన్న సమీక్ష ఈ సంచికలోవుంది. పాఠకులు జ్యోతికి విమర్శలు పంపేందుకు ఎల్లప్పుడూ ఆహ్వానితులే.

*   *   *   *

కారణాంతరాలవల్ల, అనుకొన్నట్లుగా ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి నవలిక 'చెట్టూ - ఛాయా' ఈ సంచికలో ప్రారంభించలేక పోయాము. వచ్చే సంచికనుంచీ 'చెట్టూ - ఛాయా' జ్యోతిలో సీరియల్‌గా ప్రారంభమవుతుంది.

వె. రామలింగస్వామి

మీ ప్రశ్నకు మా
మా ప్రశ్నకు మీ

# జవాబు

నిర్వహణ: ధనికొండ హనుమంతరావు

వి. విజయలక్ష్మి, డొంకరాయి.

'మంచి రచన' అన్నదానికి నిర్వచనం ఏమిటి?

(ఉత్తమ ప్రశ్నగా రు. 25/- బహుమతి పొందినది)

నిర్వచనం చెప్పలేము. కాని మంచి రచన లక్షణాలు కొన్నిటిని పేర్కొనవచ్చు. రచన ముందుగా చదివించగలిగి ఉండాలి. చదువుతేనే కదా మంచిదో, చెడ్డదో తెలిసేది. చదివించగలిగిన రచనకు పాస్ మార్కులు వేయవచ్చు. రచనలోని పాత్రల అనుభూతులు తన అనుభూతులుగానే భ్రమించి, భావించి వాటిని అనుభవించగలగటం మంచి రచన చేయగలదు. రచయిత ఉపయోగించే ఆయుధం తర్కం. ఆ తర్కానికి కట్టుబడేట్లు చేయగలుగుతే అది కన్విన్సింగ్‌గా ఉండి, మెచ్చుకోబడుతుంది. పాఠకుడికి తెలిసిన విషయమే అయినా దాన్ని తనకు తాను చెప్పుకోలేని స్థితిలో ఉండటం, లేదా కన్‌ఫ్యూజ్‌డ్‌గా ఉండే స్థితిలో ఉన్నప్పుడు, రచన ఆయా విషయాల్ని వివరిస్తే పాఠకుడు మెచ్చుకుంటాడు. సమస్యలను వివిధ దృక్కోణాలనుంచి చూపి, పరిష్కారాన్ని పాఠకుడికే వొదిలేస్తే, పాఠకుని మనస్సు ఆలోచన ఆరంభిస్తుంది. క్రమంగా ఏది

---

ఈ శీర్షికలో పాఠకుల ప్రశ్నలకు ప్రముఖ రచయిత శ్రీ ధనికొండ హనుమంతరావు సమాధానాలిస్తారు. సీరియస్ ప్రశ్నలకు సీరియస్ సమాధానాలతో పాటు, చిలిపి ప్రశ్నలకు చురకలంటిస్తారు కూడా (నో అఫెన్స్ ప్లీజ్). ఉత్తమ ప్రశ్నకు రు.25/- బహుమతి ఉంది. అంతేకాదు, ప్రతినెలా పాఠకులను శీర్షికా నిర్వాహకులు ఒక ప్రశ్న వేస్తారు. ఆ ప్రశ్నకు వచ్చిన సమాధానాలలో ఉత్తమమైనదానికి రూ. 25 బహుమతి వుంది. ఒకటికి మించి సంతృప్తికరమైన సమాధానాలున్నచో బహుమతి సొమ్మును పంచి ఇవ్వడం జరుగుతుంది.

ప్రశ్నలూ, జవాబులూ కూడా వీలయినంత వరకూ పోస్ట్‌కార్డ్ మీద రాసిపంపండి. మీ పూర్తి చిరునామా ఇవ్వటం మరువకండి. ప్రతినెలా ఒకటోతేదీ వరకూ వచ్చే ఎంట్రీలు పరిశీలనలో కొస్తాయి. ఆ తర్వాత వచ్చే ప్రశ్నలు మాత్రం తరువాతి నెలకు పరిశీలిస్తాము.

---





# కంచి, ఆరణి
# ధర్మవరం, బెనారస్
# మైసూరు, పోచంపల్లి
# పట్టుచీరెలు
## ఉత్పత్తిధరలకు
## లభించును



V N MANIARTS

మరియు
100% టెరిన్, టెపాష్లి, కోటా, అమెరికన్ జార్జెట్,
జపాన్ జార్జెట్, ఆర్గంజా, ఆర్గండి, వెంకటగిరి,
మాధవరం, కంచికాటన్ చీరెలు లభించును.

  

 

# కళ్యాణి
## శారీ షోరూమ్

ఫోన్: 61777

ప్రత్యేక పట్టుచీరెల సెక్షన్

సెంటురోడ్డు ** గవర్నరుపేట ** విజయవాడ-2

సబబైనదో తెలిసివస్తుంది. అలాటి రచనను 'మంచి రచన' అనవొచ్చు.

పి. శ్రీనివాసస్వామి, బెల్లంపల్లి.

మీరు సెప్టెంబర్ సంచికలో ఓ ప్రశ్నకు సమాధానమిస్తూ "మహాకావ్యాలుగా పేర్కొనబడే రామాయణ-భాగవతాదులు కూడా భారతంలోవే" అని తెలిపారు. అది అచ్చు పొరపాటా? లేక నిజంగా భాగవత రామాయణాలు భారతంలోనివేనా? నేను మాత్రం రామాయణ భారతాలు భాగవతంలోని వనుకుంటున్నాను.

అచ్చయిన గ్రంథాలు ఉండగా అనుకోవటాలు దేనికి? మహాభారతం ఆరణ్య పర్వం-షష్ఠాశ్వాసము. సప్తమాశ్వాలలో రామాయణ గాథ ఉన్నది. ఇక భాగవతంలోని శ్రీ కృష్ణుడు భారతంలో ప్రముఖ పాత్ర వహించాడు కదా!

పి. హేమప్రభాకరరాజు, వుయ్యూరు.

'ఇజమ్‌ల' సంఘర్షణలో బడుగు వర్గాలు నలిగి వారి చెమట బిందువుల్లోంచి పిండిన రక్తం జీవనదుల్లా ప్రవహించడం తప్ప మనిషి మనిషిగా మనగలిగే 'సోషలిజమ్' మన

కొనుగోలుదారుల సంతృప్తియే
మా ఆశయం.




అశోక్
స్టోర్సు

* బీసెంటురోడ్
* విజయవాడ-2.

సరసమైన
ధరలు,
గ్యారంటీగల
వస్త్రములు,
సరికొత్తడిజైనులు
గల
పట్టుచీరెలకు
మాప్రత్యేకత!

వచ్చే నెల జవాబుకోసం ప్రశ్న:

సమస్య లన్నిటినీ పరిష్కరించే మహత్తర శక్తి ఏది?

జవాబు కోరిన ప్రశ్న

కలలు నిజమైతే, జీవితం సుఖకరమౌతుందా? ఎందుకని?

ధనికొండ జవాబు

అవదు. కలలు అన్నప్పుడు సుఖస్వప్నాల వలెనే, దుస్వప్నాలు కూడా నిజమే అవుతవికదా: పీడకలలు అక్కర్లేదంటే రాకుండా ఉంటవా? అందుకని కలలు నిజమైతే జీవితం సుఖకరం అవనేరదు

సమాధానంగా వచ్చిన వాటిల్లో యీక్రింది రెండు యెంట్రీలూ ఉత్తమంగా నిర్ణయించబడ్డాయి వీరిద్దరికీ బహుమతి మొత్తాన్ని పంచి ఇస్తున్నాము

ఒక్కొసారి దుఃఖకరంకూడా కావచ్చు ఎందుకంటే మనం ఊహించని చెడుకూడా కలలో జరుగుతుంది కాబట్టి?

ఎ ఎస్. రామకృష్ణ, హైదరాబాద్,4

కాకపోవచ్చు కలలన్నప్పుడు పీడకలలు తప్పవు

జి రంగనాయకమ్మ, జంగారెడ్డిగూడెం

—ధనికొండ హనుమంతరావు.

---

వ్యవస్థలో ఏనాటికైనా వస్తుందంటారా?

మనుషుల్ని కూడగట్టుకొని రాజకీయ నాయకులు ఏదో ఒక ఇజమ్‌పేర, తమ అధికారాన్ని చలాయిస్తూ, తమ బంధువర్గాల వారికీ, తమకూ కలిసివచ్చే పనులు చేసుకోవటం తప్ప, ఉపన్యాస వేదికలమీద వారు చెప్పే 'ప్రజలు-ప్రజారాజ్యం-ప్రజల సుఖం' మొదలైనవి నేతిబీరకాయలు నిజంగా ప్రజాసేవ చేయటమనే ఆదర్శాన్ని నమ్మినవారికి అధికారం అక్కర్లేదు వారుచేసే ప్రజాసేవకు ఎవరూ అభ్యంతరాలు చెప్పరు స్వయం సేవా పరాయణత్వానికి, ప్రజాసేవ కవచం: ఎవరికి వారు మానవత్వాన్ని అర్థంచేసుకొని ప్రయోగంలోకి తీసుకొని వస్తే అప్పుడు నిజమైన సోషలిజమే వస్తుంది అది సాధ్యమని నేను అనుకోవటం లేదు

పి భాస్కరరావు, పార్వతీపురం

మనిషి సంతోషంలో దుఃఖాన్నీ, దుఃఖంలో సంతోషాన్నీ ఎప్పుడు చవిచూస్తాడు?

గొప్ప వేదాంతి ఐనప్పుడు లేక మహాజ్ఞాని ఐనప్పుడు

రోజాచలం, బెల్లంపల్లి

తప్పులుచేయడం సహజం అనే విషయం తెలిసినప్పటికీ శిక్షలు

వేస్తారు. ఏమిటీ అంటే మళ్ళీ ఆ తప్పు చేయకుండా ఉండడాని కంటాము. శిక్ష అనుభవించినా మళ్ళీ తప్పులు చేసేవాళ్ళున్నారు. అంత మాత్రాన శిక్ష వేయడం దేనికి?

శిక్షలు ఉన్నవని తెలుసుకుంటే ఆ తప్పులుచేసి శిక్ష పొందట మెందుకని చాలామంది దూరంగా ఉంటారు. శిక్షా స్మృతి ఒక విధంగా భయపెట్టి సన్మార్గాన పొమ్మని ఆదేశిస్తూ ఉంటుంది. శిక్ష అనుభవించినంత మాత్రాన సద్వర్తనుడు అవుతాడనే నమ్మకంలేదు సరికదా, అంత కన్నా పెద్ద తప్పులు చేసేందుకు ప్రోత్సాహం లభిస్తుంది. అందుకని శిక్షలు లేకుంటే, భయపడి దూరాన ఉన్నవాళ్ళు కూడా తప్పులు చేసేందుకు వెనుకాడరు, కనుక శిక్షలు ఉండక తప్పదు.

యం. వి. లక్ష్మి, బొబ్బిలి.

నేడు వెలువడుతున్న అసంఖ్యాకమైన నవలల్ని పరిశీలిస్తే ఏ ఒక్కటీ సాహిత్యరీత్యా ఉత్తమమైనదిగా తోచడంలేదు. ఇవే వెలువడడానికి కారణం ఏమిటి? ఉత్తమ నవలా రచయితలు లేకపోవడమా? సామాన్య పాఠకలోకం ఈ రకం నవలలే మెచ్చడం కారణమా? లేక సంపాదక వర్గానికి కూడా ఉత్తమ నవలా నిర్ణయం చెయ్యడం తెలీక పోవడమా?

గత రెండు దశాబ్దాల్లోనూ మన పత్రికల సంఖ్యా పాఠకుల సంఖ్యా విపరీతంగా పెరిగింది. యీ పత్రికలన్నీ నింపేందుకు వాగన్‌ల పరిమాణంలో రచనలు అవసర మైనవి. ఈనాడు మనకు పాఠకులకన్నా

రచయితలే ఎక్కువా అనే సందేహం కూడా కలుగుతోంది. అచ్చయినవేవో చదువుతూనే ఉన్నారు; పత్రికలు అమ్ముతూనే ఉన్నవి. ఐతే ఉత్తమ రచనలు రావటం లేదనే ఫిర్యాదు వినవస్తూనే ఉన్నది. అది నిజం కూడాను. రచన Creative art; దానికి తగినంత వ్యవధి కావాలి. రచయిత బుర్రలో అది విల దోసుకొని రూపురేఖలు రూపొందించుకొని వాంతి వొచ్చిన విధంగా బైట పడాలి. అంత వ్యవధి ఉండదు కనుక ఏదో విధంగా రచన పూర్తి చేయటమే నేటి రచయితలు అనుసరిస్తున్న పద్ధతి. రాసినంత సేపు కూడా ఆలోచించలేక పోతున్నా రనిపిస్తుంది. మంచి అభిరుచులున్న సంపాదకులు మాత్రం ఏంచేస్తారు? వచ్చిన వాటిలో మంచివి ఏరి పేజీలు నింపక తప్పటంలేదు వారికి.

కె. వి. యస్. ఆచార్య, శ్రీకాకుళం.

పాఠకుల ప్రశ్నలలో ఉత్తమమైన దానికి బహూమతి ఇస్తామంటున్నారు. ఉత్తమ ప్రశ్న అని నిర్ణయించడానికి 'ప్రమాణం' ఏమిటి? జవాబు లిచ్చే వారు ఏ ప్రశ్నకు 'విజృంభించి' సమాధానం యివ్వగలరో దానినే ఉత్తమ ప్రశ్నగా భావించడం, ఆ ప్రశ్న వేసినవారిని (తన తెలివిని ప్రదర్శించడానికి అవకాశం కల్పించినందుకు) మెచ్చుకోవడం సహజం. అంచేత న్యాయనిర్ణయం సబబుగా ఎలా ఉంటుంది?

ఏ ప్రశ్నకు ఇవ్వబడే సమాధానం ద్వారా సామాన్యాభిప్రాయాలు ఎంత సత్యదూరంగా ఉంటవో తెలుసుకునేందుకు ఉపయోగపడటం, పదిమందికీ కొంతలో కొంతన్నా తెలిపిరావటానికి ఉపకరించే ప్రశ్న ఉత్తమమైనదిగా నిర్ణ



జ్యోతి ప్రారంభంనుంచీ మద్రాసు ఏజంటుగా వుంటున్న శ్రీ కుప్పుస్వామి చెట్టి, ఆగస్టు 6, 1977 న మరణించారు. సైకిలుపై ప్రయాణం, భుజానికి రేడియో, సైకిల్ క్యారియర్‌పై తెలుగు పత్రికల కట్టలు—శ్రీ కుప్పుస్వామిచెట్టిని తలచుకోగానే కనిపించే దృశ్యం. మంచిమనిషి—ఇన్నేళ్ళ వ్యాపార సంబంధాలలోనూ కనీసం ఒక్కసారి కూడా ఏ తేడా లేకుండా జ్యోతితో సంబంధం కొనసాగించిన విశిష్టత ఉన్నవాడు. ప్రచురణ కర్తలఎడల గౌరవం, లెఖలలో ఖచ్చితం. జరిగేది జరగక మానదన్న ఆందోళనా రహిత మనస్తత్వం—శ్రీ చెట్టి నిలబెట్టుకున్న సద్గుణాలివి. శ్రీ కుప్పుస్వామి కుటుంబానికి జ్యోతి ప్రగాఢ సంతాపాన్ని తెలుపుతోంది.

యించ బడుతోంది. మీరు రాసిన 'విజృంభణ' ద్వారా యీ నిర్ణయం జరగటం లేదు ఇదే నిజమైతే సెప్టెంబర్ సంచికలో 'లేడీస్ ఫస్ట్' ప్రశ్నకు జవాబు విజృంభించడానికి అనుకూలంగా ఉన్న విషయం తమకు తెలుసు, కాని ఆప్రశ్నకు ప్రధమ బహుమతి ఇవ్వబడలేదనీ తమకు తెలుసు తెలిసికూడా 'విజృంభణ' అడ్డంగా పెట్టుకొని మీరు విజృంభించటం సబబుగా ఉన్నదేమో ఆలోచించండి

ఈడుపల్లి వెంకటేశ్వరరావు, ఏలూరు

మీరు మగువ మనసును చదివినవారు నేను మీ 'మగువ మనసు'ను చదివిన వాణ్ణి నిజంగా మగువ మనసును మురిపించేది ఏమిటి? కాస్త క్లుప్తంగా చెబుతారా?

సృష్టికర్తనబడే బ్రహ్మదేవుడు కూడా జవాబివ్వలేని ప్రశ్న ఇది మగువ అగ్ని పర్వతంలాటిది అగ్ని పర్వత శిఖరం వలె, ముఖం ప్రశాంతంగా ఉంటుంది, అగ్ని పర్వతం వలెనే పీఠంలో పొగలు సెగలు కక్కే రసాయనిక పదార్థాలు మరుగుతూ ఉండి ఏ క్షణంలోనైనా అగ్ని పర్వతంవలె పేలి, పరిసర ప్రాంతాలను ధ్వంసం చేయవచ్చు.

వి రంగాచారి, కలకత్తా

'ప్రజాస్వామ్యం అంటే ప్రజల్ని అతిసులభంగా మోసంచేస్తూ, వారిని పరిపాలించే ఒక కళ' అనిఒకప్రముఖుడన్న దాంట్లో నిజం లేదంటారా?

ఎలా అంటాను? ప్రస్తుతం జరుగుతున్న చరిత్ర స్వరూపమే స్పష్టంగా తెలియచెబుతోంది కదా!

వచ్చే సంచిక

(నవంబరు '77)

నుంచీ

ప్రారంభం

కొత్త (మినీ) సీరియల్



# కథా రచయితలకు రచయిత్రులకూ

# ఆకర్షణీయమైన ప్రత్యేక పథకం

జ్యోతిలో ప్రచురితమయిన 'కథ'లలో ప్రతినెలా రెండు ఉత్తమ కథల నెన్నికచేసి, జ్యోతి, మామూలుగా యిస్తున్న పారితోషికం కాక అదనంగా ఆ రెండు కథలకూ ఒక్కొక్క కథకూ రు 75/- చొప్పున ప్రత్యేక పారితోషికం అందిస్తోంది జ్యోతి

అంతేకాదు—అలా ప్రత్యేక బహుమతి పొందిన కథలలో మూడింటికి—సంవత్సరాంతాన—జ్యోతి సంవత్సర బహుమతుల క్రింద (మొత్తం 12 నెలలలో ప్రత్యేక పారితోషికం పొందిన 24 కథలలో)

ఉత్తమ కథకు రూ 500/-, ద్వితీయ ఉత్తమ కథకు రూ. 250/-, తృతీయ ఉత్తమ కథకు రూ. 116/- ప్రత్యేక బహుమతులు అందజేస్తుంది జ్యోతి

జ్యోతిలోని ఉత్తమ కథల ఎన్నిక జ్యోతి సంపాదక శాఖ కాకుండా, అయిదుగురు ప్రముఖ రచయితలతో కూడిన ఒక కమిటీ చేస్తుంది

ఈ పథకం ఏప్రియల్ 1977 సంచిక నుంచీ ప్రారంభించబడింది.

సెప్టెంబరు '77 సంచికలో ప్రత్యేక పారితోషికం
పొందిన కథలు

బొమ్మ —రచన: పంతుల జోగారావు

వ్యథ —రచన తాడిమళ్ళ రామకృష్ణ

# సలహా

కొత్తకోడలు బెరుకుగా, బెదురుగా ముందుగది కిచెన్‌లోనే కూర్చుంది స్నానం పానం అయినా లేకుండా అసలా మనిషే అక్కడ లేనట్లుగా ప్రవర్తించ సాగారు పోగులు, పోగులు భార్య

పోగులు కొడుకు తనకి నచ్చిన పిల్లని‌ కానీ కట్నం లేకుండా రిజిష్టర్ మేరేజ్ చేసుకుని, పెళ్ళాన్ని ఇంటికి తీసుకు రావ  డంతో ఇంట్లో పెద్ద గాలి దుమారం లేచి, క్రమంగా తగ్గింది

పోగులు స్నేహితుడు జోగులు సాయంత్రం పోగులు ఇంటికి వచ్చాడు పరిస్థితి గ్రహించాడు

"ఒరే పోగులూ, నా మాట విను శాఖ వేరైనా మన కులమేగా, పైసా కట్నంలేదని వాళ్ళమీదకి విరుచుకు పడితే ఇక నీ గడప తొక్కరు ఉన్న ఆ ఒక్క కొడుకునీ దూరం చేసుకుంటే ఎలా? " తగు రీతిలో హితబోధ చేసాడు.

పోగులుకి కోపం తగ్గకపోయినా కొద్దిగా మెత్తబడ్డాడు

"నీకేం ఫర్వాలేదోయ్! అయినా మరీ సివిల్ మేరేజ్ ఏమిటి? కనీసం గుళ్ళో నైనా చేసుకుని వుండాల్సింది జాగ్రత్తగా మెసులుకోండి " చెప్పాల్సిన నాలుగు మాటలు జోగులు పోగులు కొడుక్కి చెప్పి తండ్రీ కొడుకుల మధ్య రాజీ కుదిర్చి వెళ్ళాడు

కాలం నిజంగానే రాజీ కుదిర్చింది అత్తా కోడళ్ళ మధ్య తండ్రీ కొడుకుల మధ్య

నాలుగు సంవత్సరాలతర్వాత ఓరోజు .

"నాకీ కోడలు అవసరంలేదు అసలు నాకు కొడుకే పుట్టలేదనుకుంటాను తక్షణం ఇద్దరూ బయటకి నడవండి "

ఒక రోజు పోగులు ప్రక్క ఇంట్లో వుండే జోగులు ఇంటి పెంకులు ఎగిరి పోయేలా అరవడం, మనవడితో ఆడు కుంటూన్న పోగులుకి, పోగులు భార్యకీ వినబడ్డాయి

ఇద్దరూ ఒకరి మొహాలు మరొకరు చూసుకున్నారు తెల్లబోతూ

"కోపంమీద వున్నట్లున్నాడు నే సర్ది చెబుతాను" అన్నాడు పోగులు హడావిడిగా లేస్తూ

భర్తకి కండువా అందించింది పోగులు భార్య, ప్రక్క వాటాలోని పరిస్థితి గ్రహించి

—మల్లాది వెంకటకృష్ణమూర్తి



సీరియల్

# పుణ్యభూమీ కాస్త కళ్ళు తెరు



బీనాదేవి

జరిగిన కథ

జగన్నాధం జానకి ముచ్చటగా సంసారం చేసుకొంటున్న దంపతులు. జగన్నాధం పిల్లల సంగతి పట్టించుకోనందుకు భార్య నొచ్చుకొంటే ఈయన నచ్చజెప్పే ముచ్చట్లే ఎక్కువ వారిమధ్య పొరుగింటి భ్రమరాంబ మాటల మధ్యలో జగన్నాధానికి ఊళ్ళో ఇల్లుందని చెప్పేసరికి జానక్కి మరీ కోప మొచ్చింది, భర్తమీద. ఆలోచించ టానికూడా వర్జం చూడమనే తత్వం జగన్నాధం నాన్నగారిది. జగన్నాథం ఉండ బట్టలేక 'ఆలోచనలు వర్జం చూసుకొని వస్తాయటండీ' అనేశాడు తండ్రితో ఒకసారి.

నారాయణమూర్తిగారికీ నాంది ప్రస్తావనలేం నచ్చలేదు. జగన్నాధం చెప్పేవేవీ అతను వినదల్చుకోలేదు అంచేత "అవి చూసుకోవుగానీ మనం చూసుకో వచ్చండీ" అనేసి అక్కడనుండి వెళ్ళిపోయేరు

యింక శలవలై పోయేక మళ్ళీ మద్రాస్ ప్రయాణం అంటే యజ్ఞ వేఁ అత నెప్పుడూ శలవలు యింకా వారంరోజు లుండగానే వెళ్ళిపోవడవేఁగాని, రేపు కాలేజీ అంటే యివేళ బైల్దేరి ఎప్పుడూ ఎరగడు.

"అసలు శలవులే వుండవు ఆ వున్న నాలుగురోజులయినా పిల్లడు కంటిముందు వుండకుండా ముహూర్తాలు, మట్టి గడ్డలునూ" అని చాటుగా విసుక్కునేవారు సుభద్రమ్మగారు

పాపం నారాయణమూర్తిగారు మాత్రవేంచేస్తారుఃవారం కుదిరితే తిథి కుదరదు. యీ రెండూ కుదిరితే నక్షత్రం కుదరదు యీ మూడూ కుదిరిననాడు శుభమైన ముహూర్తం కుదరదు అవలా తగలడ్డప్పుడు తను ఏం చెయ్యగలడు? ఎలాగైతే నేం నారాయణమూర్తిగారూ, జ్యోతిష్కుడూ రెండ్రోజులు పంచాంగంతో కుస్తీ పట్టగా రేపు సాయంకాలం రైలుకి యివేళ అర్ధరాత్రి ఓ ముహూర్తం కుదురుతుంది. ఆ టైముకి బస్సులుండవు రైలు స్టేషను అక్కడికి పదిహేను మైళ్ళు ఇప్పటిలా అప్పుడు గంటకో రైలులేదు జగన్నాధం చేసుకున్న అదృష్టం అతని ఫ్రెండుకారు కొనడం అర్ధరాత్రివేళ దేవుఁడామని స్టేషనుకిపోయి, మర్నాడు సాయంత్రం వరకు ప్లాట్ఫారం మీద భజనచేసి రైలెక్కడం జగన్నాధం చేసే యజ్ఞాలలో ఒకటి.

ఓసారి "యీ ముహూర్తానికి తిరుగులేదు బ్రహ్మాండమైన పెళ్ళి ముహూర్తం మనవాడికి యీసారి ఫస్ట్క్లాస్ వస్తుంది" అని ఆ ముహూర్తాన్ని తలచు కొని బ్రహ్మానంద భరితుడై పోయేవాడు, ఆయన ఆసారి వెళ్ళిన వారం తిర క్కుండానే జగన్నాధానికి డబుల్ టైఫాయిడ్వచ్చి చచ్చి బతికేడు ఆ సారతను పరీక్షకే కూర్చోలేదు "ఫస్ట్క్లాస్మాట దేవుఁడున్నాడు పిల్లడు బతికి బట్టకట్టేడు. అంతేచాలు" అని సంతోషించేరు సుభద్రమ్మగారు, కాని నారాయణమూర్తిగారలా సంతోషించలేదు. "ఎక్కడో లెక్క తప్పినట్టుంది" అని ఎక్కడ తప్పిందో చెప్ప మని జ్యోతిష్కుడి పిలక పట్టుకున్నారాయన ఆ జ్యోతిష్కుడు గడగడ వణికి పోయేడు నారాయణమూర్తిగారి క్కనక తనమీద గురితప్పితే యింక తనపని సరి

"ఉండండి బాబూ. మళ్ళీ ఓసారి ఆ ముహూర్తాన్ని చూద్దాం. ఆ ముహూర్తం తప్పడానికి వీల్లేదుమరి" అన్నాడు పిలకని విడిపించుకుంటూ, పంచాంగం తీసుకొని

మళ్ళీ ఇద్దరూ ఓ గంటసేపు పంచాంగంతో కుస్తీ పట్టేరు అరవై ఒకటో నిముషంలో జ్యోతిష్కుడు ఓ గావుకేక పెట్టేడు సంతోషంతో.

"దీని తల్లి సిగదరగ ఎంత పనిచేసిందిః"అన్నాడు పంచాంగం పక్కనపెటి

నారాయణమూర్తిగారికి ఆత్రం పెరిగిపోయింది అసలు సంగతి చెప్పకుండా కట్టుకొచ్చిన గొడ్డులా ఏవిఁటా గావుకేకలూ వీడూను "ఏవిఁటయ్యా అది?"

"చవిఁతండి బాబూ చవిఁతి మనిద్దరం చూశ్శేదు నేను చూశ్శేదని కాదు చూశేననుకోండి అయినా "మంత్రి అంతటివాడు మన పక్షంవుంటే మునిసిపాలిటీ జవానేం చేస్తాడని" అంత గొప్ప ముహూర్తాన్ని వెధవ చవితేం చేస్తుందిలే అనుకున్నాను కానండి ఎంత చెప్పినా మంత్రి మంత్రే జవాను జవానే వాడిపని వాడు చేశాడు వీడిపని వీడూ చేశేడు అబ్బాయిగార్ని మంచం ఎక్కించింది ఎవరనుకున్నారు? ఇదిగో యీ వెధవ చవిఁతి" అంటూ పంచాంగంమీద చేత్తోకొట్టేడు అక్కడ చవిఁతి వున్నట్టు "అయితేనేం మంచంనుంచి దింపేకుండా పట్టుకున్నదెవరు. హదిగో. ఆ ముహూర్తబలం" హమ్మయ్యా! ఇంకెప్పుడూ యిలాంటివి అశ్రద్ధ చెయ్యకూడదు బాబూ" అంటూ కనిపించని దేవుడికి దండంపెట్టి లెంపలేసుకున్నాడు

అదన్నమాట సంగతి. అమ్మయ్య అనుకున్నారు నారాయణమూర్తిగారు అయినా యింకెప్పుడూ యిలాంటి చిన్న విషయాలు అశ్రద్ధ చెయ్యొద్దని హెచ్చరించేరు అతన్ని.

అన్నట్టు ఆ జ్యోతిష్కుడి పేరు భరతశాస్త్రి

అసలు జగన్నాథం మెడిసన్ చదవడమే ఓ బ్రహ్మప్రళయం అయిపోయింది. జగన్నాథం ఇంటర్‌లో M P C గ్రూపుల్తో మంచి మార్కుల్తో పాసైయ్యేడు. ఆ కాలంలో M P C గ్రూపంటే గ్రూపులన్నిటిలోకి రాచగ్రూపు లాంటిది రాజుగారికి అన్ని చోట్లకీ ప్రవేశంవున్నట్టు ఆ గ్రూపువాళ్ళు ఇంజనీరింగు. డాక్టరు. లాయరు ఏది కావాలంటే అది చదువుకోవచ్చు కాలేజీలో ఆ గ్రూపువాళ్ళు మిగతా గ్రూపువాళ్ళని ఏనుగు ఎలకపిల్లని చూసినట్టు సింహం చవఁలపిల్లిని చూసినట్టు జాలిగానూ, చులకగానూ చూశేవారు

ఇంటరయ్యేక జగన్నాథం మెడిసన్ చదువుతానన్నాడు "అన్నిటికీ నీ ఇష్టమేనా జాతకం వప్పుకోవద్దా?" అన్నారు నారాయణమూర్తిగారు వెంటనే భరతశాస్త్రీ నారాయణమూర్తిగారూ జెమిలిగా యుద్ధం చేశారు జగన్నాథం జాతకంతో. వరసగా రెండు రాత్రిలు, మూడు పగళ్ళు నాలుగోనాడు రిజల్టు ఎనౌన్సు చేశేరు ఏ పరిస్థితులోను జగన్నాథం మెడిసన్ చదవటానికి వీల్లేదని జగన్నాథం జాతకం ప్రకారం అతని విద్యాస్థానంలో వున్నగ్రహం వ్యాపారవేఁ జేయిస్తాట్ట వాడసలు సైన్సు గ్రహంకాడుట అంచేత జగన్నాధం బి కాం చదవాల్సిందే

జాతకం సంగతి నాకు తెలీదు కాని నేను మాత్రం చదివితే మెడిసన్ చదువుతాను లేకపోతే ఇంట్లో కూర్చుఁటాను కాని ఛస్తే బి కాం చదవనన్నాడు జగన్నాథం వీల్లేదన్నారు నారాయణమూర్తిగారు




నిరాహార దీక్ష చేస్తానన్నాడు కొడుకు

“అవశ్యం” అన్నాడు తండ్రి.

తండ్రీ కొడుకుల మధ్య తల్లి ప్రాణం నలిగిపోయింది ఇద్దరికిద్దరూ ఒకటే. ఎవరూ లొంగలేదు ఆఖరికి ఆవిడ వాళ్ళిద్దరూ చూడకుండా భరతశాస్త్రిని బతిమాలింది నాకున్నది ఒకటే కొడుకు వాడ్ని నాకు గాకుండా చెయ్యొద్దంది గ్రహాల దేవుంది మనవెఁలా చెప్తే అలాగే వింటాయి కాస్త శాంతి చేయిస్తే సరి అని భరత శాస్త్రికి అయిదువందల రూపాయలు శాంతిచేసేరు సుభద్రమ్మగారు

ఆ మర్నాడు “పంతులుగారూ మీకో శుభవార్త” అంటూ వచ్చేడు భరత శాస్త్రి

ఏవిఁటన్నట్టు చూశేరు పంతులుగారు చదువుతున్న కేసు కట్టలు పక్కన పెట్టి.

“నిన్న మనం సరిగ్గా చూడలేదు గానీండి అబ్బాయి జాతకంలో విద్యాస్థానంలో సైన్సుగ్రహం లేనిమాట నిజమేకాని ఆ పక్కింట్లో గురుడున్నాడే, వాడిటే చూస్తున్నాడు నిజానికి విద్యాస్థానంలోవున్న కుజుడికికొంచెం బలం తక్కువగానే వుంది మరి అసలు అధిపతి నీరసించిపోతే మరింక గురిడిదే బలం. అంచేత అబ్బాయి మెడిసన్ చదవడానికేం అభ్యంతరం వుండదు మరి” అన్నారు అభ్యంతరం అంతా మీదేనన్నట్టు. యింక తనది గ్రహాలదీ ఏవీఁలేనట్టు

ఈ వెధవగ్రహాలు అడ్డురాకపోతే తన కొడుకు ఏం చదివినా తనకేం అభ్యం

తరం వుండదు నారాయణమూర్తిగారికి

అలా వెళ్ళేడు జగన్నాధం మెడిసన్కి

కష్టాలెప్పుడూ ఎవరితోనూ చెప్పిరావు పర్మిషను తీసుకొని కూడా రావు ఇన్కమ్ టాక్సు వాళ్ళలా వార్నింగు లేకుండా వచ్చేస్తాయి నారాయణమూర్తిగారు వుంటున్న యింటిగల వాళ్ళకి కూడా ఆడపిల్లల పెళ్ళిరూపంతో వచ్చేయి కష్టాలు. మరంచేత వాళ్ళా యిళ్ళు అమ్మేస్తాం అన్నారు ఏ నాడూ ఏ కోరికా లేని సుభద్రమ్మగారికెందుకో యీ ఇల్లు మనవే కొనుక్కుందాం అనిపించింది ఈ ఇంటికొచ్చేకే జగన్నాధం పుట్టేడు ప్రాక్టీసుకూడా బాగానే వుంది అచ్చొచ్చిన యిల్లు యింకోళ్ళకి వదిలేడం దేనికి. వున్న ఒక్క కొడుక్కి ఆస్థిరూపంలో కాణీకూడా యివ్వకపోయినా కనీసం తల దాచుకోడానికో గూడైనా యివ్వకపోతే ఎలా అనిపించిందావిడకి

విష్ణువు పేరెత్తితే వీపు చీరేస్తానన్నాడు హిరణ్యకశిపుడు
ఇల్లు పేరెత్తితే యింట్లోంచి వెళ్ళిపోతానన్నారు నారాయణమూర్తిగారు
ప్రహ్లాదుడ్ని భగవంతుడు నరసింహావతారంలో వచ్చి రక్షించేడు.
సుభద్రమ్మగార్ని భగవంతుడు భరతశాస్త్రి రూపంలో ఆదుకున్నాడు

"పంతులుగారూ మీకు యిప్పుడు ఏ దశ నడుస్తోంది!" అడిగేడు భరతశాస్త్రి

చెప్పేరు పంతులుగారు

బుర్రగోక్కున్నాడు భరతశాస్త్రి తరవాత కాస్సేపు వేళ్ళు లెక్కపెట్టేడు. "యీపాటికి చేసెయ్యాలే. ఇంకా చెయ్యలేదేం చెప్మా?" అని గొణుక్కున్నాడు

"ఏవిటయ్యా" అన్నారు పంతులుగారు

"ఈ అంతర్దశలో మీకు గృహప్రవేశయోగం కనిపిస్తోంది మరి ఆ కుజుడు పోతూపోతూ మంచి చేసిపోతాడు మరి మీరేమో " అని ఆగేడు

"తప్పదంటావా?"

"ఔననడానికి, కాదనడానికి నేనెవర్ని మధ్య? మీరు గృహప్రవేశం చెయ్యాలి. తప్పదు మరి జాతకం తప్పించడం ఎవరితరవంటారు?" అన్నాడు భావగర్భితంగా సుభద్రమ్మగారివేపు చూసి

"నాకు అసలు ఆస్తి—స్థిరంకాని చరంకాని- వుండడం యిష్టం లేదయ్యా"

భళ్ళున నవ్వేడు భరతశాస్త్రి

"పంతులగారికేం అమాయకత్వం అన్నం తింటావా అన్నం తినడానికో కంచమో, గిన్నో వుండాలా వద్దా? అది ఆస్తి అవుతుందా? గుడ్డముక్కలు కట్టుకుంటాం. అవి దాచుకోవడానికి ఓ పెట్టెగావి, బీరువాగాని వుండాలా? అలాగే యీ శరీరం దాచుకోవడానికొక గూడు వుండాలంటారా? ప్రతి ప్రాణికి ఓ గూడుండాలి. ఏవంటారు? మరింక ఆ గూడు స్వంతం అయితే యింకోడు ఎప్పుడైనా పొమ్మంటా

దేమోనన్న భయం వుండదు ఏవిఁటండీ మీ వెర్రితనం! కంచెం, గిన్నె, బీరువా ఎంతో ఇల్లూ అంతే " అని ఆస్తి అన్న పదానికి ఇల్లు అన్వయించదని విడ మార్చేరు

నారాయణమూర్తిగారికెందుకో యీ ఆర్గుమెంటు నచ్చింది

"సుభద్రా సాయంత్రం యింటిగలవాళ్ళకి కబురు చెయ్యి" అన్నారు.

అదిగో అలా సంక్రమించింది జగన్నాధానికా యిల్లు ఆ యిల్లు కొన్న ఆర్నెల్లకే జగన్నాధం చదువు. పెళ్ళి రెండూ అయిపోయేయి ప్రాక్టీసు పెడదావాఁ, ఉద్యోగం చేద్దావాఁ అని జగన్నాధం తేల్చుకోవడానికి మరో ఆర్నెల్లు ఊరికే కూర్చో వడం యిష్టంలేక బోర్డు కట్టేడు ఆ టైములోనే నారాయణమూర్తిగారు. సుభద్రమ్మ గారు కూడబలుక్కున్నట్టు రెండు నెలల తేడాలో జగన్నాధాన్ని వదిలి శాశ్వతంగా వెళిపోయేరు తల్లి, తండ్రిలేని ఆ ఇంట్లో ఒక్క క్షణం కూడా వుండాలనిపించలేదు అతనికి అంచేత అతను గవర్నమెంటు సర్వీసులోకి వెళ్ళిపోయేడు అప్పుడా ఇల్లు అతనికో సమస్య అయిపోయింది "అమ్మేద్దాం" అంది జానకి

ఆ ఇంటికోసం తల్లి పడిన బాధలు అతనికి తెలుసు అంచేత అతనికి అమ్మ డానికి సెంటిమెంటు అడ్డొచ్చింది "అద్దెకిచ్చీ" అన్నారు ఊళ్ళోవాళ్ళు ఛః ఛః అద్దెకివ్వటం ఏవిఁటి? ఆ మాటే అతనికెంతో ఆక్షేపణగా వినిపించింది

"మీకేం మతుందా పోయిందా? ఇల్లు అద్దెకీ యివ్వక, అమ్ముకోక ఏం చేస్తారు? రేపు మనం యింకో ఊర్లో అద్దెయింట్లో వుండవాఁ ఏఁవిఁటి? ఊరికే వుండ మంటే చేదా ఏఁవిఁటి? ఊరంతా ఎగబడతారు నంగిరితనం మానేసి అద్దెకిచ్చేద్దాం" అని జానకి నాలుగు దులిపేసింది

అదిగో సరిగ్గా అదే టైములో వచ్చేడు అతని దగ్గరికి ప్రకాశరావు.

ప్రకాశరావు, జగన్నాధం ప్రాణస్నేహితులు కారు కాని స్నేహితులే ఇద్దరూ ఆ ఊరి హైస్కూల్లో S S L C. వరకూ కలిపి చదువుకున్నారు ప్రకాశరావు మరింక పైచదువుకి అవకాశం లేక చదువంతటితో ఆపేసి మందుల షాపు పెట్టు కున్నాడు ప్రకాశరావు తండ్రి తాసిల్దారు చేసి రిటైరయ్యేడు ఆ డిపార్టుమెంటులో ఎంత అవకాశం వుంటుందో అంతా ఆర్జించేడతను అతనికి జగన్నాధం తండ్రిలా ఆస్తి వుండకూడదన్న ప్రిన్సిపల్ ఏంలేకపోయినప్పటికీ అతను పోయిన్నాటికి ప్రకాశ రావుదగ్గర దహనం ఖర్చులు కూడా లేవు ఆర్జించినదంతా అతను ఆడవాళ్ళ కోకలకీ, పేక ముక్కలకీ ముడివేసేసేడు తండ్రి పోయిన్నాటికి ప్రకాశరావుకి మిగిలినవి— పదివేల రూపాయల అప్పు, పందెపు గుర్రాల్లా పెళ్ళికి ఎదిగున్న నలుగురు చెల్లెళ్ళు ఇవి కాక ఏటాకానుపో, ఎబార్షనో అయే ఒక ఎండిపోయిన పొట్లకాయలాంటి పెళ్ళాం, ముగ్గురుపిల్లలు తండ్రి మిగిల్చిన అప్పుకి కనీసం వడ్డీ అయినా చెల్లిపెట్టగలుగు

తున్నాడు కాని, ఒక్క చెల్లెలికైనా పెళ్ళి చెయ్యలేకపోయేడు ఇప్పుడు తన యింటి వాళ్ళు యిల్లు అర్జంటుగా ఖాళీచేసేమన్నారు ఊర్లో ఎక్కడా అతనికి యిల్లు దొరకలేదు దొరికిన ఒకటి రెండింటి అద్దె అతను భరించలేడు యిదీ అతని పరిస్థితి

"బాబ్బాబు ఎలాగైనా నీ ఇల్లు నాకియ్యి నువ్వనుకున్న అద్దె యివ్వలేను కాని ఎంతో కొంత యిస్తాను. నీ ఋణం వచ్చే జన్మలో నీ ఇంటి ఇటుకనై పుట్టి తీర్చుకుంటాను" అంటూ బతిమాలేడు

అతని పరిస్థితి విన్న జగన్నాధం గుండె నీరై కంట తిరిగింది

"చూడారే ప్రకాశ్ మరింక నువ్వలా బతిమాలకు నీ యిష్టమొచ్చినన్నాళ్ళు వుండు నీ దగ్గరున్నప్పుడు నీ యిష్టమొచ్చినంతయియ్యి డబ్బు" అని ఆ ఇల్లు ప్రకాశరావు కిచ్చేశేడు

"పరిస్థితులు ఎప్పుడూ ఒక్కలా వుండవు మనుష్యులూ ఎప్పుడూ ఒక్కలా వుండరు అంచేత అతను యిచ్చినా, యివ్వకపోయినా అద్దె యింత అని అనుకోండి ఎందుకైనా మంచిది" అని జానకి ఎంత చెప్పినా జగన్నాధం విన్లేదు కాని ప్రకాశరావే నెలకి యాభై యిస్తానన్నాడు నిజానికాయిల్లు యింకెవరికిచ్చినా నూటయాభై కి కళ్ళకద్దుకొని కొబ్బరికాయకొట్టి మరీ తీసుకుంటారు ఇల్లే కాకుండా ఇంట్లోవున్న తండ్రి తాలూకు కుర్చీలు, టేబిల్సు, పెద్ద పందిరి మంచం, బీరువాలు కూడా "యీ సామానంతా ఊరూరా నే నెక్కడ తిప్పగలను? నువ్వే వాడుకో" అంటూ అక్కడే వదిలేశేడు

"ఇంక మనం యీ ఊరువస్తామా? ఒకవేళ వచ్చినా అంతవరకు యీ సామాన్లుంటాయా? నా మాటవిని అవన్నీ ఏదో ధరకి అమ్మేయండి ఆ డబ్బుతో మనం మళ్ళీ సామానుకొనుక్కోవచ్చు" అన్న జానకి మాటలు అతను విన్లేదు

అలా ఆ ఇల్లు ప్రకాశరావు తీసుకున్న ఏడాది తిరక్కముందే అతని చెల్లెళ్ళిదర్నీ అమ్మవారు ఒకేసారి ఎత్తుకుపోయింది మరో చెల్లెలు పక్కింటి కుర్రాడితో పట్నం లేచిపోయింది పెళ్ళి చేసుకుంటున్నానని చీటీరాసి ఈ యింట్లో దిగిన వేళా విశేషం చాలా మంచిదనుకున్నాడు ప్రకాశరావు

అతనా యింట్లో దిగి దగ్గరదగ్గర పదిహేడేండ్లో ఎంతో అవుతుంది ఇప్పుడు ప్రకాశరావుకి బేంకులో సుమారు డెభై వేల రూపాయల ఎకౌంటు వుంది అతని భార్యవంటిమీద ఓ యాభై కాసుల బంగారం వుంది అతని కొడుకు ఇంజనీరింగు కాలేజీలోను, కూతురు మెడికల్ కాలేజీలోను వున్నారు. అతని మందులషాపుకి 'మందు' షాపు కలిసింది అయితే అతను జగన్నాధానికి మాత్రం ఏడాదికో యాభై రూపాయలు దిగదుడిచి పంపిస్తాడు

అందుకే జగన్నాధం తనకో ఇల్లుంది అన్నసంగతి మర్చిపోయేడు.

యిదీ ఆ ఇంటి కథ.




## 5

తుఫాను వెలసిపోయినా, దాని ఎఫెక్ట్ కొంత కాలం వుంటుంది భ్రమరాంబ వెళ్ళిపోయినా, ఆవిడన్న మాటలు యింకా జానక్కి వేదఘోషలా వినిపిస్తూనే వున్నాయి

"చెప్పుడు మాటలు చెడ్డవి" అన్నవాళ్ళెవరోగాని అంత అనుభవంలేని వాళ్లై వుంటారు అనుకుంది జానకి అన్నీ కాకపోయినా కొన్నైనా మంచివి వుంటాయన డానికి భ్రమరాంబ మాటలే నిదర్శనం

"మీ మొహానికో ఇల్లుంది" అని జ్ఞాపకం చేసింది

"ఆ ఇంటిని బాగుచేయించి అద్దెకిస్తేరెండువందల రూపాయిల అద్దె వస్తుంది నెలకి" అని ఆశ చూపించింది

థేంక్స్ టు భ్రమరాంబ!

నెలకి రెండువందల రూపాయలు!!

ఎన్ని అవసరాలు తీరతాయి? అసలిటుపైన అప్పు చెయ్యవలసిన అవసరమే వుండదు కొంచెం జాగ్రత్తగా వుంటే పాత బాకీలుకూడా తీర్చుకోవచ్చు

బాకీలంటే జ్ఞాపకం వచ్చింది అసలీ అప్పులన్నీ ఎలా తీర్చుదాం అనుకుంటు న్నాడో ఇతను? దగ్గర దగ్గర రిటైరయ్యేవరకూ పిల్లలు చదువులు అవవు ఆ తరవాత ఎవరిమట్టుకు వాడు పోతాడు. మరింక ఎప్పుడు తీర్చేటట్టు. అయినా యిదేం మనిషో

అప్పు భయంలేదు డబ్బు బెంగలేదు. ఛీ! ఛీ!! ఇంటి మొగాడికి బాధ్యత తెలీకపోతే అంతకంటే మహాపాపం మరోటిలేదు

"నీకేవేఁ దేఁవుఁడిలాంటి మొగుడు ముత్యాల్లాంటి పిల్లలు" అని ఎవరైన అన్నప్పుడు వాళ్ళవి లాగిలెంపకాయకొట్టాలనిపిస్తుంది తనక్కావల్సింది మామూలు మనిషిలాంటి మొగుడు దేవుఁడుకాదు

దేవుఁడికి వుంటే ఓ కొబ్బరికాయ కొట్టాం లేకపోతే దణ్ణం పెట్టేసి వూరుకుంటాం కాని అతన్తో కాపరం చెయ్యం అంచేత దేవుఁడెలాంటి వాడైనా ఫరవాలేదు. నిజవేఁ పిల్లలు ముత్యాలే కాని ఎంత మంచి ముత్యాన్నైనా ఓసారి తుడుచుకోవాలి జాగ్రత్త చేసుకోవాలి లాభంలేదు యింక యీ పూట యితన్ని శుభ్రంగా కడిగెయ్యాలి

జానకి రిహార్సలు పూర్తిఅవకుండానే వచ్చేశేడు జగన్నాధం

అతను లేనంతసేపూ యిలా తిడదాం, అలా దులిపేద్దాం అనుకోవడమేగాని. తీరా అతనికెదురుగా అక్షరం పెగల్దు జానక్కి

"చిన్నప్పుడు తెలీక డాక్టరు మోజులోపడి యీ ముష్టిమెడిసన్ చదివేను కాని నేనే గనుక 'లా' చదివుంటే, యీ లాయర్లందర్నీ బరానీల్లా నమిలేసివుండేవాడ్ని" అని జగన్నాధం అస్తమానూ విచారిస్తాడు అందులో అబద్ధంకూడాలేదు. ఎలాంటివాడినైనా మాటల్తో గెల్చేస్తాడు "నా వాక్‌స్తానంలో బృహస్పతి వున్నాట్ట" అనికూడా అంటాడు

"వాక్‌స్తానంలో ఎవరున్నారో కాని వ్యయస్తానంలో మాత్రం శని వున్నట్టున్నాడు" జానకి సందేహం

"ఎవరెక్కడవున్నా మన బతుకులు మాత్రం వున్న చోటనుండి కదిలేటట్టులేవు" అన్నది ఆవిడ భయం

ఈ పూట మాత్రం తెగించి అతన్తో దెబ్బలాడ్డానికే నిశ్చయించుకుంది. నిశ్చయించుకున్నాక మరింత ఆలస్యం ఎందుకని "ఇప్పుడు మీకేఁవైనా పనుందా?" అంది కాఫీ యిస్తూ నాందిగా

జగన్నాధం డాక్టరు, తెలివైన డాక్టరు

కాఫీ అందుకుంటూ జానకివేపు చూశాడు

కట్టుకున్న ఎర్రచీర రంగు కళ్ళల్లోకి రిఫ్లెక్టై, ఆవిడ కళ్ళల్లో డేంజర్ లైట్లు కనిపించేయి అతనికి

"కోపం భోంచేస్తోందీవిడ" అని గ్రహించినవాడై, "ప్రస్తుతానికేం లేదు, నువ్వు చెప్తే తప్ప" అన్నాడు నవ్వుతూ

"నవ్వేలావస్తోందీ?"

"ఏం? మీనాన్నగాని పోయేడా ఏఁవిఁటి కొంపదీసి? మరి మొదటే చెప్పలేదేం? టెలిగ్రాం వచ్చిందా? ఎంత పాపాత్ముడైనా యింకొన్నాళ్ళుండాల్సింది ఏం చేస్తాం. వెరీసారీ" అన్నాడు తాగుతున్న కప్పు అంచు మీంచి చూస్తూ

ఆ కప్పు లాక్కొని గిరగిరా తిప్పి విసిరేస్తే?

మళ్ళీ కప్పుకొనాలి అదో దండుగ

"పిల్లలకి ఫీజులు కట్టాలి."

"ఔను "

"బట్టలు, పుస్తకాలు కొనాలి "

"వచ్చినట్లు . "

"ఏవాఁలోచించేరు?"

"నేనేం ఆలోచించలేదు "

"మరెలా? "

జగన్నాధం కాఫీకప్పు టేబిలుమీద పెట్టి సిగరెట్టు వెలిగించాడు

"మాట్లాడరేం?"

సిగరెట్టు ఏష్ట్రేలో దులిపేడు

"చెవిఁటాడి ముందు ఫిడేలు వాయిస్తే, ఆ తీగలు తెంపడం నీ అభ్యతరం కాదన్నాట్ట, అలావుంది మీ వ్యవహారం నా మాటలు వినిపిస్తున్నాయా?"

వినిపిస్తున్నాయి అర్థంకూడా అవుతున్నాయి

"ఉపోద్ఘాతాలు ఆపేసి ఏంకావాలో ఒక్క ముక్కలో చెప్పు."

"డబ్బు "

"నా దగ్గరలేదు "

"లేదంటే సరిపోతుందా?"

"నేనోమాట చెప్తాను సిన్సియర్‌గా చేస్తావా?"

తలూపింది

"గుంట వెధవల్ని చదువులు మానిపించి మొగ గుంటలకి తలో కొరడా యిచ్చేసి జట్కా తోలుకోమను ఆడపిల్లని వంట నేర్చుకోమను" అగ్గిపుల్లదండు గెందుకని సిగరెట్టుతోనే మరో సిగరెట్టు వెలిగించేడు తాపీగా

"కొరడాలూ, జట్కాలూ మాత్రం ఊరికే పంచుతున్నారా?"

"చూడమ్మా జానకమ్మా ఇవేళ నీ మూడ్ బావుఁన్నట్టులేదు అలా బావు లేకపోవడం నీ తప్పుకాదు మీ బాబు నీకు చదువేఁ చెప్పించేడు గాని జనరల్ నాలెడ్జి చెప్పలేదు అసలు మనమెవరం? ఏఁవిఁటి మన పరిస్తితి? ఇవి గనక తెలిస్తే మరింక మూడ్ పాడయ్యే ప్రసక్తే వుండదు అంచేత నాకింకో కప్పు స్ట్రాంగ్ కాఫీ యిచ్చి, ఎదురుగా చేతులు కట్టుకొని కూర్చో జ్ఞానోపదేశం చేస్తాను "

ఇంటింటా వాడుతున్న
కల్పనా ప్రొడక్ట్స్
కుటుంబంలో
అందరికీ కావాలి



- కల్పనా స్నో
- కల్పనా ఫేస్‌పౌడర్
- కల్పనా నైల్‌పాలిష్
- కల్పనా సెంట్స్
- కల్పనా బ్రిలియన్‌టైన్
- నవా హెయిర్ ఆయిల్
- గ్లూకోస్-డి



MFG.:
కల్పనా ప్రొడక్ట్స్
పాలకొల్లు.

మరో కప్పు కాఫీ తెచ్చింది కాని చేతులు కట్టుకూర్చోలేదు అసలు కూర్చోనేలేదు లేచి వంటింట్లోకి వెళ్ళిపోతున్నదాన్ని జగన్నాధమే చెయ్యిపట్టుకొని కూర్చోపెట్టేడు కూర్చున్నాక సగం కాఫీ సాసర్లోపోసి యిచ్చేడు, జానక్కి-

"నాకు మీ ఆడవాళ్ళని చూస్తే జాలేస్తుంది సుమీ ఐ రియల్లీ పిటీ యూ మా మొగాళ్ళకి మూడ్ బావు లేకపోతే ఓ అరడజను సిగరెట్లు కాల్చేస్తాం లేకపోతే ఓ నాలుగు పెగ్గులు వేసేసుకుంటాం బస్ మరి మీరో? అలా తల్చుకొని, తల్చుకొని కుళ్ళిపోతారు ఆఖరికి నలుగురు ఫ్రెండ్స్‌ని తీసుకొని సినిమాకైనాపోరు అలా కష్టాల మొహం వేసుకొని భారంగా

జానక్కి- కోపం స్టేజి దాటిపోయి మొగుడైనా, దేవుడైనా సరే నోటికొచ్చి నట్లు తిట్టాలనిపించింది అయినా తమాయించుకొని "ఇదేనా మీరు చెప్పదల్చుకున్నది? అంది కోపంతో వణుకుతున్న గొంతుకతో

జగన్నాధం మొహం మీది నవ్వు చెరగలేదు అదుగో ఆ నిర్లక్ష్యమే మనిషిని పిచ్చెత్తించేస్తుంది తను అడిగిందేమిటి? అతను చెప్తున్నదేమిటి?

జగన్నాధానికి చెలగాటం జానక్కి- ప్రాణ సంకటం

"సరిగ్గా అది కాదనుకో నీకు యిప్పుడు ఏమిటి చెప్తానన్నాను? అన్నట్టు నువ్వు నన్ను డబ్బు కదూ అడిగేవు నాదగ్గర అదిలేదుకాని జనరల్ నాలెడ్జి పుష్కలంగా వుంది అంచేత ప్రస్తుతానికి అదే యిస్తాను ఏమిటంటే మనం వున్నాం? మనం అంటే నువ్వు, కుక్క-, పిల్లలు, నేను కాదు మన్లాటి నెలకి 300 పైన 1000 లోపు తెచ్చుకునేవాళ్ళు మనల్ని అప్పర్ మిడిల్ క్లాస్ అంటారు గొప్ప వాళ్ళదగ్గర ముష్టివాళ్ళం ముష్టివాళ్ళ దగ్గర గొప్పవాళ్ళం టు సే ప్రిసైజ్‌లీ మధ్య తరగతి వాళ్ళంటే గొప్పవాళ్ళ మనుకునే బీదవాళ్ళు నాకు ఆవేశం ఇంగ్లీషులో వచ్చేస్తుంది ఏమిటా వ్యంగ్యం నవ్వు?

మనకి గొప్పగా బతకడానికి డబ్బుండదు అడుక్కోవడానికి అర్హతలేదు. ఔను దేనికైనా అర్హతవుండాలి మనం పోయి ఎవరైనా "ఏవండేవండీ అబ్బాయికి అర్జంటుగా జీతం కట్టాలి ఓ వంద రూపాయ లివ్వండి" అని అడిగేవనుకో అతను పెద్దమనిషైతే ఐయామ్ సారీ అదే జెంటిల్మనైతే "ఇప్పుడు డబ్బు లేదనో తరవాత యిస్తాననో తప్పుకుంటాడు" అదే మీ బాబులాంటివాడైతే "ఏం నాయనా! వెర్రా? వికారమా? నీ కొడుకు ఫీజు నేనెందుకు కట్టాలి? శక్తివుంటే చదివించుకో లేకపోతే ఒ రిక్షా యిచ్చి తొక్కుకోమను" అని ఉచిత సలహా యిస్తాడు

"పోనీ అప్పుగా యివ్వండి" అన్నావనుకో

"మళ్ళీ ఎలా తీరుస్తావ్? ఇదిగో యీ వందా తీసుకొని అప్పు తీర్చుకో అని గవర్నమెంటు ఎక్స్‌ట్రా యిస్తుందా? ఇవ్వదుకదా జీతంలో తీరుస్తానంటావు పూర్తి జీతంచాలని నీకు డెఫిసిట్ జీతం ఎలా సరిపోతుంది? మళ్ళీ అప్పుచేస్తావు.

కష్టపడి సినీమాలు, సిగరెట్లు మానేస్తావు కాని నీ కష్టమేం మిగుల్తుంది కాని సగం అప్పుకూడా తీరదు ఆ తరవాత మరి తీర్చవు ఇష్టంలేకకాదు తీర్చలేక కొన్నాళ్ళకి అప్పు అలవాటుగానూ, ఆ తరవాత వ్యసనంగానూ మారిపోతుంది నాలాంటి మంచి వాడైతే పోన్లే పాపం పిల్లలుగలవాడని ఊరుకుంటారు మరోడైతే నిన్నూ, నీయింటినీ డప్పుకొట్టేస్తాడు" అని ఓ చింకి లెక్చరిచ్చి అప్పు యివ్వకుండానే చక్కా పోతాడు

ఇంతకీ యిది ఎకానమిక్స్ నీకు అర్థంకాదు నేను చెప్తున్నాను కాబట్టి నన్ను నమ్మి అనవసరంగా అస్తమానూ ఆలోచించి నీ మూడ్ పాడుచేసుకొని డబ్బో, డబ్బో అని నన్ను చంపకు " అని ఓగంట లెక్చరిచ్చేడు:

అంత కోపంలోను జానక్కి నవ్వొచ్చింది ఈ సంగతులన్నీ తనకి తెలీవనుకోవడం పొరపాటు అందరూ అన్నీ శక్తివుండే చేస్తున్నారా? నాకు శక్తిలేదు అని కాళ్ళు చాపుక్కూర్చుంటే పిల్లేదు కొన్నిపన్లు మన శక్తితో సంబంధంలేకుండా చెయ్యాల్సిందే జగన్నాధాన్ని నమ్మకోవడం దేవుడ్ని నమ్మకోవడమే అతన్తో దెబ్బలాడి లాభంలేదు

"ప్రస్తుతానికి ఏ బేంకులోనో, వల్లకాట్లోనో అప్పుతెస్తే, తరవాత అట్నుంచి నరుక్కు రావచ్చు" ఇంత మంచి సలహా యిచ్చినందుకు గర్వంగా కళ్ళెగరేసింది

ఆవిడ సలహా మాటెలావున్నా, ఆ కళ్ళెగరెయ్యడం నచ్చలేదు జగన్నాధానికి.

హు! ఎంత పొగరు!

ఇంతోటి బోడి సలహాకి కళ్ళెగరెయ్యడం, కాళ్ళూపడం కూడాను

"జానకీదేవి మొగుడా జగన్నాధవా! ఇంద పట్టికెళ్ళు అని యివ్వడానికి ఏ బేంకువాళ్ళు విడివిడిగాగాని, జెమిలిగాగాని మూటలు పట్టుకొనికూర్చోలేదు అమ్మగారు మర్చిపోయేరేమో మన మొగుడికి అన్ని బేంకుల్లోనూ ఓవర్ డ్రాఫ్టులు వున్నాయనీ, అవి కట్టకుండా కాంపౌండులో కొస్తే కాళ్ళు విరగ్గొడతారనీ ఇంక వల్లకాట్లో పగలైతే కాల్తున్న శవాలూ, కుండపెంకులూ, రాత్రిపూట దెయ్యాలూ వుంటాయి ఎట్నుంచి నరకడానికీ మా హాస్పటల్‌కి ఎప్పుడైనా డయాబెటిక్ కాళ్ళూ, చేతులూ తప్ప యింకేం లేవు అయిపోయిందా తమ సలహా? అవతల డెలివరీ కేసొకటి వుంది "

"ఏం పాపం! మీ లేడీ డాక్టరేమైంది?"

"ముళ్ళులేని వాచీ పనిచేసినా ఒకటే, మానేసినా ఒకటేనని ఆవిడ వున్నా లేకపోయినా ఒకటే."

సడెన్ బ్రెయిన్‌వేవ్ వచ్చింది జానక్కి. ఆవిడ్నే అడిగితే! బ్రహ్మాండమైన ఐడియా!

"పోనీ ఆవిడ్నే అడిగితేనో?

"పక్కలో కొచ్చీమంటే వస్తుంది కాని పదిరూపాయలు అప్పు యిమ్మంటే మాత్రం ప్రాణాలొదిలేస్తుంది."

"అన్నట్టు మీకు ఇండియన్ బేంకులో ఓవర్ డ్రాఫ్టులేదని జ్ఞాపకం "

"నీ జ్ఞాపకశక్తికి జోహార్లు కాని దాని ఏజెంటుగాడున్నాడు చూశావ్ వగ్గుకీ, రొంపకీ లేడీ డాక్టరు దగ్గరకే పోతాడు బుద్ధి గడ్డితిని డి జి వా చేసేను కదా పురుటికేనా మనదగ్గరకి రాడా అని ఆశపడకు ఎప్పటికైనా కంటే వాడే కనాలి వాడి పెళ్ళాం కనదు. అయిపోయిందా మన కాన్ఫరెన్సు?" అంటూ లేవబోయేడు జగన్నాధం

ఇప్పుడు పారిపోయేడంటే మళ్ళీ దొరకడు ఆ ఇంటి సంగతేదో చెప్పి, నాలుగు తిట్లు తినేసైనాసరే, అతన్ని ఒప్పించాలి, "కాశీ మజిలీ కధల్లో ఏ దిక్కైనా వెళ్ళు కాని ఉత్తర దిక్కుకి వెళ్ళకు" అన్నట్టు ఏంచెప్పినా వింటాడు కాని ఇంటి సంగతి మాత్రం ఒప్పుకోడు అంత ఇల్లు పెట్టుకొని రూపాయైనా రాకపోతే మానవుడికి మనసెలా ఒప్పుతోందో? ఉండగలిగీ దరిద్రం అంటారుదీన్నే సందర్భం వచ్చింది కనుక యిప్పుడే చెప్పేస్తేసరి.

"అన్నట్టు మనూర్లో యిళ్ళకి మహా గిరాకీ వుందిట సుమండీ" అంది అతన్ని

చెయ్యిపట్టుకు కూర్చోపెడుతూ. అంతవరకు వాళ్ళిద్దరు సరదాగా మాట్లాడుకుంటున్న ధోరణిలో

జగన్నాధం ఒక్క సెకండు ఆవిడ్ని పైనుంచి కిందికి చూశేడు. "ఫరవా లేదే పిల్ల గడుసుదే"

టాపిక్ ఎటెళ్తోందో తెలీని అమాయకుడుకాడు

"A I R న్యూసా?"

"పాపం ఆవిడేంచేసింది ఏదో దబ దబ దబ్బాలో రాళ్ళుపోసి గిలకరించి నట్టు వాగుతుందని కాని మనిషి పాపం మంచిదే "

"మంచిదే " ఆవిడకాదు నీ అభిప్రాయం

"నాలుగ్గోడలూ, ఒక టాపువుంటే చాలు, నలభై రూపాయలు అడిగేస్తున్నా రుట" భ్రమరాంబ మాటలే రిపీట్ చేసింది జానకి

"రెండు గోడలే వుంటే "

"మీకంతా జోక్‌గానే వుంటుంది"

"అనవసర ఉపోద్ఘాతాలు ఆపి, రంగంలోకి దిగు కమ్ టు ది పాయింట్"

"మీకు కోపం వస్తుంది కాని మనం డబ్బుకి యింత యిబ్బంది పడుతున్నాం అవతల స్వంత ఇల్లేమో ఇంకోడు అనుభవిస్తున్నాడు. ఇంక మనవేఁలాగా అతన్దగ్గర డబ్బు వసూలు చెయ్యలేం అంచేత అతన్ని ఖాళీ చేసేమని, శుభ్రంగా బాగు చేయించి, ఇంకెవరికైనా అద్దెకిస్తే పోతుంది "

అతని రియాక్షన్‌కోసం అన్నట్టు ఆగింది

అతని రియాక్షన్ ఎప్పుడూ మారదు రక్కన కుర్చీలోంచి లేచేడు. "లాభంలేదు ఆ విషయం వదిలీ అందులో ఐయామ్ హెల్ప్‌లెస్"

అమ్మయ్య తిట్టలేదు అంటే గాలి సుముఖంగానే వుంది

"పోనీ మీరేం చెయ్యొద్దు అంతా నా కొదిలేయండి మీరు కేవలం ఉత్సవ విగ్రహంలా నా పక్కన వుండండి మిగిలినది నేను చూసుకుంటాను "

"ఆలోచిద్దాం " జగన్నాధం యీసారి తిట్టకపోవడానికి కారణం అతని డబ్బు యిబ్బందులే, పైకి అనకపోయినా, అతనికీ బెంగగానే వుంది డబ్బువిషయం అతనికీ చికాగ్గానే వుంది ఆ ఇంటి విషయం తనుగా ఏం చెయ్యలేడు కాని జానకి చేస్తానంటోంది, అంచేత "ఆలోచిద్దాం" అనేవరకు వచ్చేడు

"ఇంక ఆలోచించడానికేంలేదు ఓ వారం శలవు పెట్టండి ఓ అయిదు వందలు ఎక్కడైనా చూడండి వెళ్దాం మళ్ళీ పిల్లలకి కాలేజీలు తెరిస్తే నేను కదల డానికి వీలుండదు" ఆర్డరేసింది అతనికి ఆలోచించడానికి టైమిస్తే మళ్ళీ రానం టాడు మళ్లా ఒప్పించాలంటే మరో యజ్ఞం చెయ్యాలి

అంచేత వెంటనే శలవు పెట్టేమంది

పెట్టేడు జగన్నాధం (సశేషం)



# గొర్రెటి అర్వాడ

“అల్లుడూ, సీతమ్మ దర్శనం చేసుకు పోగూడదా” అంది మా అత్తగారు

నేను కొత్త పెళ్ళికొడుకుని సెలవు ఇంకా వుంది అయినా అత్తవారింటిలో నెల రోజులుగా తిష్ఠవేసి తిని కూర్చో వడం నాకే పిగ్గేసి, సెలవు అయిపోయిం దని బొంకి, వైజాగ్ బయల్దేరుతుంటే— మా అత్తగారు ఈ ఒక్కరోజు అగ మంటుంది సీతమ్మ దర్శనం చేసుకొని మరి పొమ్మంటుంది మా ఆవిడగూడా అందుకు తందానాతానా అంది

సరే వుండిపోడానికేం? ఇంతకీ ఎవరీ సీతమ్మ? ఆయమ్మ దర్శనం ప్రయాణమే వాయిదా వేయాల్సినంత గొప్పదా?

“సీతమ్మ ఎవరండీ? బంధువులా? స్నేహితులా?”

నేనా ప్రశ్న చాలా అజ్ఞానంతో అడిగి నట్టుగా నావైపు చూశేరు అత్తగారు

“భలే వాడివే అల్లుడూ సీతమ్మంటే మనలాంటి మనిషి అనుకున్నావేంటి?

కాదు దేవత. సాక్షాత్తు ఆ శ్రీరామచంద్ర మూర్తి ఇల్లాలే ఆ తల్లి" అంటూనే ఆ తల్లి తలపుకి పులకించిపోయి ఓసారి చేతులు జోడించేయడం కానిచ్చేరు.

నాకు ఆశ్చర్యం వేసింది. సీతమ్మంటే సీతాదేవా? పోనీ సీతాదేవే అయినప్పటికీ రాముణ్ని 'ఓవర్‌లుక్' చేసి ప్రత్యేకంగా సీతమ్మంటూ మాటాడ్డం ఇదే వినడం ఎక్కడైనా రామాలయాలు వున్నాయిగాని సీతాలయాలు లేవుగా?

కానిక్కడ సీతాలయం వుందన్నారు. అదగ్గా. చిత్రమే

మనం ఎక్కడికెళ్ళినా శ్రీరాముడి గ్రూప్ ఫొటో చూస్తుంటాం—రాముని కిరువైపుల సీతా, లక్ష్మణులు. పాదాల చెంత ఆంజనేయులతో అయితే మన వాళ్ళు ఆరాధించేది రాముణ్ని, రామభక్త హనుమాన్‌ని (హనుమంతునికి సపరేట్‌గా కూడా ఆలయాలున్నాయి) కాని వారిద్దరిలా సీతాదేవి, లక్ష్మణుడు భక్తులను ఆకర్షించలేకపోయేరు ఆకట్టుకోలేకపోయేరు—అని అనుకున్న నా అభిప్రాయం ఇక్కడ తలకిందులయింది

అయితే ఆ సీతాలయం ఏమిటో చూసి తీరాల్సిందే

నేను, మా ఆవిడ ఆలయానికి బయల్దేరాం.

సీతమ్మ దర్శనం శనివారం మాత్రమే లభిస్తుందట అయితే ఆ రోజు శనివారం కాదు కాకపోయినా మాకు దర్శనం లభిస్తుందంటే? మరేం లేదు మా మావఁగారు ఆ వూరికి ప్రెసిడెంటు. పెద్ద మనిషిని. ఆ గుడి వారి అండర్‌లోనే వుంచట ఇక చెప్పేదేముంది?

గుడిలోకెళ్ళి నేను స్టన్నయిపోయేను. ఆదేవత రాయీకాదు, రప్పాకాదు ప్రతిమా కాదు, పటమూ కాదు ఆమె సజీవంగా ప్రాణం పోసిన శిల్పంలా వుంది. శ్రీరామచంద్రుడు మటుకు బొమ్మ రూపంలోనే ఆమె చేతిలో వున్నారు కాని సీత బతికే వుంది

సీత బతికి వుండడమేమిటి? ఇదేదో వింతగా వుందే

వివరాలు అడిగేను మా ఆవిణ్ణి

మా ఆవిడ చెప్పాలని ప్రయత్నించి చెప్పలేక 'నా కన్నా మా అమ్మ సీతమ్మ తల్లి చరిత్ర బాగా చెబుతుంది' అని మాత్రం చెప్పింది

భోజనాలయ్యేక, తీరిగ్గా కూర్చున్నాక మా అత్త సీతమ్మ కథ పూసగుచ్చినట్టు చెప్పింది అంతా కళ్ళతోనే చూపినట్టు చెప్పింది చెప్పిందేవిఁటంటే—

ఇరవయ్యేళ్ళ కిందట సీతాదేవి మళ్ళీ జన్మనెత్తిందట! అదీ ఈ వూళ్ళోనేనట! చిత్రమేవిఁటంటే సీతమ్మ పుట్టగానే 'క్వా. క్వా' అని ఏడ్వలేదట 'ర్మా. ర్మా' (రామా, రామా) అని ఏడ్చిందట అచ్చొసి అమ్మలక్కలంతా బుగ్గమీద వేలేసుకున్నారట పాకే వయసులో గిచ్చకాయనిచ్చినా, కోతి బొమ్మనిచ్చినా పుచ్చుకునేది కాదట ఏదిచ్చినా కాదని, కాలదన్ని బంగురుకొని, బంగురుకొని దేవుడి మూలకెళ్ళి రాములవారి బొమ్మ అందుకుందట ఆ చోద్యం చూపి, ఆ పసి వయసులో ఆ భక్తిని చూపి (ఈ సారి బుగ్గమీద కాకుండా) ముక్కులమీద




వేళ్ళేసుకున్నారట. రాములవారి బొమ్మను బలాత్కారంగా లాగేసుకుంటే పెద్దగా కింక పెట్టేసేదట ఆ బొమ్మను తిరిగిస్తేనే గాని వూర్కొనేది కాదట ఇలాంటి చిత్రాలు, చేష్టలూ సీతమ్మ తరచుగా చేస్తుండడం వల్ల ఆదోళ్ళు ముక్కుమీద వేళ్ళు ముక్కుమీదే అలా వుండిపోయేవట. (అప్పుడేనట ఒకసారి మా అత్త అట్టి అవస్థలో వుండగా మరోడెవడో మెడ మీద చెయ్యేసి మెళ్ళోతాడు ఎత్తుకుపోయే డట) ఆ పిల్ల ఆ బొమ్మతోనే ఆడుకొనేది గాని తోటి పిల్లల్తో ఆడుకొనేది కాదట. అంచేత ఆ పిల్లపేరు సీతమ్మగా మార్చే రట (మార్చక ముందు ఆ పిల్లపేరు ఏవిఁటిపెట్టారో ఆ పిల్లతల్లే మర్చిందట!) ఓ నాడు లవకుశ 'బైసుకోప్పు'కి సీతమ్మ అయిదో యేట తన అమ్మతో వెళ్ళిందట వెళ్ళి సినిమాలో తెగ పేచీ పెట్టిందట. 'నా రాములవారి దగ్గరకు పోతానని' తెర దగ్గరకు పోడానికి తెగ గింజుకుందట. తెగ ఏడ్చిందట. సినిమానుంచి వచ్చేక కూడా ఏడ్చేనట పిల్లమీద గాలి వాలిం దేమోనని మంత్రాలు వేయించిందట! చింతకాయలు రాల్లేదట చివరికి తల్లి విసిగిపోయి, వేసారిపోయి వూరుకుందట ఎంత వూరుకున్నా సీతమ్మ పైటలు వేసే కాలం రాగానే ఇక వూర్కోలేక పెళ్ళి ప్రయత్నాలు చేసిందట. పుత్తడి బొమ్మ లాగ, పటికబెల్లం లాగున్న సీతమ్మను ఎవడు చేసుకోడు? చేసుకోడానికి చాలా మంది ముందుకొచ్చేరట కాని ఒకడు పెళ్ళి చూపుల్లోను, మరొకడు పెళ్ళి పీటల మీద 'హరీ' అన్నారట దాంతో ముందు కొచ్చిన పెళ్ళికొడుకులంతా వెనక్కి దౌడు తీసేరట ఇంకేం పెళ్ళిప్రయత్నాలు? తల్లి మళ్ళీ వూరుకుండిపోయింది. సీతమ్మకిక

తిండీ. నిద్రా. సర్వం. సమస్తం ఆ రాముల వారి బొమ్మేనట ఆ బొమ్మను ఒక్క క్షణం వదలదట

సీతమ్మ చల్లని వెన్నెల కిరణాల తోనూ, పాలసముద్ర కెరటాలతోనూ చేసినట్టు అద్భుతంగా, సర్వాంగ సుంద రంగా వుంటుందట—'అట' ఏవిఁటి? నిజంగానే వుంటుంది నే చూశాగా

ఇంకా సీతమ్మ గురించి చెప్పింది

ఇలా వుండగా ఓ రోజు తెల్లారి జామున సీతమ్మ కనబడ్డం మానేసిందట అంతా రెండు, మూడు రోజులు వెతికే రట అన్ని వూళ్ళూ వెతికేరట అన్ని ఇళ్ళూ గాలించేరట అన్ని నూతులు చూసేరట, అన్ని చెరువులూ చూశేరట. చుట్టుపక్కలున్న రామాలయాలన్నిటి దగ్గర వెదికేరట. ఎక్కడా కనిపించలేదు కనిపించకపోగానే కొంతమంది సుప్పనాతి సూరమ్మలు అన్నారట 'నంగనాచి లాగుంది ఎవడితోనో లేచిపోయిందని!' మొత్తానికి చచ్చిపోయిందనో, లేచిపోయిం దనో అనేసుకొని వూరుకున్నారట

అంతలో ఒకడు సీతమ్మ తల్లిదగ్గరకు పరుగు పరుగున వచ్చి సీతమ్మ ఎక్క డుందో 'ఇన్‌ఫర్‌మేషన్' ఇచ్చేడట వాడి వెంట సీతమ్మ తల్లి, చుట్టుపక్కల వాళ్ళు వెళ్ళేరట వూరు పక్కనున్న కొండల్లోకి వెళ్ళేరట కొండల మధ్య నున్న పెద్దలోయలోకి వెళ్ళేరట లోయలో చెట్లనూ, పుట్లనూ, రాళ్ళూ రప్పలనూ తప్పుకుంటూ, తన్నుకుంటూ వెళ్ళేరట వెళ్ళి అక్కడ సీతమ్మను చూశే రట సీతమ్మ చెట్టుకింద కూర్చొని రాముల వారి బొమ్మతో ఆడుకుంటుందట ఇంటికి రమ్మంటే రానని సీతమ్మ అడ్డంగా తల ఆడించిందట. చిర్రెత్తుకొచ్చి బలాత్కా రంగా ఎత్తుకుని ఇంట్లో పడేశారట. గదిలో పెట్టి గెడవేసి, ఇప్పుడెలా తప్పిం చుకు పారిపోతుంది?' అన్నారట కాని సీతమ్మ తప్పించుకు పారిపోయిందట. తిండి పెడదామని తల్లి తలుపు తీసి చూస్తే గదిలో సీతమ్మలేదట మట్టిగోడకి మనిషి దూరేపాటి కన్నం, పక్కన గునపం వున్నాయట గదిలో

ఆ రాత్రే చప్పుడు చేయకుండా ఆ కొండల్లోకే, ఆ లోయలోకే పోయిందట. అలాంటిచోట ఆడదొక్కటే రాత్రులుండ గలుగుతుందంటే సామాన్యమైన విష యమా? ఈసారి వూరంతా కలసి ఆశ్చ ర్యంతోను, చిరాకుగాను, కోపంగాను కదిలి వెళ్ళేరట చూశేరు గదా చిరాకు కోపం చెట్టెక్కిపోయేయట ఆశ్చర్యం అత్యంత ఆశ్చర్యంలోకి మా రిం ద ట. చూసిన దృశ్యం చిత్రాతి చిత్రమట

అప్పుడే పూవువిడుతున్నట్టుతెలతెల్లగా తెల్లవారుతోందట ఆకాశం ఎర్రపిండాన్ని ప్రసవించినట్టు సూర్యుడు కొండలమీంచి నెమ్మది నెమ్మదిగా లేచి వస్తున్నాడట. చెట్లన్నీ తడిసిన వస్త్రాల్లోనున్న తరుణిల్లా మంచులో తడిసివున్నాయట లోయలోకి కిరణాలు బంగారు గొట్టాలు గుచ్చినట్టు కానవస్తున్నాయట ఆ లోయలో కల్ప వృక్షంలా, చల్లని మాతృహస్తంలా ఒక మర్రిచెట్టు వుందట ఆ చెట్టుక్రింద ఎండు టాకుల పరుపుమీద తెల్లచీరలో సీతమ్మ వెల్లకిలా పడుకొని వుందట దేవలోకం

నుంచి కిందకు వచ్చి తిరిగి దేవలోకం వెళ్ళడాని కిష్టంలేక వుండిపోయిన దేవతలా వుందట ఆమె గుండెలమీద రాములవారి బొమ్మ వుందట సీతమ్మ మంచు పొగలో, పసుపు బంగారు వెలుగులో బంగారపు బొమ్మలా వుందట అందర్నీ గుండె ఆగేటంత ఆశ్చర్య పరచిందేమిటంటే ఒకపెద్ద నాగుపాము సీతమ్మ తలమీద పడగెత్తి కిరణాలసూదులు సీతమ్మ ముఖాన్ని గుచ్చకుండా నీడ నిస్తోందట సీతమ్మ వున్న చోటంతా అదొకరకమైన దివ్యాతిదివ్యమైన తేజస్సుతోనూ, సుభరితమైన పరిమళముతోనూ నిండిపోయిందట అందరూ సీతమ్మ ముఖంలో కళాకాంతుల్ని చూడలేక పోయేరట.

'అమ్మా, తల్లీ, నీవు నిజంగా ముమ్మూర్తులా సీతాదేవివే తల్లీ శ్రీరామచంద్రుల సతీమణివే తల్లీ' అని లెంపలు వాయించుకొని, సాగిలబడి సాష్టాంగ దండప్రమాణాలు ఆచరించేరట దండాలు పెట్టగానే నాగరాజు 'ఇక ఈదేవత బాధ్యత మీరు తీసుకోండి' అన్నట్టుగా తలదించి చల్లగా కొండల్లోకిపోయి మాయమయ్యేడట.

ఇక దాంతో వూరంతా సీతమ్మను దేవతగా గుర్తించేరట బంగ్లాదేశ్ ని క్రమక్రమేపి అన్నిదేశాలు గుర్తించినట్లు అన్నివూళ్ళూ సీతమ్మను దేవతగా గుర్తించేయట 'గుర్తించను గుర్తించను' అంటూ చివరికి చచ్చేటట్టు గుర్తించిన పాకిస్థాన్‌లా గవర్నమెంటు కూడా సీతమ్మను గుర్తించిందట!

మా మావయ్య ముందుకువచ్చి గుడి కట్టాలనే సదుద్దేశంతో, అచంచల దీక్షతో నిలబడి చందాలు వసూలుచేసి, శ్రమపడి గుడి కట్టించేడట దేవాదాయ కమిటీకి అప్పటినుంచి మా మావయ్యగారే ప్రెసిడెంటట, ధర్మకర్తట

సీతమ్మ పాలుమాత్రమే త్రాగుతుందట పళ్ళుమాత్రమే తింటుందట ఆమెకు ప్రతి రోజూ పూజట రోజూ ఉదయం పాలతో స్నానం చేయిస్తారట ఎప్పుడు తెల్లటి చీరే కడతారట తలంటేక జడవేసుకోడానికి ఒప్పుకోదట, అంచేత ఆమె జుత్తు నల్లనిమేఘ శకలాలవలె ఆమెను ఆక్రమిస్తుంది జుత్తు ఒత్తుగానే కాకుండా ఇంచుమించు నేలకు తాకేటంత పొడవు! స్నానం చేయించి ప్రత్యేకంగా ఆ జుత్తుకి సాంబ్రాణి పొగ పెడతారట ఇదంతా ఆమె తల్లే స్వయంసేవగా చేస్తుందట

సీతమ్మ గుడివద్ద ప్రతిఏడాది సీతారామ కళ్యాణ మహోత్సవం తొమ్మిది దినాల పాటు బ్రహ్మాండంగా చేస్తారట మిగతా దినాల్లో ప్రతి శనివారం ఆమె దర్శన భాగ్యం లభిస్తుందట ప్రతి శనివారం అక్కడపెద్ద తీర్థంలా వుంటుందట భక్తులు చుట్టుప్రక్కల గ్రామాలనుంచే గాక ఎక్కడెక్కడనుంచో వస్తూంటారట. (ఆ దేవతను దర్శించిన వారిలో ఆంధ్ర మంత్రులిద్దరూ, కేంద్రమంత్రి ఒక్కరూ వున్నారట) కారులు యాత్రా స్పెషల్ బస్సులు వస్తుంటాయట.

సీతమ్మ తన భక్తుల్ని కన్నెత్తి చూడదట, పన్నెత్తి మాటాడదట, అసలు ఎవరితోనూ మాటాడదట అయితే ఆమె భక్తుల్ని తిలకించక పోయినా, పలకరిం

భక్తుల బతుకులు ధన్యమవుతాయట. ఆ దేవతను ఏం కావాలని మొక్కితే అది దక్కుతుందట పిల్లల్లేని వాళ్ళకు పిల్లలు పుడుతున్నారట పెళ్ళిళ్ళు కాని వాళ్ళకు పెళ్ళిళ్ళయిపోతున్నాయట జబ్బులున్న వాళ్ళకు జబ్బులు పోతున్నాయట డబ్బు లేనివాళ్ళకు వద్దంటే డబ్బు వస్తోందట. మొక్కులు ఆవిధంగా నెరవేరు తుండడం చేత రోజురోజుకీ భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగి చందాలు, ముడుపులువగైరా రూపంలో విపరీతంగా డబ్బు వస్తోందట కనకవర్షం కురుస్తోందట వస్తోన్న డబ్బు కురుస్తున్న కనకం మటుకు మా మావఁ పెట్టెలోకి వెళ్తోందట (అలా వెళ్తుంద నడం కిట్టనివాళ్ళు అన్నమాటలట—నన్ను నమ్మమంది మా అత్త!)

అదీ మా అత్తచెప్పిన సీతమ్మ దేవత కథ

ఈ 'అటా అటా' కథ ఎంతవరకూ కరక్టనేది నాకు తెలీదు అయితే ఇటు వంటి చిత్రమైన కథయి మన ఆధ్యాత్మిక దేశానికి కొత్తవికావు రోజుకొక దేవుడూ దేవతా మనకు పుట్టుకొస్తూనే వున్నారు వారికి పబ్లిసిటీ, ప్రాపగాండా మా మావఁ లాంటి వాళ్ళేకాదు మహామహా మేధా వులే చేస్తూ నెత్తిన ఎత్తుకు ఊరే గు తున్నారు ఏమాటకామాట — అందుకు ఒప్పుకోవాలి మనం ఏమంటే దేశంలో ప్రతిదీ కరువు ఏదీ సరసమైన ధరకు దొరకడం లేదు ధరలు ఆ కా శ ం లో చుక్కలతో ఆడుకుంటున్నాయి. వాటిని పిలక పట్టుకుని ఈడ్చుకు వద్దామంటే— చంద్రుణ్ని చేరలేకపోతున్న మనం అసలు చుక్కల్ని చేరలేం అంచేత 'అయ్యో! ఏందారి భగవంతుడా' అని క్షోభించే ఆత్మ లకు చవగ్గా, అతి తక్కువ ధరకు ఆధ్యాత్మిక చింతన కల్గించడం, తద్వారా మన శ్శాంతి కల్గించి జోకొట్టడం వీళ్ళ పరమ ధ్యేయం యువతరం నిరాశ నిస్పృహల నుంచి వీరావేశంలోకి జారి తిరుగుబాటు చేసే ప్రమాదం రానీయకుండా 'నాయనా ఇదంతా దైవలీలరా వర్గపోరాటాలంటూ కొట్టుమిట్టాడకురా వీర వెర్రివాడా ప్రపంచమంతా శూన్యం రాజు-బానిస, భూస్వామి-పాలేరు, యజమాని-కార్మికుడు ఇదంతా మిథ్య భ్రమ నీ అజ్ఞానం తప్ప మరేమీకాదు వాస్తవం ఒక్క దేవుడే వాడినే అందుకో చేరుకో'! అంటూ జీవాత్మ, పరమాత్మల రిలేషన్సు ప్రభోదించడమే వీళ్ళ పరమ లక్ష్యం దేశంలో పాపాన్ని, విప్లవాన్ని అణిచి పుణ్యాన్ని, దైవాన్ని నిలబెట్టడమేమామావయ్యలాంటి వాళ్ళ ఆరాటం—అనిపించింది నాకు

అంతేకాకుండా మా మా వ య్య భూములతోనూ, బంగారంతోనూ పచ్చ పచ్చగా విరాజిల్లుతుండడం ఆ దైవకృప వల్లేనని, ఆ సీతమ్మ దేవత చలవేనని కూడా అనిపించింది నాకు

ఏమంటే ఈ ఇరవయ్యో శతాబ్దంలో, మనిషి మార్క్సిస్టుగా మారిపోతున్న మాయదారి రోజుల్లో—దేవుణ్ణి నిలబెడు తున్న వారిని, నిలబెట్టడానికి ప్రయత్ని స్తున్న వారిని దేవుడెలా అన్యాయం చేయగలడు? వారిని తను నిలబెడతాడు అది తన ధర్మం




ధర్మప్రకారంగా మా మావయ్యా నిలబడ్డాడు!

* * *

నాలుగేళ్ళు గడిచేయి

మా అత్తగారు వైజాగ్ వచ్చేరు. రావడం కూతుర్ని చూపిపోదామని కాదు. మోసుకుపోదామని విశేషమేమిటంటే మా ఆవిడ మరోప్రాణిని ఏడు నెలలుగా మోస్తోంది

పట్నంకదా, డెలివరీ ఇక్కడైతేనే బాగుంటుందని నేను అంటున్నా, లేదు తొలి కాన్పు తప్పనిసరిగా మా దగ్గరే జరగాలంటూ తప్పనిసరిగా తీసుకుపోవడానికొచ్చేరు

అసలు మా అత్తగారి ఉద్దేశంలో కూతురీపాటికి నాలుగేళ్ళలో ముగ్గురు పిల్లల్ని కనేసి వుండాలని అంచేత పెళ్ళయి మూడేళ్ళుదాటినా కూతురు ఇంకా నీళ్ళు పోసుకోకపోవడంతో కూతురు తల్లిగారు పెద్ద గాభరా చెందేరు నిజం చెప్పొద్దూ—నాకూ అనుమానమే వేసింది. పిల్లలు కలగరేమోనని

ఏమంటే ఈ రోజుల్లో పెళ్ళికాగానే ఆడపిల్ల 'మెన్సస్' అవడం మర్చిపోతోంది! పిల్లడికి బారసాల తర్వాతనే 'పెళ్ళిరోజు' చేసుకుంటున్న రోజులివి అటువంటిది పెళ్ళయి 50 నెలలు దాటినా మా ఆవిడ నెల తప్పకపోవడంతో మా ఇంట్లోనూ, మా అత్తవారింట్లోనూ భయాందోళనలు ప్రారంభమయ్యేయి

ఇద్దరం స్పెషలిస్టు దగ్గరికెళ్ళి చెక్ చేయించుకున్నాం మందులూ, మాకులూ తిన్నాం. మా శ్రీమతికి మైనర్ ఆపరేషన్ కూడా చేశేరు ఏమైతేనేం ఆపరేషన్ చేశేక మా శ్రీమతికి నెలతప్పింది నేనలా గన్నంమకు మా అత్తగారు పెద్ద గొడవ పెట్టి ఒప్పుకోలేదు. కడుపు రావడానికి కారణం నేనుగాని, ఆపరేషనుగాని కాద

న్నట్టు మాటాడిందావిడ అదంతా సీతమ్మ తల్లి అనుగ్రహం అంది అప్పుడే మా అత్త మొక్కుకుందట - 'నా తల్లి గర్భం ధరిస్తే చీరా రవిక పెడతానని. 116కొబ్బరి కాయలు కొడతానని'

ఇపుడు సీతమ్మకు చీర రవిక పెట్టేసి. కొబ్బరికాయలన్నీ కొట్టేసి మరి కూతుర్ని తీసుకెళ్ళడాని కొచ్చింది కాబోలు

"అత్తగారూ, కొబ్బరి కాయలన్నీ మీరే కొట్టారా? మావయ్యగారుకూడా సాయంచేశారా?" — అడిగేను భోజనా లయ్యేక, తీరిగ్గా కూర్చొని

సీతమ్మ టాపిక్ ఆ విధంగా ఎత్తడంతో మా అత్త ముఖం వివర్ణమైపోయింది కళ్ళు ఎర్రబడ్డాయి ఆమెను చూస్తే కొంపదీసి సీతమ్మగాని పూనలేదు గదా అనిపించింది

మా ఆవిడ, నేను ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాం

అంతలో ఆమె గట్టిగా అరవడం మొదలెట్టింది

"అది, ఆ ముండ దేవతకాదు పాడూ కాదు దయ్యం కామ పిశాచి దానికిపుడు అభిషేకం కొబ్బరికాయల్తో కాదు, రాళ్ళు రప్పల్తో చేస్తున్నారంతా "

పిడుగులాంటి వార్తకి నేను మా ఆవిడ మరోసారి ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నాం అత్తయ్య అంటున్నదేమిటి? సీతమ్మ గురించే? 'అవును, అదే, ఆ రంకుముండనే' అని ఖరారుచేసింది మా అత్త. దాన్ని కాకపోతే ఇంకెవర్ని తిడతానన్నట్టు!

"ఎందుకలా తిడుతున్నావే తప్పు కదా" - దేవతను పట్టుకొని తల్లి దుర్భాషలాడ్డం కూతురు భరించలేక భయంగా, గాభరాగా అడిగింది

"తప్పా? అవును తప్పేనే దానిని ఇన్నాళ్ళూ గుడ్డిగా గుడిలోపెట్టి పూజించడం తప్పే ఆ ముండపాదాలు మన నెత్తిన పెట్టుకోడం తప్పు కాకపోతే ఏవిఁటి? ఆ ముండ ఏవిఁటో అనుకుంది గాని పైన దేవుడు - అసలు, పిసలు భగవంతుడుండగా మాయలూ, మోసాలు ఎన్నాళ్లు సాగుతాయి? రంకులూ, బొంకులూ ఎన్నేళ్ళు దాగుతాయి?"

"ఇంతకీ ఏమయ్యిందో వివరంగా చెప్పవే అమ్మా "

"చెప్పడానికేముందే ఆ సీతమ్మిండకి కడుపే ఎనిమిదోనెలో, తొమ్మిదో నెలోనే తల్లీ ఇంకేం చెప్పమంటావే ఆ లంజ గురించి "

సీతమ్మకి కడుపా!?

మాఆవిడకళ్లుతిరిగి కిందపడిపోతుంటే గభాల్న పట్టుకొని మంచంపై వేశాను

మరుసటి రోజు అత్తగారు అవిణ్ణి వూరు తీసుకెళ్ళిపోయేరు-పురుడికి

నా కళ్ళకింకా సీతమ్మ ముఖం కనిపిస్తూనే వుంది అత్త అన్న మాటలు నా చెవిల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

నిన్నటిదాక దేవత అన్న జనం ఈ రోజు దయ్యం అంటున్నారు

నేనే దేవుణ్ణి, లేక కారణజన్ముణ్ణి అని చెప్పుకొని సేవలు చేయించుకొనే బాబాలు, అమ్మలగుట్టు ఎప్పుడో ఒకనాడు బట్టబయలు కాక తప్పదు కాని సీతమ్మ కేసు వేరు తను బాబాల్లాగ, అమ్మల్లాగా 'నేనే దేవతని, శక్తినీ, సీతనీ' అని చెప్పుకోలేదు ఆమె మామూలు మనిషి

కాదు, దేవత, శక్తి, సీత అనిపించేలా చేశారు ఎవరు చేసింది? ఇంకెవరు? మా మావయ్య, అతని కూటమి. తన జుత్తులో మోక్షానికి చిట్కాలున్నాయని ఆమె అనలేదు వింతవింత గారడీలు చేయలేదు ఆమె పిచ్చిదో జడ్డిదో అయుండాలి ఆమె పిచ్చిని అమాయకత్వాన్ని వుపయోగించు కొని ఆమెను సీతగా నిలబెట్టేరు చందాలు, ముడుపులంటూ డబ్బు చేసుకున్నారు

ఇంకా నాకేమి అనిపించిందంటే—

ఆమె దేవత కాదని, దేవతగా సృష్టించింది తామని తెల్సుగాబట్టి—ఆమె అందానికి, వయసుకి పిచ్చెక్కి, పిచ్చిగా తాగొచ్చి మా మావయ్యే ఆ పిచ్చిసీతమ్మకి కడుపు చేసుండినా చేసుండొచ్చు అందుకు అవకాశముంది గాబట్టి ఆశ్చర్యపో నక్కర్లేదుకూడా

జనం ఆమెను బతకనియ్యరేమోనని, ఎవరికంటాపడకుండా ఆమెను ఆమె తల్లి అడవిలో ఒక మూలకి తీసుకుపోయి కాపాడుకుంటుందట, ఎంతయినా తల్లి తల్లే కూతురు దేవతైనా, దయ్యమైనా, ముండయినా, కుష్టిదైనా మాతృప్రేమ మారదు, తరగదు ఆ ప్రేమకంత బంధముంది, బలముంది

* * *

మా శ్రీమతి పురుడికెళ్ళి మూడునెలలు కావస్తున్నా ఒక వుత్తరం లేదు పత్తరం లేదు - మొదట్లో క్షేమంగా దిగామన్న ఒక్క కార్డుముక్క తప్పించి వచ్చిన చిక్కు ఏమిటంటే ఉత్తరాలు రాసే అలవాటు నాకూ లేదు ఆ కార్డుముక్కకి రిప్లై కూడా రాయలేదు ఇంతవరకూ అంత బద్ధకం నాకు

ఇంతకీ శ్రీమతిగారు ఎలా వున్నారో ఏమిటో — ఈసారి ఖచ్చితంగా బద్ధకించకుండా ఉత్తరం రాయాలని టేబుల్ దగ్గర ఇలా కూర్చున్నానో లేదో 'సార్ టెలిగ్రాం' అన్న కేకకి గుండెలదిరేయి పరిగెట్టేను, ఎర్రకాగితంలో దేంజరులేదు. ఇలావుంది 'కూతురు తల్లీ, పిల్లాక్షేమం.'

ఇక నాలో ఆపుకోలేని ఆనందం గుండెల్లో పట్టలేని సంతోషం

శెలవుపెట్టి బయలుదేరాను

తల్లీ పిల్లను చూపి శెలవై పోవడంతో తిరిగి ప్రయాణమవుతుంటే —

"అల్లుడూ ఈ రోజు శనివారం సీతమ్మ దర్శనం చేసుకుపోగూడదూ" అంది అత్త!

నేను నిర్ఘాంతపోయాను. నీరసం వచ్చేసి కుర్చీలో కూలబడిపోయేను.

మా అత్తకిగాని మతిపోలేదుగదా. ఏమిటి మాటాడుతోంది?

"అదేమిటత్తా! మొన్నంటే మొన్న సీతమ్మ చెడిన ఆడదన్నావు. తిట్టేవు మళ్ళీ ఇపుడు! "

మా అత్త మధ్యలోనే అందుకొని 'అపచారం, అపచారం' అని లెంపలు వేసుకొని "అవును బాబు అప్పుడు కూసింది తప్పే ఆ తల్లి మహిమ తెలీక నేనే కాదు, అంతా అలాగే అజ్ఞానంగా నిందించేరు మేమంతా ఆ తల్లికి క్షమాపణలు చెప్పుకున్నాం దయగల తల్లి మమ్మల్నందర్నీ క్షమించేసింది" అంది

"ఇంతలోనే ఏమిటండీ మీరు తెల్సుకున్న ఆతల్లిమహిమ?" చిరాగ్గా అడిగేను

"సీతమ్మ తల్లి లవకుశుల్ని ప్రసవించింది బాబు "

"అవునండి లవకుశుల్ని ప్రసవించింది మీకు చెబ్దామనుకొనే మర్చిపోయా" అంది మా శ్రీమతి

నా బుర్ర గిర్రున తిరిగింది! □

# మేలుకొలుపు

మనస్సు తాళాలు తియ్యి—సౌజన్య సుగంధాలు లోనికి రానియ్యి'
మాలిన్యపు మకిలిని మానవతా శుభ్రజలాలతో కడిగెయ్యి॥
తలుపులు మూసిన మాత్రాన భద్రత బహుధా ఉందనుకోడం భ్రమ—
మనస్సు మూసుకుని, మనుగడ సాగించేవాడు చచ్చినవానితో జమ।
ప్రకృతికి సంకెళ్ళులేవు, పారతంత్ర్యం ప్రకృతికి పర్యాయపదంకాదు
మందానిలానికి బంధనాలులేవు, తన ఆప్తమిత్రాళికే పరిమితంకాదు
అందం ఎదల్లో చొచ్చుకుని సమత్వ సుమాల సుందరమాల కడుతోంది।
స్వార్థ చింతనలేదు వసంతానికి, చుట్టూ అగడ్తల్ని కట్టుకోదు
సౌందర్య సుగంధాల్ని చేతనాచేతనా లన్నింటికీ సాదరంగా పంచుతోంది!
నింగీ, నేలా, సూర్యుడు, చంద్రుడు, నీరూ, గాలీ, నక్షత్రకుటుంబము—
సమస్త జీవకోటికోసం—తమ్ము తా మంకితం చేసుకుంటున్నాయి।
జీవ ప్రపంచ చైతన్య ప్రభల్ని వెలిగించేందుకు, దీక్షా ముద్ర ధరించాయి॥—
వేగం దూరాన్ని హ(సి)రిస్తోంది, అణువు బ్రహ్మాండాన్ని లోన ఇముడ్చుకుంటోంది
ఈ క్షణానికి, ఈ దినానికి, ఈ జీవితానికి, ఈ తరానికి, ఈ యుగానికి—
చరిత్ర విస్తృత పరిధిలో ఒక అల్పాల్ప సూక్ష్మబిందువుకున్నంత విలువ।
ప్రకృతి సుందర సరంలో— సజీవ చైతన్య ప్రవాళం మానవుడు
సృష్టి చైతన్యజ్యోతి, కాలపు పొరల్నిచీల్చి, సుదూర భవిష్యత్‌ని దర్శిస్తోంది।
జడంలో, జలంలో, ప్రాణంలో, పాషాణంలో తన నీడను చూసుకుంటోంది
ఈ మేడలు, ఈ గోడలు, తాళాలు, తుపాకులు, ఆల్సేషియన్ కుక్కలు
సర్వ సమతా మానవతా మధుర సంగీతంలో అపశృతులు।
కళలు, శాస్త్రాలు, సచ్ఛీలం, పురోగామిభావాలు—ఎందుకో కలవరపడుతున్నాయి—
స్వార్థం, ద్వేషం, అసూయ, అసహనం—ఛురికలు పదునై, మెరుస్తున్నాయి।
ఏదో చీకటి, ఎక్కడో కాంతి, ఏవో మెరుపులు, మరకలు, సందడి, భయం
నాగరికతా సంస్కృతుల సుందర మందిరంలో—ధన దర్పాధికారాల సంకెళ్ళలో—
దీనుడై, హీనుడై, రోదించే మానవుడ్నిచూసి ఆశ్చర్యంతో మెరిపింది గగనం।
స్వార్థపరుల దురాశానలానికింధన మౌతున్న—మానవతను చూసి—కన్నీరు కార్చు
తున్నది మేఘం॥—

మినీకథ

# ఎక్స్‌రే కళ్ళు

5 గంటల నుండే ఒక్కొక్కరే రవీంద్ర భారతికి రాసాగారు 6గంటలు కాగానే రవీంద్రభారతి అంతా ప్రేక్షక మహాశయులతో నిండిపోయింది

ఆవేళ ప్రఖ్యాత ఇంద్రజాలికుడు ప్రొఫెసర్ జలాల్ ఇంద్రజాల విద్యను చూపెడుతున్నాడు

ప్రదర్శన జోరుగా సాగుతున్నది ప్రేక్షకులు ఆనందం పట్టలేక చప్పట్లు కొడుతున్నారు కొందరు ఉత్సాహంతో ఈలలు వేస్తున్నారు ఇలా పసందుగా సాగుతున్న సమయంలో ఒక వింత ప్రదర్శనను ప్రారంభించాడు ఇంద్రజాలికుడు.

అదేమిటంటే—

ఆరోజు న్యూస్‌పేపర్ తీసి బల్లమీద పెట్టాడు దాని మీద తన దగ్గరున్న నల్లని దళసరి గుడ్డను రెండు మడతలు వేసి. ఒకసారి అది అందరికీ చూపించి న్యూస్ పేపర్‌ను ధారాళంగా చదవసాగాడు అది చూసి హాల్లో వాళ్ళందరూ విస్తుపోయారు వాళ్ళందరితో పాటు 'విజయ' కూడా విస్తుపోయింది అంతలోనే ఇంద్రజాలికుడు తన నల్లని కోటును విప్పదీసి ఆ రెండు మడతల గుడ్డపైన వేసి మళ్ళీ చక్కగా చదవసాగాడు

ఇది చూసి చికాకు పడుతూ లేచి పోబోయింది 100/-రూపాయలు టిక్కెట్టు కొన్న విజయ ప్రక్కనే కూర్చున్న ఆడవాళ్ళు "అదేమిటి ఇంత అద్భుతంగా ఉంటే లేచిపోతున్నావ్" అని ఆశ్చర్యంగా అడిగారు

విజయ చిరాకు పడింది:

"మీకేం సిగ్గూ ఎగ్గూల్లేవనుకుంటాను అంత మందమైన నాలుగు పొరలున్న గుడ్డల నుండే పేపరును నిక్షేపంగా చదివేస్తున్నాడే. ఈ పల్చని నాజూకైన బట్టలను కట్టుకొని మీరంతా వాడి ఎదుట ఇంకా ఎట్లా కూర్చోగలుగుతున్నారు? ఛీ ఛీ పాడు—" అంటూ హేండ్ బాగ్‌ను చేతికి తగిలించుకొని చరచరా హాలు బయటికి నడిచింది విజయ

—రావూరి రవీంద్రనాథ్

---

ప్రాణం. జీవం. మేధ. చైతన్యం—గల మనిషివి నువ్వు!
చరిత్ర చక్రాన్నింకా హింసారక్తపాతాల మార్గంలోనే పోనిస్తావా??
కష్టాలకు కరుగక, కన్నీళ్ళకు చలించక, ఇంకా జడంగా కూర్చుంటావా?'
ఉచ్ఛ్వాసవంతో ప్రక్కవాని కందియ్యి పిలుపు—స్నేహంతో చెయ్యికలుపు—
స్వార్థతత్వానికి చెవులు మెలెయ్యి—సంకుచిత్వాన్ని సత్వరం ఉరితియ్యి!
చరిత్ర గతిమీద, దుష్ట సంఘ వ్యవస్థమీద ప్రభంజనంలా ఎదురుతిరుగు—
పిరికి వదులు, ఉరికి కదులు, మనిషిగా మహోన్నతుడవై ఎదుగు!!
అసంఖ్యాక పీడిత ప్రజాసందోహానికి బంగారు భవిష్యత్‌ని పొదుగు!!

—బొడ్డపాటి సూర్యనారాయణమూర్తి

రాజారావు జ్యోతిష్యాన్ని అసలు నమ్మే వాడు కాడు. ఎవరైనా నమ్మేవాళ్ళు దాన్నిగురించి చెప్తే తిట్టేవాడు.

"అదంతా ఒట్టి బోగస్ డబ్బుకోసం వాళ్ళ నోటికొచ్చినట్లు చెప్తుంటారు కూటికోసం కోటివిద్యలు — అందులో ఇదొకటి" అనేవాడు

కాని ఈ మధ్య అతను పూర్తిగా మారి పోయాడు ఇప్పుడు జ్యోతిశ్శాస్త్రాన్ని రాజారావు నమ్మినంతగా ఇంకెవ్వరూ నమ్మరని చెప్పవచ్చు అతనిలో ఊహించని ఈ మార్పుకలగడానికి కారణమైన ఒక విచిత్రమైన సంఘటన ఉంది రాజారావు స్నేహితు డొకడికి జ్యోతిశ్శాస్త్రం మీద అపారమైన నమ్మకం వుంది ఒక రోజు ఒకానొక తెలుగు దినపత్రికలో అతడెవరో సుప్రసిద్ధ జ్యోతిష్కుడు సంఘసేవ కోసం నగరానికి వేంచేసినట్లూ—ఫలాని హోటల్లో ఫలాని నంబరు గదిలో వున్నట్టూ, అతను నగరంనుండి వెళ్ళి పోకముందే ఆ మహదవకాశాన్ని విని యోగించుకోవడం కోసం అతనిని కలుసు కోవలసిందిగా ప్రకటింపబడింది

# జ్యోతిష్యఫలం

'మల్లిక్'

రాజారావు స్నేహితుడు "ఛలో" అన్నాడు రాజారావుతో

రాజారావు "నీకు బుద్ధిలేదూ?" అని అడిగాడు.

"ఇతనిగురించి నీకేం తెలుసు?. ఫలానా ఫలానా గొప్పవారికి ఇతను జోస్యం చెప్పాడు. ఫుట్‌పాత్‌మీది చిలక జోస్యంగాళ్ళలా అనుకున్నావా? ఇతను చెప్పినవన్నీ నిజమౌతాయి! .." అంటూ ఇదివరకు ఆ జ్యోతిష్కుడు ఎవరెవరికి ఏమేం చెప్పాడో అవి ఎలా నిజమైనాయో కూడా చెప్పాడు అన్నట్టు అతనికి "జ్యోతిష్క చక్రవర్తి"నో మరేదో బిరుదున్నట్లుకూడా చెప్పాడు.

సరే ఈగందరగోళమంతా స్వయంగా పరికించి ఆ జ్యోతిష్కుడి బండారమంతా బయటపెట్టి తన స్నేహితుడి జ్ఞాన నేత్రాన్ని బలవంతంగానైనాసరే తెరిపించు దామని నిర్ణయించుకున్నాడు రాజారావు ఇద్దరూ కలిపి ఆ జ్యోతిష్కుడి దగ్గరికి బయలుదేరారు

అక్కడ, ఆ హోటలు గదిముందు ఆ జ్యోతిష్కుడిని కలవడానికి బయట ఎదురుచూస్తున్న జనాన్ని చూసి ఆశ్చర్యపోయాడు రాజారావు అయితే ఇతగాడెవరో పెద్దసైజు మోసగాడన్నమాట! అనుకున్నాడు ఈ లోకంలో ఇంతమంది మూఢులున్నారా? అని ఆశ్చర్యపోయాడు

ఆ జోతిష్కుడిని కలవడానికి వారి వంతు వచ్చేటప్పటికి ఒక గంట పట్టింది ఈ గంట కాలంలో రాజారావు "పోదాం లెద్దూ వీడికోసం ఎంతసేపిక్కడ వేచి ఉండాలి" అని ఓ అరవైసార్లు తన స్నేహితుడితో అన్నాడు అతని స్నేహి తుడు కూడా "ఛస్ నోర్ముయ్ " అని

అరవై సార్లన్నాడు

తన స్నేహితుడికి జోస్యం చెప్తున్నంతసేపూ రాజారావు ఆ జోతిష్క చక్రవర్తిని గమనిస్తూ కూర్చున్నాడు. రాజారావుకు ఏమనిపించిందంటే అతగాడు ఏదీ తేల్చి చెప్పడు-అవుతే అవుతుంది-లేకపోతే లేదు ఈ మోస్తరుగానే చెప్తున్నట్లు అభిప్రాయపడ్డాడు తనకు నమ్మకం లేకపోయినా ఏమి చెప్తాడో తెలుసుకోవాలన్న కుతూహలాన్ని అణుచుకోలేక రాజారావు తనుకూడా చెయ్యి చూపించుకున్నాడు రాజారావు ప్రేమించి పెళ్ళి చేసుకుంటాడనీ పెళ్ళయిన తరువాత అతనికి ఏదో లాభం కలగబోతుందనీ చెప్పాడు రాజారావుకు అతని నలభై ఒకటో ఏట నీటిగండం ఉందనీ అది తప్పితే అతనికి డెబ్బైఏళ్ళ ఆయుష్షు అనీ చెప్పాడు రాజారావు అతని మాటలను తేలికగా కొట్టి పారేశాడు

"మీరలా తేలికగా తీసి పారెయ్యడానికి వీలులేదు నేను చెప్పింది అక్షరాల నిజం! మీరు శాంతి చేయిస్తే ఆ గండం తప్పుతుంది" అన్నాడు శాంతి చెయ్యడానికి యాభై రూపాయల వరకూ ఖర్చు అవుతుందని చెప్పాడు

లేనిపోని భయాలు మనసులో సృష్టించుకుని తను అనవసరంగా డబ్బు ఖర్చు పెట్టబోవడంలేదని అన్నాడు రాజారావు.

"అలాగయితే మీకు నలభై ఏళ్ళు నిండిన కొద్దిరోజులకే నీటి గండంవల్ల మరణిస్తారు! " కచ్చితంగా చెప్పాడు ఆ జోతిష్య చక్రవర్తి.

రాజారావు అతనిమీదకు నర్రురునలేచాడు అతన్ని నానా దుర్భాషలాడి 'నీ ఫీజుకూడా యివ్వను నీ బాబుతో చెప్పుకో' అన్నాడు రాజారావు స్నేహితుడు అతడిని శాంతింపజేసి మంచి మాటలు చెప్పి అతన్ని బయటకు తీసికెళ్ళి పోయాడు. రాజారావు శాంతి చేయించకుండా వెళ్ళిపోయినందుకు జ్యోతిష్కుడు విచారించాడు

ఆ తరువాత ఓ సంవత్సరానికి రాజా



రావు ఒకమ్మాయి ప్రేమలో పడటమూ, ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవడమూ జరిగింది శోభనం నాటిరాత్రి ఆ జోతిష్కుడు గుర్తుకు వచ్చాడు అటువంటి సమయంలో అతను గుర్తుకు రావడం రాజారావుకు చీకాకు కలిగించింది. ఆ జోతిష్క చక్రవర్తి చెప్పిన విధంగా తను ప్రేమించి పెళ్ళిచేసుకున్నా అతని మీద తనకు ఇంకా నమ్మకం కుదరడం లేదు

"వాడి మొహం వాడేదో నోటికొచ్చినది చెప్పేశాడు అది అదృష్టవశాత్తు నిజమైంది! తనే గనుక పెద్దవాళ్ళను ఎదిరించి ఉండకపోతే ఈ పెళ్ళి అయివుండేదేనా? సుమతిని పెళ్ళి చేసుకోవడం గురించి తను ఎన్ని కష్టాలు పడ్డాడు? సుమతీ అంతే తన తల్లిదండ్రులు వీల్లేదని అన్నాకూడా వాళ్ళ మాటలు లెక్కచెయ్యకుండా తనను చేసుకోవడానికి ముందుకు వచ్చింది అంతే ఇద్దరూ రిజిష్టర్ మ్యారేజ్ చేసుకున్నారు" అనుకున్నాడు రాజారావు

పెళ్ళయిన రెండుమూడు సంవత్సరాలకు రాజారావుకు లాటరీలో ఒకలక్ష తగిలింది అతను ఎగిరి గంతేసాడు ప్రేమించిన అమ్మాయితో పెళ్ళి-సుఖంగా జీవించడానికి కావలసినంత డబ్బు! ఎవరికి మాత్రం ఇంతకు మించి ఏం కావాలి? రాజారావుకు మళ్ళీ ఆ జోతిష్కుడు గుర్తుకు వచ్చాడు.

పెళ్ళయిన తరువాత తనకేదో లాభం కలుగబోతున్నట్లు చెప్పాడతను తనకు లాటరీలో లక్ష రూపాయలు రావటం దాని ఫలితమేనా? ఎలాగయినా జోతిశ్శాస్త్రం అంత పూర్తిగా తీసిపారెయ్యదగినది కాదు! అనుకున్నాడు అప్పుడు అప్పటి నుండీ అతనికి జోతిష్కం మీద కాస్త నమ్మకం ఏర్పడింది అప్పుడప్పుడూ అతను కొంత మంది జోతిష్కుల దగ్గర చెయ్యి చూపించుకోవడం కూడా మొదలు బెట్టాడు వాళ్ళు చెప్పినవన్నీ జరుగుతున్నట్లే అతనికి అనిపించసాగింది వాళ్ళు చెప్పినవేమైనా—నిజమైనా కాకపోయినా రాజారావు మాత్రం తనకు జరిగే సంఘటనలకు జోతిష్కులు చెప్పినదానికి అనుకూలంగా అర్థం కల్పించుకుని ఓ విధమైన సంతృప్తిని అనుభవించడం మొదలు బెట్టాడు

రాజారావుకు జోతిష్కం మీద పూర్తిగా నూటికి నూరు పాళ్ళ నమ్మకం ఏర్పడేటప్పటికి అతని వయసు ముప్పై సంవత్సరాలు అతని గుండె గుభేలు మంది. తను నలభై ఒకటో ఏట నీటి గండంవల్ల మరణిస్తాడని ఆ జోతిష్క చక్రవర్తి చెప్పాడు. అతను చెప్పిన విధంగా తను ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళయిన తరువాత తనకేదో లాభం కలగబోతుందని అన్నాడు తనకు లాటరీలో లక్ష తగిలింది? తనకు నలభై ఏళ్ళు నిండిన తరువాత నీటి గండంవల్ల మరణిస్తాడని అన్నాడు ఇది కూడా జరగక తప్పదా? అంటే అంటే తన జీవితకాలం ఇంకా పదేళ్ళు మాత్రమే నన్నమాట!! తను మరణిస్తే సుమతి. తన ఇద్దరు బిడ్డల గతి ఏం కాను? జీవితం వడ్డించిన విస్తరిలా వుంది దానిని




పూర్తిగా అనుభవించక ముందే తను మరణిస్తాడు

రాజారావు బెంగపడిపోయాడు సీటి గండానికి సంబంధించిన ఆలోచనలు అతన్ని అనుక్షణం వెన్నాడసాగాయి. కొంత మంది జోతిష్కుల దగ్గర చెయ్యి చూపించుకుని తన ఆయుష్షు గురించి అడిగాడు వాళ్ళందరూ అతను డెబ్బై ఏళ్ళ పైగా బ్రతుకుతాడని చెప్పారు అతనికే గండమూ వుండబోదని చెప్పారు వేరే విషయాలైతే అతడు అంతగా పట్టించుకునే వాడు కాదు—కాని ఇది తన ప్రాణానికి సంబంధించిన విషయమాయె! అందుకనే తన మనస్సుకు సర్ది చెప్పుకోలేక సతమతమైపోతున్నాడు అయితే ఒకటి—తనకా గండం తప్పితే తను డబ్బై ఏళ్ళు బ్రకుకుతాడని ఆ జోతిష్క చక్రవర్తి చెప్పాడు అసలు అతను చెప్పినప్పుడే తను శాంతి చేయించవలసింది అప్పట్లో తనకు వీటి మీద అంత నమ్మకం లేదు. ఇప్పుడు అదే తన కొంపల మీదికి తెచ్చింది అనుకున్నాడు రాజారావు. అతను తన అవివేకానికి అదేపనిగా బాధ పడసాగాడు

రాజారావు మనోవ్యధతో రోజు రోజుకూ చిక్కి శల్యమైపోసాగాడు. ఇంకా తను పదేళ్ళు బ్రతుకుతాడు ఇంకా తొమ్మిదేళ్ళ మూడువందల అరవై నాలుగు రోజులు అరవై మూడు రోజులు

ఇలా అతను ప్రతీరోజు తన ఆయువును లెక్కబెట్టుకుంటున్నాడు

"ఏమిటోయ్! ఈ మధ్య నువ్వు మరీ అలా చిక్కిపోతున్నావ్?" అంటూ కనిపించిన ప్రతి ఒక్కరూ అతనిని అడగసాగారు. తన మనసులోని భయాలనూ సందేహాలను ఇతరుల ముందు వ్యక్తం చెయ్యడం అతనికి యిష్టం లేదు. ఎవ్వరికీ ఆ విషయం చెప్పకుండా అతను తనలో

తానే కుమిలిపోసాగాడు సుమతికి కూడా తన నీటిగండం విషయం చెప్పలేదు. అనవసరంగా ఆమెను కూడా భయ పెట్టడం ఎందుకని అతని అభిప్రాయం

ఆ రోజు ఉదయం రాజారావు వీధి వరండాలో పేపరు చదువుతూ కూర్చుని వున్నాడు.

"లోపలికి రావచ్చాండీ " ఎవరిదో గొంతు వినిపిస్తే రాజారావు తలెత్తి చూశాడు ఎదురుగా అతి గినయంగా చేతులు కట్టుకుని నిలబడివున్న పరమేశం కనిపించాడు. రాజారావుకు తనకు లాట రీలో లక్ష తగిలినప్పుడు కూడా అంత ఆనందం కలగలేదు

"ఒరేయ్ ఒరేయ్. .దొంగ భడవా, చాల్లే వేధవ్వేషాలు సరిగ్గా నిలబడు" అంటూ ఒక్క ఉదుటున కుర్చీలోంచిలేచి పరమేశాన్ని కౌగలించుకున్నాడు ఈ మధ్యకాలంలో రాజారావులో అందులో పదోవంతు ఉత్సాహమైనా కలగలేదు

"నువ్వేమో లక్షాధికారివై పోయావు! ఏమో మేము గుర్తుంటామో లేదోనని భయపడ్డాను " అన్నాడు పరమేశం నవ్వుతూ.

"నీకు మాత్రం తక్కువేమైంది. గెజిటెడ్ ఆఫీసరువి! ఇంతకూ ఎక్కడ నుండి రావడం? ఏమైనా పనుండి వచ్చావా? లేక మా మీద దయ కలి గిందా? మీ వాళ్ళందరూ ఎలావున్నారు? బుజ్జిగాడి తరువాత మళ్ళీ ఏమైనా? " ఇలా ప్రశ్నమీద ప్రశ్న వేశాడురాజా రావు—పరమేశం చేతిలోని సూట్ కేస్ అందుకుంటూ

"నువ్విలా ప్రశ్నల వర్షం కురిపిస్తూనే వుంటావా? లేక కాఫీ ఏర్పాటేమైనా వుందా? " అన్నాడు పరమేశం.

"కాఫీదేం భాగ్యమోయ్ పద లోపలికి పోయి కూర్చుందాం ఆ! స్నానానికి వేడినీళ్ళా చన్నీళ్ళా! "

"ఇంత చలేస్తుంటే వేణ్ణీళ్లా చన్నీళ్లా అని విడిగా అడుగుతావేమిటి? "

రాజారావు సుమతితో పరమేశం వచ్చి నట్లు చెప్పడానికీ, అతనికి స్నానానికి భోజనానికి ఏర్పాట్లు చెయ్యడానికి లోపలికి వెళ్ళాడు

రాజారావు పరమేశం ఇద్దరూ బాల్య మిత్రులు ఒకటో తరగతి నుండి కాలేజీ చదువుల వరకూ ఇద్దరూ కలిపి చదువు కున్నారు—కలిసి తిరిగారు ఉద్యోగరీత్యా చెరో వూరు వెళిపోయి విడిపోవలసి వచ్చింది అప్పుడప్పుడు వీలు చిక్కి నప్పుడు రాజారావు పరమేశం దగ్గరికి వెళ్ళడమో, లేదా పరమేశం రాజారావు దగ్గరికి రావడమో చేస్తుండేవార [illegible]రికీ సంసార బాధ్యతలు పెరిగా[illegible] బట్టి ఇప్పుడు కాస్త రాకపోకలు తగ్గాయి. పరమేశం రాజారావు పెళ్ళికి [illegible]రావడమే ఆ తరువాత ఇద్దరూ కలుసుకోలేదు

భోజనాలయిన తరువాత మిత్రులిద్దరూ చిన్నప్పటి విషయాలనుచర్చించుకున్నారు సుమతి తన భర్తలో ఇదివరకటి ఉత్సాహం చూపింది తనకు ముఖ్యమైన పనులు కొన్ని ఉన్నాయని అందుచేత అక్కడ రెండు రోజుల కంటే ఎక్కువ వుండడానికి వీల్లేదని పరమేశం అన్నాడు రాజారావు ఆ రెండు రోజు

లకూ శలవు చీటీ రాసి నౌకరుతో ఆఫీసుకు పంపించాడు. మధ్యాహ్నం వరకూ వాళ్ళు అట్లానే మాటలతో సర్దాగా గడిపి కాస్సేపు విశ్రాంతి తీసుకుని సాయంత్రం సినిమాకు వెళ్ళారు.

రాత్రి భోజనాల తరువాత రాజారావు పరమేశం ఇద్దరూ డాబామీదకు వెళ్ళిపోయారు. మాటల మధ్యలో పరమేశం కూడా అందరూ అంటున్న మాటనే రాజారావుతో అన్నాడు.

"ఏమిటోయ్ .... నువ్వు మరీ చిక్కిపోయినట్లున్నావ్?... ఒంట్లో బావుండటం లేదా?...."

రాజారావు కాస్సేపు తటపటాయించి అసలు విషయం చెప్పేశాడు.

"అబ్బే.... నువ్వు అనవసరంగా భయపడుతున్నావోయ్ .... నీటిగండం లేదు బొంద లేదు.... అనవసరంగా లేని పోని భయాలు మనసులో పెట్టుకోకు ...." అంటూ రాజారావు మాటల్ని తేలికగా కొట్టివేశాడు పరమేశం.

రాజారావు అది అంత తేలికగా కొట్టి పారేసే విషయం కాదనీ — ఇదివరకు జ్యోతిష్కులు చెప్పిన విషయాలు తన పట్ల ఏయేవిధంగా నిజమైనాయో పరమేశంతో చెప్పాడు.

"అయినా అంత కంగారుపడవలసింది ఏముంది?... నీకు నీటిగండం ఉందంటు

న్నావు కదా? నువ్వు ఈత నేర్చుకుంటే సరిపోతుందిగా? "

"ఈ వయసులో నాకు ఈత వస్తుందంటావా? " రాజారావు తన సందేహాన్ని వ్యక్తపరిచాడు

"ఎందుకు రాదూ? ఈత నేర్చుకోవడం ఏమంత కష్టమైన పని కాదు" అన్నాడు పరమేశం

ఊరికి వెళ్ళేముందుకూడా బస్సు స్టాండు దగ్గర ఈత నేర్చుకోమని రాజారావుతో మరీమరీ చెప్పాడు పరమేశం

పరమేశం వెళ్ళిపోయిన ఒకటి రెండు రోజులకే రాజారావు ఈత నేర్చుకోవడం మొదలుబెట్టాడు రాజారావు ఇంటికి నాలుగిళ్ళ అవతల ఉన్న ఒకాయనకు ఈత బాగా వచ్చు సాయంత్రం ఆయన రాజారావును తీసుకు వెళ్ళి రోజూ ఈత నేర్పిస్తున్నాడు ఒక రెండు వారాల్లోనే రాజారావు బాగా ఈదడం నేర్చుకున్నాడు రోజూ సాయంత్రం నియమంతప్పకుండా ఈతకు వెళ్తున్నాడు రాజారావు అది ఇప్పుడు అతని నిత్యకృత్యాలలో ఒకటిగా అయిపోయింది రోజులు గడిచిపోతున్నాయి.

ఇప్పుడు రాజారావుకు నలభై ఏళ్ళు నిండాయి అతనిప్పుడు గజ ఈతగాడు. తనకిప్పుడు నీటిగండం లేదని అనుకున్నాడు గానీ ఆ రోజు సుబ్బయ్య మరణవార్త విన్నాక అతనిలో ధైర్యం మళ్ళీ సన్నగిల్లింది

సుబ్బయ్య ఎండలో బాగా తిరిగి ఇంటికి వచ్చి దాహానికి కాస్సేపయినావేచి ఉండక వెంటనే మంచినీళ్ళు త్రాగబోయి గుటకపడక గుండెల్లో పట్టుకుని మరణించాడు సుబ్బయ్య మంచి నీళ్ళు త్రాగబోయి మరణించాడు ఇది నీళ్ళవల్ల సంభవించిన మరణంగాబట్టి దీన్నికూడా నీటి గండమనే అంటారా? మరైతే తను ఈత నేర్చుకుని ఏం లాభం? నీటి గండం తనకు సుబ్బయ్యకు సంభవించిన విధంగా మరో రకంగా సంభవిస్తే?

రాజారావు మళ్ళీ బెంగపెట్టుకున్నాడు

ఆ రోజు శలవురోజు కావడంమూలాన రాజారావు మిత్రులు పిక్నిక్ ప్రోగ్రాం వేసుకున్నారు. ఊరి చివర మామిడి తోటకు వెళ్ళారు అంతా కలిపి పదిమంది వరకూ ఉంటారు వాళ్ళు మధ్యాహ్నం వరకూ చెస్, పేకాట ఆడుతూ సరదాగా కాలం గడిపారు మధ్యాహ్నం తమకూడా తెచ్చుకున్న ఫలహారాలు తినేశారు తరువాత కొంతసేపు ఒకాయన పాటలు పాడేడు ఆ తరువాత ట్రాన్సిస్టరు వింటూ కబుర్లు చెప్పుకుంటూ సాయంత్రంవరకూ గడిపేశారు

"కాస్సేపు చెర్లో ఈత కొడదామేమిటీ? " ఎవరో తన కోరికను వ్యక్తం చేశారు

"ఇక్కడ చెరువేదీ? "

"ఇక్కడికి ఒక ఫర్లాంగు దూరంలో ఉంది రండి నేను తీసుకువెళ్తాను "

"మరి మాకు ఈత రాదే! "

"రాజారావూ నేనూ ఈత కొడ్తాం . మీరందరూ చెరువుగట్టుమీద కూర్చోండి. ఆ స్థలం బావుంటుందిలే" అన్నాడతను.

అందరూ అక్కడికి బయలుదేరారు

రాజారావూ అతను కాస్సేపు ఈత కొట్టారు. అతని స్నేహితులు ఏవైనా వస్తువులు నీళ్ళలోకి విసుర్తే రాజారావు

ఈదుకుంటూ వెళ్ళి వాటిని మళ్ళీ బయటికి తీసుకొస్తున్నాడు. వాళ్ళు ఆశ్చర్యపడు తున్నకొద్దీ రాజారావులో ఉత్సాహం పెరగసాగింది ఎవరో కుండపెంకు ఒకటి చెరువు మధ్యకి విసిరారు రాజారావు దానిని తీసుకురావడంకోసం చెరువు మధ్యకు ఈదుకుంటూ వెళ్ళాడు ఒక్కసారి బాగా ఊపిరి తీసుకుని లోపలికి మునిగిపోయాడు ఎట్లాగయితేనేం కష్టపడి వెతికి దాన్ని దొరకపుచ్చుకున్నాడు ఉన్నట్లుండి రాజారావుకు తన నీటిగండం గురించి గుర్తుకు వచ్చింది తనకు నలభై ఏళ్ళు నిండాయి కొంపతీసి తనకు ఇప్పుడా నీటిగండం సంభవించదుకదా! రాజారావు గుండె కొన్నిక్షణాలు భారంగా కొట్టుకుంది ఆ సమయంలో అతను నీళ్ళలోంచి బయటికి వద్దామని అనుకుంటూండగా అతని కాళ్ళకు పామొకటి చుట్టుకుంది రాజారావు శరీరం బిగుసుకు పోయింది పాములంటే అతనికి చచ్చేంత భయం నీటిపాములవల్ల అంత ప్రమాదం లేదని విన్నాడు గానీ ఏమో! వాటిల్లోకూడా విషపూరితమైనవి ఉంటాయేమో' రాజారావు కాలు గట్టిగా విదిలించాడు నీళ్లల్లో తను ఎంత బలంగా కాలు ఊపుదామన్నా కుదరడంలేదు పాము కాలికి మరింతగా చుట్టుకున్నట్లు అనిపించింది తనకు నలభై ఏళ్లు నిండిపోయాయి తనిప్పుడు నీళ్లల్లో పామువాత పడి చావబోతున్నాడు రాజారావులో ధైర్యం సన్నగిల్లింది అతనికి తనభార్యా పిల్లలు గుర్తుకు వచ్చారు. ఎక్కడలేని ధైర్యంతెచ్చుకుని చేత్తో తనకాలుకు చుట్టుకున్న పామును లాగబోయాడు. కాని అది మరింతగా చుట్టుకుపోయింది రాజారావుకు భయంవేసింది త్వరగా ఒడ్డుకు చేరదామనే ప్రయత్నంలో ఉండగా కాలుకు చుట్టుకున్న పాము అతన్ని కాటువేసింది రాజారావు కాళ్లూ చేతులూ ఆడటం మానేశాయి "హెల్ప్ హెల్ప్ " అంటూ అరిచాడు ఒడ్డున ఉన్న స్నేహితులు అతను ఊరికే తమాషా చేస్తున్నాడని అనుకున్నారు గజ ఈతగాడు! అతనికి సహాయమేమిటనుకున్నారు

రాజారావు కాళ్ళలోంచి విషం మెల్లగా ఒళ్ళంతా ప్రాకినట్లు భావించాడు అతని మెదడు మొద్దుబారింది తన ఆయువు తీరిపోయింది తను మరణిస్తున్నాడు! పాము మళ్ళీ కరిచినట్లయింది విషం మెదడులోకి ఎక్కినట్లు ఫీలయ్యాడు అతను కాళ్లూ చేతులు ఇప్పుడు అతని స్వాధీనంలోంచి పూర్తిగా తప్పుకున్నాయి నీళ్ళలో మునిగిపోయేముందు మరోసారి బలహీనంగా "రక్షించండి పాము. మునిగిపోతున్నాను "అన్నాడు రాజారావు

మునిగిన రాజారావు ఎంతకూ తేలక పోయేసరికి స్నేహితులకు అనుమానం వచ్చింది ఒకడు ఈదుకుంటూ లోపలికి వెళ్ళి చూసొచ్చి ఆయాసపడుతూ రాజారావు చచ్చిపోయాడని చెప్పాడు దారినపోయే ఇద్దరు ఆసాముల సహాయంతో రాజారావు శవాన్ని బయటకు తీశారు

రాజారావు కాలుకు ఒక నల్లని గుడ్డ పేలిక చుట్టుకుపోయి ఉంది ఆ గుడ్డపేలికకు ఒక చిన్న ముళ్ళకంచెకూడా చిక్కుకుని ఉంది! □

# పురపాలక సంఘాలు పంచాయతీలకు

# విజ్ఞప్తి

మన నగరాలు, పట్టణాలు, గ్రామాలను
సుందరంగా, శోభాయమానంగా
చల్లగా, హాయిగా
పంచుకుందాం

తరుణంలో మొక్కలు నాటి చెట్లు పెంచుకుందాం
రోడ్లప్రక్కన, ఆఫీసుల్లో, పాఠశాలల్లో
పార్కుల్లో ఇతర బహిరంగ ప్రదేశాల్లో

*　　*　　*

పచ్చని చెట్లతో ప్రకృతి మాత
ప్రతిచోట కళకళలాడాలి

*　　*　　*

కావలసిన మొక్కలూ, అవసరమైన సలహాలు ఉచితం
సంప్రదించండి

జంటనగరాలలో

డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్,
ఎక్స్టెన్షన్ డివిజన్,
హైదరాబాదు - 500 004.
ఫోన్ నెం 30531
(ఎక్స్టెన్షన్ 45)

జిల్లాలలో

జిల్లా కేంద్రాలలోని
డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్.

డి.ఐ.ఐ.ఆర్./13/77




"పట్టపగలే యింత చిట్టచీకటిగ వుంది ..

కన్ను పొడుచుకున్నా దారి కనబడ్డం లేదు యిదేం అడవి మహర్షీ? కోట గోడలా దట్టంగా పెరిగిపోయిందీ" అన్నాడు రాముడు విశ్వామిత్రుడి వేపు చూసి

మద్దీ మారేళ్ళూ నేరేళ్ళూ చేవదేరి పోతరించి వున్నాయి చీకటంతా మేపి చీకూ చింతా లేక తీరికగా నెమరేస్తున్నాయి నల్లేర్లూ. అడ్డతివ్వలూ చిక్కులు పడి అల్లుకుపోయి నింగీ నేలా పందిళ్ళు వేస్తు న్నాయి. కాలికింద చిత్తడి నేలవూబిలా

ఎమర్జెన్సీ ప్రకటించిన వెంటనే రాయబడిన కథ. పత్రికలపై సెన్సార్ నిబంధనలున్నందున స్వయంగా మేము చేసుకొన్న 'సెన్సార్' కారణంగా ప్రచురించలేక పోయినదీ కథ. —ఎడిటర్

కూరుకుపోతోంది. రేగడిపడియల్లో అడవి పందులు కొమ్ములతో కుమ్మి దుంపలు పెరికి తింటూ గుర్రుమంటూ గడబిడ చేస్తున్నాయి. గుగ్గిలం దీపాల్లా గుడ్ల గూబల కళ్ళు గుప్పుగుప్పుమంటున్నాయి.

కీచురాళ్ళు చెవులు గీపెడుతున్నాయి.

"యిప్పుడిలా దిక్కుమాలిపోయింది గాని.... ఒకనాడిది కనుపండువైన జనపదం" అన్నాడు విశ్వామిత్రుడు.

జిల్లేళ్ళూ, బ్రహ్మచెముళ్ళూ నరుకుతూ లక్ష్మణుడు ముందు నడుస్తూ దారిచేస్తున్నాడు. మహర్షి మాట విని కత్తి చేతిలో వూపుతూ ఆగిచూసేడు.

నిలువెత్తు మనిషి. నిండైనవాడు మహర్షి. కుంకంబొట్టు నుదిటమీద రాజుకునేనిప్పులారువరువలాడుతోంది. తాపిన వజ్రంలా వుంది టోర. లోకాల అట్టుపట్టు ఆనవాళ్ళన్నీ ఆ కళ్ళల్లో మెదుల్తున్నాయి. రాజసం, ఓజసం నిలువెల్లా ధగధగలాడుతున్నాయి.

అది ముందుచూపు. మసగలేనిచూపు. నిజాయితీ నిండుకున్న చూపు. లోకాల క్షేమంమీద గురిపెట్టిన చూపు. ప్రతి అడుగూ నమ్మకానికి జాడ. అది ముందడుగు.

"ఎవరీ మహాత్ముడు" అనుకుంటున్నాడు లక్ష్మణుడు.

మంచు కరిగి అలలుదేరి జారినట్టు. పండుజుట్టూ బొద్దుమీసం గుబురుగెడ్డం అన్నీ కలిసి కదిలొచ్చే వెండికొండలా వున్నాడు మహర్షి.

"ఎందుకోసం ఎవరికోసం.... యీ మహనీయుడిలా ముందుకొచ్చేడు" అని విస్తుబోతూ "జనపదంవా? .... అయితే యీ ముళ్ళకంపలూ డొంకలూ యింత విచ్చల విడిగా యెలా పెరిగిపోయేయి మహర్షీ" అన్నాడు రాముడు.

"అబ్బ! కంపుకంపు" అని ముక్కు మూసుకుని జుమ్మని మీదకి ముసిరిన యీగల గుంపుని తోలుకుంటూ విశ్వామిత్రుడివేపు చూసేడు.

"కంపుకొడుతోందా రామా? ...దేశం వెలా వుందో చూడు .. అది చూపించడానికే నిన్నింత దూరం తీసుకొచ్చేను" అసహాయతలో దైన్యం మహర్షి చూపుల్లో నిండుకుంటోంది.

దుఃఖంలో పెల్లుబికే జాలిదయా తొణికిసలాడుతున్నాయి.

"యిదేం దేశంవంటారు మహాత్మా" యింకా ముక్కు మూసుకునే వున్నాడు రాముడు.

"మలదకరూశం" అన్నాడు మహర్షి.

"అంటే?"

"కుళ్ళూ....ఆకలీ "

"అదా యీ కంపు. .. అబ్బ! ఎలా వచ్చేయవీ?"

"ఏలిక దొరల వంటి కుళ్ళయ్యా . వాళ్ళ కడుపుల్లో ఆవురావురుమనే ఆకలి."

ఆవేదనలో కాకదేరి, మౌనంలో సానదేరి పదునెక్కుతోంది మహర్షి పలుకు.

"ఏలికదొరలా....వారెవరు మహర్షీ?"

"ఇంద్రుడు"

"యింద్రుడా! . . యీ కూపంలోకి ఆయనెందుకొచ్చేడూ?"

"పదవికోసమయ్యా....రామయ్యా అది నిలుపుకోవడంకోసం....అయిశ్వర్య

మంతా పణంపెట్టి అందరికీ అన్నీ యెర చూపించి ఆకట్టుకుని చచ్చీ చెడి వృత్రుడిమీద దొంగదెబ్బ తీసేడు మన పున్నవాడు వృత్రుడు మనుషుల మనిషి అతడి మనసు ఘోషించింది లోకం వుస్సు రంది ఆ వుసురు తగిలింది యింద్రుడికి. తెంపూ తెగువూలేని అజీర్ణం ఆకలీ పట్టు కున్నాయి. దాంతో కనబడ్డ వోటల్లా పాడు చేసేడు వాడు ఆ కంపు ముల్లోకాలూ ఆవ రించింది కొంప మునిగిందిరా బాబూ అనుకుంటూ యీ ఛట్టిగాళ్ళందరూ యేలిక దొర చుట్టూ గుమిగూడేరు "

"ఛట్టిలా వాళ్ళెవరు మహర్షీ?"

"ఇంకెవరయ్యా అధికారం చుట్టూ, మూగే యీగలు యిందాక నీ మొహం మీద జుమ్మని ముసిరేయి చూడు అవే ఓ అందరూ ఋషులే "

పక్కన నవ్వొచ్చింది లక్ష్మణుడికి అన్నగారి కంట్లో యెర్రజీర చూసి నవ్వాపు కుని బిర్ర బిగుసుకుపోయి కళ్ళప్పగించి చూస్తున్నాడు

"ఆఁ చేరేంచేసేరు వాళ్ళంతా?" అన్నాడు రాముడు

ఆ యింద్రుడిగారికి అమృత రసా యనం పట్టించేరు వైద్యం చేసి పథ్యం పెట్టించేరు దాంతో వాడు తేరుకున్నాడు కంపుకొడుతున్నాడు ఒళ్ళంతా మురికి నలుగుతోంది సీడపట్టి వున్నాడు అది చూడలేక శౌచమంత్రాలు చదివి మంగళ స్నానాలు చేయించి మళ్ళీ మనిషినిచేసేరు బతుకు జీవుడా అను-ంటూ వాడు స్వర్గా నికి పోయేడు పోయినవాడు పోరాదూ పోతూ పోతూ వాడి మలినాన్నీ ఆకలినీ యీ సీమకి అంకితంచేసి మరీపోయేడు అది పాలకుల గుణంలా వుంది లేక పోతే అదేం పోయేకాలం ఆ కుళ్ళూ ఆకలీ భరించిన సీమగనక యీ ప్రాంతాన్ని మలదకరూశమన్నారు" మహర్షి మాట ల్లోనూ చూపులోనూ అసహ్యం నిండి పోయింది

"అంటే మీ రనేది యీ నేలపాల కుల రోగాలరొంపి అన్నమాట" అన్నాడు రాముడు మహర్షిమాటలో ఆంతర్యాన్ని అందుకోబోయి

"కాదు కాదువాళ్ళ కుతంత్రాల కంపు రాజకీయాల రంకు అదే తరతరాల వారసత్వంలా మనల్ని వెంట తరుము తోంది అదే నీ ముక్కుపుటాల్ని బద్దలు చేస్తోంది."

పదహారేళ్ళ పచ్చదనంలో నవనవ లాడుతున్నా రన్నదమ్ములు వయసు బిగు వెక్కుతోంది కొత్త సంగతులు వింటు న్నారు వాళ్ళ చూపులు చురుకెక్కుతు న్నాయి దారీ తెన్నూ లేని దొంకలమధ్య వున్నారు వాళ్ళు కొరివి తగిలించిన బాణంలా ముందుకి దూసుకు వెళ్తున్నాడు మహర్షి వాళ్ళకి దారి కనబడుతోంది

ఆవేశం ముంచుకొస్తోంది లక్ష్మణుడికి అమ్మవారు పూనినట్టు తూగిపోతూ కంపల్నీ బ్రహ్మచెముడు డొంకల్నీ ఒక్క వూపులో చెండాడి పారేస్తున్నాడు దారి సాపుచేస్తూ విషప్పురుగులు చాటుమాటు కాటు వేయకుండా, అడ్డతివ్వలు ముందు కాళ్ళకి బంధం వెయ్యకుండా వెయ్యి కళ్ళతో కాపలా కాస్తున్నాడు

"ఆగేరేం మహర్షీ?" అన్నాడు రాముడు

వెనకబడిన మహర్షిని చూపి

అటూ యిటూ అలుముకున్న చెట్టూ చేమా అలజడిపడుతున్నాయి వాటి వెనక యేదో హడావుడి జరుగుతోంది

"మనజాడ పసిగడుతున్నారు" అన్నాడు మహర్షి అనుమానంగా కలయ జూస్తూ

"ఎవరు మహర్షీ" విల్లుమీద చెయ్యి వేసి కళ్ళు పెద్దవిచేసిచూసేడు రాముడు

"వేగులూ వంతగాళ్ళూ మేత మరిగిన మల్లులూ ఒకరేవిఁటి " నవ్వుతున్నాడు విశ్వామిత్రుడు

"ఎవరూ!"తిరిగిచూసే రన్నదమ్ములు

మారేడు రొడ్డనీ రేగు చిగుళ్ళనీ తొండాలెత్తి మడిచి తుంపిలాగి జాడిస్తు న్నాయి మదగజాలు దేవదారుల మాకుర్నీ మద్దిమానుల్నీ దంతాలతో ఒక్క దెబ్బలో కూల్చి పారేస్తున్నాయి ముందుకాళ్ళెత్తి మీదబడబోయేయి

నారితెగిన వింటి బద్దలా చివ్వున లేచి కత్తి యెత్తేడు లక్ష్మణుడు నవ్వుతున్న మహర్షిని చూసి తొండాలెత్తి ముడిచి వంగి దిగి వెనక్కి వెళ్ళిపోయేయి

"అంగబలం చూపిస్తున్నాయి రామా!" అన్నాడు విశ్వామిత్రుడు

"ఏనుగులు మహర్షీ!" అన్నాడు రాముడు

"అవేనయ్యా ఆవిడ బలఁవూ బలగఁవూనూ ఆవిడ చలవవల్లె అవి అలా మదించి మనగలుగుతున్నాయి పిలుస్తే చాలు కుంభస్తలాల్లో దాచిపెట్టిన ముత్యాలన్నీ ఆవిడ ముందు గుమ్మరిస్తాయి ఊఁ అంటే వాళ్ళమీద పడి అల్లకల్లోలం చేస్తాయి."

"ఆవిడెవరు మహర్షీ?"

"యీ మన్యానికి మహారాణీ"

"మహారాణీయా ఎవరు మహర్షీ?"

"తాటక" మహర్షి కళ్ళు చురచుర లాడేయి

"జనపదం అన్నారూ రాణీ యెలా అయిందీ?" సందేహంగా చూసేడు రాముడు

"రాణీనని చెప్పుకుంటుందా మహా జనుల కోరికమీదే మహారాణీలా చెలాయి స్తోంది ఆవిడ ఆడింది ఆటా పాడింది పాటా!"

"అదెలా వీలయిందీ?"

"అదే గడుసుతనం యీ కటిక చీకటిని చిక్కబట్టి మసిపూసి యీమారేళ్లూ నేరేళ్ళూ దట్టంగా పెంచి యీ అద్దాన పడవిలో పళ్ళు దుళ్ళగొట్టించి పంచి పెట్టించి వెర్రిమాలోకాల్ని బుట్టలో వేసుకుని రాలుగాయిల్ని రాఁగొట్టించి అదలించి బెదిరించి అందలం యెక్కి కూచుంది అయిదేసేళ్ళ కోమారు జాతర చేయించి యీ యేనుగుల అంబారీ మీదే వూరేగుతుంది పులుల్నీ సింహాల్నీ తొక్కి పారేయించి నక్కల్నీ కుక్కల్నీ చేరదీసి చిత్తులుపన్నించి వేటాడించి గొర్రెల మందల్ని తోలుకొచ్చి చివరికి వాటి బొచ్చుకూడా మిగలకుండా నొల్లి మింగేస్తోంది "

"అసాధ్యురాలే యింతకీ ఆవిడెవరు మహర్షీ?" అన్నాడు రాముడు కుతూహలంగా

"ఒక యక్షిణీ" చింతనిప్పుల్లా చిట




పటలాడేయి విశ్వామిత్రుడి కళ్ళు

"యక్షిణా? . వాళ్ళంత బలంవైనవాళ్ళ కారని విన్నానూ"

బలంవంటే కండబలంవేనటయ్యా? అధికారానికున్నపొగరు అది ఆ గద్దెమీద కూచుంటే చాలు యెక్కడలేని వికారాలూ పుట్టుకొస్తాయి రానురాను నీకూ బోధ పడుతుందిలే" మహర్షి పెదాలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి

"యక్షులు హిమాలయాల్లో వుంటా రంటారూ?" అన్నారన్నదమ్ములు

"అవును నిజంవే, యీవిడ పూర్వీకు లందరూ హిమాలయం వాళ్ళే . మన కోసం యిక్కడికికూడా దాపురించేరు తండ్రీ సుకేతుడనీ వాడికి చదవేస్తే వున్నమతిపోయింది జపాలూ తపాలూ చేసి యీ పిశాచప్పిండాన్ని కని మనమీద పారేశాడు . వయసొచ్చి వన్నెహెచ్చి నొగను పెరిగి వలపులు పొంగి పింగా రాలు రంగరించుకునే కూతుర్ని చూసి మురిసిపోయేడు."

"ఏ తండ్రి మురిసిపోడు మహర్షీ?" అమాయకంగా చూసేడు రాముడు

"అవునయ్యా కాకిపిల్ల కాకికి ముద్దని నాకూ తెలుసు . కాని అది రక్కడం మొదలెడితేనే అందరికీ యిబ్బంది. ."

"కాకేం రక్కుతుంది మహర్షీ?"

"కోటలో పెరిగిన గువ్వపిట్టలు ఆ రక్కుల మంట మీకేం తెలుస్తుందయ్యా మీకూ మీ వాళ్ళకీ తగిలిందాకా తెలీదు రక్కుల బాధ"

"ఏవింటి మహర్షీ?"

"గోళ్ళతోనే రక్కుతాయనుకోకు రామయ్యా ముక్కుతో పొడుస్తాయి

కావు కావుమని గగ్గోలపెట్టి నువ్వు మని షివే కావని నీచేతే ఒప్పిస్తాయి ఆ గోల కెంత బలంవో అబద్ధాని కెంత పెద్దనోరో గద్దెక్కిన తరవాత నువ్వే చూస్తావు" ఆప్యాయంగా వెన్ను చరిచేడు మహర్షి

''సాహసించి అడుగుతున్నాను నా అవివేకాన్ని మన్నించండి మహర్షీ" వినయంగా రెప్పలు వాల్చేడు రాముడు.

"అది అవివేకం కాదయ్యా కుతూహలం ఎదగడానికి ముందుమెట్టు నీకు యింకా యెన్నో చెప్పాలయ్యా నా సర్వస్వం నీకు ధారపొయ్యాలి నా జన్మ సార్థకం కావాలి "

పోటెత్తిన పాలకడలిలా పొంగుతోంది విశ్వామిత్రుడి వక్షం ఉప్పెనలా పుబికి పోతున్నాడు

"తాటక కథ మహర్షీ!" మెల్లిగా జ్ఞాపకం చేసేడు రాముడు

"అవునవును తాటక జపం వదిలి మరెందులోనో పడ్డాను వయసు మళ్లుతోంది బుద్ధి మందగిస్తోంది అందుకే మరీ నిన్ను వెంట బెట్టుకురావడం ఆఁ ఆఁ " నవ్వుకున్నాడు మహర్షి.

"ఆవిడ కథ " అందించే రన్నదమ్ములు

"సుకేతుడి కూతురని చెప్పేను కదూ వాడు పండితుడూ లోకాల పుట్టు పూర్వోత్తరాలూ దేశాలూ రాజులూ రాజకీయాలూ అన్నీ రంగరించి దానికి వస బోసేడు. దేశదేశాలూ తిప్పి చూపించి అరిటిపండులా అనుభవాన్ని చేతిలో వొలిచిపెట్టేడు వెదకి వెదకి సుందుడికిచ్చి ముడిపెట్టేడు వాడి అబ్బగారి సొమ్ములా యీసీమని కూతురికి అరణం ఇచ్చేడు "

"సుందుడంటే సుందోప సుందు లంటారు అందులో వాడేనా?"

"వాడే ఆ పొగరుమోతు ముక్కు మూసుకుని జపం చేసుకుంటున్న అగస్త్యుడి ముందు ప్రతాపం చూపించబోయి కుప్పి గెంతులేసేడు ఆయన కోపంతో కన్నెర్రజేస్తే రారుమని చచ్చూరు కున్నాడు "

"పాపం'' నొచ్చుకున్నాడు రాముడు

"అలాగే అనుకున్నాడు అగస్త్యుడు కూడా మొగుడు పోయేడని రెచ్చిపోయే తాటకిని ఓదార్చి, బుజ్జగించి, మన్యంలో అందరినీ పిలిపించి ఒప్పించి గద్దెక్కించేడు ఎక్కీ యెక్కగానే గాంధ్రు గాంధ్రుమని అతగాణ్ణే వెంట తగిలింది. కక్కలేక మింగలేక కోపం తెచ్చుకుంటే మొదటికే ముప్పొస్తుందని ఆ ధాటికి తట్టుకోలేక కృతఘ్నురాలా నామీదే తిరగబడతావుటే అని యేడ్చుకుని కచ్చ సద్దుకుని వింధ్యపర్వతం దాటిపోయి దక్షిణాపథంలో తలదాచుకున్నాడు అది చూసి యీ అడవి గూడెం అంతా యిందాక నీమీద జుమ్మని మూగేయి చూడూ అలా గుంపులు గుంపులుగా యింక లాభం లేదనుకుని ఆవిడ చుట్టూ కొలువుకి కుదిరి పోయేరు "

"తరవాతేమైంది మహర్షీ?''

"ఏంవవుతుందయ్యా నిలదీసి అడిగే వాడు లేక విచ్చుకత్తిలా రెచ్చిపోయి వీరవిహారం చేసింది తాడూ బొంగరం లేని దిక్కుమాలిన వాళ్ళ రక్తం తోడేసి డొక్కలు చీల్చి పేగులుతీసి గద్దెమీద

## జ్యోతి కథకార్టూన్ — గురి






దర్భాసనంలా వేసుకుని ధర్మపన్నాలు వల్లిస్తూ మరీ రాజ్యం చేస్తోంది.''

''అంతటిదేం చూడవలిసిందే '' అమ్ముల పొదిలో అంపకోలలు సవరించుకున్నా రన్నదమ్ములు.

''చూద్దురుగాని. అదిగో ఆకంతదాటి ఆపుంతమళ్ళితే అదే తాటకవనం మీ అయోధ్యకీ విదేహానికీ పొలిమేర . అదిగో ఆ గుట్ట చూడండి . .దాని మీదో బండరాయుందేం అదే ఆవిడ గద్దె . వృత్త పాషాణం అనుకునేరు. మణులూ మాణిక్యాలూ తాపినవేదిక .... దానిమీద చూడాలి మన్నె దొరసాని బిగువు."

"ఇన్ని అగడాలు జరుగుతుంటే . అన్నిశక్తులూ గుప్పిటలో వుంచుకుని . చూస్తూ వూరుకున్నారేం మహర్షి. " అన్నాడు రాముడు.

అమాయకంగా అడుగుతున్నారా గడుసుగా నిలదీస్తున్నారా? నా శక్తిని అనుమానిస్తున్నారా చిత్తశుద్ధిని శంకిస్తున్నారా? ఆలోచనలో పడ్డాడు మహర్షి.

"మౌనం వహించేరేం మహాత్మా . తొందరపడి మీ మనసు నొప్పించ లేదు గదా? మన్నించండి."

రాముడి చూపుల్లో వినయం తొణికిసలాడుతోంది.

"అహ! అదేంలేదయ్యా .." ఆ అన్నదమ్ముల కళ్ళల్లోకి గుచ్చి గుచ్చి చూసేడు మహర్షి.

స్ఫటికంలా నిర్మలంగా వున్నాయి. కపటం మచ్చుకేనా కనబడ్డంలేదు. తొలకరిస్తున్న వయసు, మలినం కాని మనసు కల్మషంలేని బుద్ధి వీళ్ళది. అనుకున్నాడు

ఈ పసివాళ్ళకి యీ ధర్మ సంకటం

యెలా విడమర్చి చెప్పడం. మథన పడుతున్నాడు

"ఏం మహర్షీ వూరుకున్నారూ'' దీనంగా చూసే రన్నదమ్ము లిద్దరూ

"ఆ కీర్తి మీకు దక్కాలి నాయనా" నవ్వుతూ చూసేడు విశ్వామిత్రుడు

"మాకా!'' తెల్లబోయి చూసేడు రాముడు

"చూడు రామయ్యా కుత్సితాలతో కుతంత్రాలతో, మాయలతో, మత్సరాలతో, స్వార్థంతో, స్తోత్రపాఠాలతో మీ ముందు తరం కుళ్ళిపోయింది పుస్తకాలు పిండి కొట్టి కొట్టి సిద్ధాంతాలూ, సూత్రాలూ వల్లించి వల్లించి లౌక్యం మరిగి కపటం నేర్చుకుని సారాన్ని గాలికి వదిలి పొల్లు పంచిపెడుతున్నారు బుద్ధిని పడుచుకుంటున్నారు మీకింకా మే బురదా అంటలేదు పదునెక్కుతోంది మీ బుద్ధి కాని రెండువేపులా కాదు అందుకే ముందుగా మేలుకున్నాను నా వూపిరి పోసి రాజేస్తున్నాను మీరు చాలా మెలకువగా వుండాలి రామా'' అన్నాడు విశ్వామిత్రుడు

"మాదాకా యెందుకు రానిచ్చేరు మహర్షీ?"

''కాలం రామా అది కూడా కలిసి రావాలి చూడు రామయ్యా నా లక్ష్యం రు లోక క్షేమం యీ దెయ్యాలవేట 'దు నా నిగ్రహం యీ రాక్షసులకోసం వ్యర్థం కాకూడదు అందుకోసమే రాజ్యానికి తిలోదకాలిచ్చి క్షాత్రాన్ని త్యజించి యీ దీక్ష పూనేను రేపో మాపో యీ సీమని యేలుకోవలసిన వాడివి యీ పుణ్యం నీ చేతిమీద జరగాలి అప్పుడే జనం నీ వెంటబడతారు నీకు మనసా పట్టం కడతారు" అన్నాడు విశ్వామిత్రుడు

"నేనా!" అన్నాడు రాముడు

"ఆఁ నువ్వే ఏం?"

"ఆడదానిమీద అమ్ము లేయమంటారా మహర్షీ" తల వాల్చుకున్నాడు రాముడు

"అదా నీబాధ? చూడు రామా క్రూరమైనా, అక్రూరమైనా, పాపమైనా, అపవాదకరమైనా ప్రజారక్షణకోసం యేం చేసినా తప్పుకాదయ్యా యీ సూక్ష్మం తరతరాల ధర్మం ఇది రాజనీతి శృతులుకూడా యిదే చెబుతున్నాయి లోకాల్ని మింగేస్తున్న మహమ్మారి ఇది వెనుకాడవలసిన అవసరం లేదు రామయ్యా"

''నా అవివేకాన్ని మన్నించండి మహాత్మా మా తండ్రిగారు మీరేం చెబితే అది చెయ్యమన్నారు నా మనసు కూడా అదే చెబుతోంది. మీ దయ నాకు దీవన నాకింకే అనుమానమూ లేదు చెప్పండి యేం చెయ్యమంటారో" చేతులు జోడించేడు రాముడు

"ఈ మూగ జీవాలకి యీ పిశాచం చెరవిడిపించు వాళ్ళకి భయంలేని బతుకు చూపించు అంతే '' అంటూ ఆవేశంలో రాముణ్ని కౌగలించుకుని'' నువ్వు నా అంతర్యామివి నా తపనా తపస్సూ అన్నీ నువ్వే నా శిక్షణలో నువ్వు పురుషోత్తముడివి కాబోతున్నావు రామా! రామచంద్రా నాయనా'' అని నుదుటి మీద మనసారా ముద్దుపెట్టుకున్నాడు

జ్యోతి

విశ్వామిత్రుడు.

ఉప్పొంగిపోతున్న తమ్ముడి వేపు ఓరగా చూసేడు రాముడు. భుజంమీద చెయ్యివేసి "మీ అభిమానం మహర్షీ కృతజ్ఞులం" వినయంగా వందనంగా వంగిపోయేడు

"ఎంత సూక్ష్మబుద్ధి రామా '' అని అన్నదమ్ము లిద్దర్నీ చెరో భుజంకిందా చేర్చుకుని దండకమండలాలు లక్ష్మణుడికి అందించేడు మహర్షి

"అపరాహ్నం దాటిపోతోంది మహర్షీ" అన్నాడు లక్ష్మణుడు చెయ్యడ్డం పెట్టుకుని పొద్దు చూస్తూ

"సమయం మించిపోతోందని చెబుతున్నావా బాబూ అవునవును పొద్దు కూకకముందే ఈ నరకం దాటిపోవాలి" లక్ష్మణుడి వీపు తట్టేడు విశ్వామిత్రుడు

దుమ్ము రేగుతోంది కిలుకు కిలుకు మంటూ చిరుగంటల మోత వినబడుతోంది

"గొర్రెలమంద మహర్షీ" అన్నాడు రాముడు తప్పుకుంటూ

"[illegible] కమ్మింది సరిగా చూడయ్యా" నవ్వేడు విశ్వామిత్రుడు

"మనుషుల్లాగున్నారు అవును మనుషులే" కళ్ళు చికిలించి చూసి "అయ్యో అయ్యో అదేంకర్మం అలా చేతులూ, కాళ్ళూ ఒకలాగే నేలమీద ఆని నడుస్తున్నారా పీళ్లు పాకుతున్నారా? గూనొచ్చినట్టు అలా ఒంగిపోయేరేవిటీ?"

"వెన్ను విరిగిపోయి. ధర్మం నాలుగు పాదాలా నడుస్తోంది రామచంద్రా చూడు వాళ్ళ చూపులూ వాలకాలూ నిర్భయంగా చూస్తున్నారా? కళ్ళొత్తి చూస్తున్నారా? చూడవయ్యా చూడు''

"ఇంత దైన్యం[illegible] ఎవరు మహర్షీ యీ దౌర్భాగ్యులు?"

"మహాజనులు ఆమహారాణీ ప్రజలు"

గుట్ట దగ్గరవుతోంది ఈదురుగాలి చెలరేగుతోంది రక్తం గక్కుకుంటోంది వాలు పొద్దు మబ్బు మసగాలేకుండానే రెప్పపాటులో జారిపడే గొంగళీలా చీకటి ముంచుకొస్తోంది ఊపిరాడక గాలి బిక్కచచ్చిపోయింది కీ కీ అంటూ తీతిక అరుచుకుంటూ యెగిరిపోయింది

"మహర్షీ!" మనసు కలుక్కుమని కలత బడ్డాడు రాముడు

"తాటక వనంలో అడుగుపెట్టేం రామచంద్రా! ఎవరూ చెయ్యలేని సాహసం చేస్తున్నాం" రాముడి భుజంతట్టి ముందుకు నడిచేడు మహర్షి

చిరతలూ సివంగులూ దారికడ్డుగ పచార్లు చేస్తున్నాయి తొర్రల్లోంచి మోరలు సాచినక్కలేడుస్తున్నాయి రాబందులు నెత్తిమీద గిరికీలు తిరుగుతున్నాయి

"అపశకునాలు మహర్షీ" అన్నారన్నదమ్ములు

"అన్నీ మీకు శుభాలే పదం పదండి ఈ వల్లకాడు దాటితే చాలు అదిగో అదే మన సిద్ధాశ్రమం అదే మ[illegible] లోకం. అక్కడ శుభాలు పండుతాయి అందాలు విరుస్తాయి ఆనందాలు కు[illegible] స్తాయి పదండయ్యా పదండి యిష్టే అడ్డగలవు మిమ్మల్ని" అంటూ ఆ[illegible] కుంటూ భుజాలమీద చేతులేసి అ[illegible]

దమ్ముల్ని ముందుకి తోసేడు మహర్షి

భగ్గు భగ్గుమని కొరివిలు యెదురొస్తు న్నాయి భౌ భౌ మంటూ గుంపులు గుంపులు జాగిలాలు తోకలాడిస్తూ ఒగర్చు కుంటూ ముందుకి దూకుత న్నాయి అప్పుడే గుచ్చితీపిన కొత్త పేగుల్లా వున్నాయి మెడలో యెర్ర పట్టీలు పగ్గాలతో యెవరో వెనక్కి లాగుతున్నారు

కన్నెత్తి చూసే రన్నదమ్ములు

నెలవంకలా నవ్వుతోంది జువ్వల్లా చూపులు రువ్వుతోంది వెన్నెల మడుగు లోంచి ముంచి తెచ్చినట్లుంది చీర పచ్చగా దబ్బపండులా మిసమిసలాడుతోంది

"ఈవిడేనా మహర్షి" అన్నాడు రాముడు వింతగాచూస్తూ

"ఆఁ ఈవిడే "

"యక్షిణీ అన్నారా పిశాచ న్నారా?"

"అలాఅని నూరిపోసేరా మీ మహ ర్షులూ?" యీసడింపుగా విశ్వామిత్రుడి వేపోమారు చూసి ఆ అన్నదమ్ములమీదకి చూపు మళ్ళించింది

తేరిపార చూసింది

కలువ మొగ్గల్లా కాటుకకళ్ళూ, నూ నూగు మీసాలూ, ఏపుగా పెరిగి మృగ రాజుల్లా మదగజాల్లానడుస్తున్నారు ముక్కూ మొహంతీరు చూసింది, చిక్కితే పాలు గారేలా వున్నారు

"సొగసులన్నీ మీరే పంచేసుకున్నారు రాజుల చిన్నవాళ్ళలా వున్నారు ఏదీ బాబూ యిలారండయ్యా ముద్దొస్తు న్నారూ " ఆప్యాయంగా అన్నదమ్ము లను చేరదీసుకోబోయింది తాటక.

దూరంగా జరిగిపోయేరు వాళ్ళు

"తప్పుకో " అన్నాడు విశ్వామిత్రుడు

"హుఁ జాతరలో జనాన్ని మెప్పించలేక పందెంలో ఓడిపోయి ఉడుక్కుని మాయాపన్నాగం పన్నేవా సన్నాసీ" పళ్ళుకొరికింది

"ఏం వాగేవ్?" రాజుకు పోయేరన్నదమ్ములు.

బెదిరి అడుగువెనక్కి తగ్గింది తాటక

"చూడండి బాబులూ నా మాట వినండి వాళ్ళపాటకి నేను గజ్జెకట్ట లేదని తగబట్టి అలగాజనాన్ని రెచ్చగొట్టి

మీ చదువులు మంటగలిపి యిలా మిమ్మల్ని వుసిగొలుపుతున్నాడీ జిత్తుల మారి చేతగాక మిమ్మల్ని పావులుగా వాడుకుంటున్నాడు చదువుల్లో ఆరితేరి లోకాన్ని ఉద్ధరించాలి మీరు యిలా చదువూ, సంధ్యామాని అల్లరి మూకలోచేరిపోతారా ఎవరికి నష్టం ఆలోచించండి నా మాట నమ్మండి నేనేం చేసినా మీకోసఁవే " అభిమానం ఒలకపోస్తూ మాటలు చెరుగుతోంది

"ఏం చదువులు నంగనాచీ నీదాసులు చెప్పే పారాలేనా నీసేవకులువాగే ధర్మసూత్రాలేనా? ఆ బడిలో చెప్పేది చదువులుకావు కువిద్య అసంగతి ఈ యువకులు యేనాడో పోల్చుకున్నారు యింక నీ పప్పులుడకవు నీఆట కట్టు దీంతో మనకేవిఁటి పదవయ్యారామయ్యా ముందుకి పద" విసురుగా ముందడుగు వేసేడు విశ్వామిత్రుడు

వెనక్కి తగ్గింది తాటక యీ పెలూ

## గురి




బల్లాలూ పట్టుకుని చుట్టూకాపలా కాస్తున్నా రాకాసిమూక సైగకోసం చూస్తున్నారు

అలసిపోయి డొక్కలెగరేస్తూ నాలికలు వేలాడించి అంగలారుస్తున్నాయి వేటకుక్కలు

"అన్ని కుక్కలెందుకు మహర్షీ!" అన్నారన్నదమ్ములు

''మనని వేటాడడానికి''

"అందుకు కుక్కల్నా పెంచడం?''

"ఆవిడ నాన్న పులిపిల్లల్ని పెంచేడు" అని ముందుకు నడవబోయి గోడ కట్టేసిన సైన్యాన్నిచూసి "అడ్డులే'' అని గర్జించేడు విశ్వామిత్రుడు

ఆ వూపులో ఆ కావలాదారుల్ని తోసుకుని ముందుకు పోబోయేడు తాటక వైపు చూసేరువాళ్ళు ఆగమని కనుసైగ చేసి "ఒరే పులీ బూచిగా పివంగి భైరవా కాలనాగూ చూస్తారేం రాఊ'' అంటూ పగ్గాలు వదిలిపెట్టింది.

గురకలుపెట్టి నిప్పులు చిమ్ముతూ ముక్కుల్లోంచి అగ్గిగుళ్ళు కురిపించి మహర్షిమీదికి ఉరికేయి జాగిలాలు అమాంతంగా తిరగదోసి కాళ్ళమీదా భుజాలమీదా కండలుకొరికి రక్కడం మొదలుపెట్టేయి

"మహర్షీ మహర్షీ!'' అంటూ కుక్కల్ని అదిలించి మహర్షిని లేవనెత్తేరు అన్నదమ్ములు

వాళ్ళ భుజాలమీద లేచినిలబడుతూ

"పోగాలం దాపురించినపుడు ఇలాంటి బుద్ధులే పుడతాయి యీ కుక్కల్ని చూసుకునేగా మిడిసిపాటు " రక్తం తుడుచుకుంటూ ఆగ్రహాన్ని అణచుకుంటున్నాడు విశ్వామిత్రుడు.

"మాకంటిముందే మీకీ అవమానం

జరిగింది మమ్మల్ని క్షమించండి మహాత్మా చెప్పండేం చెయ్యమంటారో చెప్పండి చెప్పండి'' వాపోతున్నాడు రాముడు

దూసుకొచ్చే అగ్గిపిడుగులా ముందుకి దూకింది తాటక ''ఏం చేస్తార్రా కుర్ర కుంకల్లారా! మీబాబులే నాజోలికొచ్చి మన్నుగొట్టుకు పోయేరు మీరనగా యెంత" మొలమీద చేతులేసుకొని వెకిలినవ్వులు వురుముతోంది

ఇనప చువ్వల్లా తలపాయలు నిక్కబొడిచేయి మిడిగుడ్లు తిరిగి కణకణలాడుతూ కళ్ళు చంద్రనిప్పులు చెరుగుతున్నాయి కోరలు పెరిగి పెదవులచివర పొడుచుకొస్తూ పులిగోళ్ళలా వంగుతున్నాయి పళ్ళసందుల్లో మనుషుల తలలు పటపట నలిగిపోతున్నాయి కారే పచ్చి రక్తం చేతి కపాలం కప్పెరలోనిండి తొణికి కారిపోతోంది

పిచ్చెత్తినట్టు చిందులు తొక్కుతోంది తాటక. నేల అదురుతోంది నింగి కుంగుతోంది

"ఏవిఁటీ అట్టహాసం మహర్షీ!'' కళవళ బడ్డాడు రాముడు విల్లందుకుంటూ

"మాయలమారి ఊసరవెల్లీ అదయ్యా దాని అసలురూపం చూసేవా గడియకోవేషం గంటకో పన్నాగం ఇంకా చూస్తావేం రామా!" అన్నాడు విశ్వామిత్రుడు.

వింటి బద్దవంచి కొనకి తాడు తగిలించి ఒక్కమారు బారసాచిలాగి బిగువు చూసేడు రాముడు టంగుటంగుమని అడవంతా గింగురుమంది గుండెల్లో పిడుగు పడ్డట్టు. గడగడలాడింది తాటక. ఒక్కమారు ఆలోచించి.

"ఒరే ఒరే హహహా! నన్నేం చేయగలర్రా " అంటూ మాయమైపోయింది

"ఏదీ ఏదీ" నలుదిక్కులూ చూస్తున్నారన్నదమ్ములు

చీకటి మూస్తోంది చల్లారిన బొగ్గులా పొద్దుమొహం మాడిపోయింది గాలి బిగుసుకు పోయింది. పెద్దకాలం మీద పడ్డట్టు పెద్దపెద్ద చెట్లన్నీ మొదళ్ళతో తెగి కూలిపోతున్నాయి కొండలమీంచి బండలు దొర్లుకొస్తున్నాయి రాళ్ళవాన కురుస్తోంది పొగలా దుమ్ముకమ్ముకొస్తోంది.

"గారడీమొదలయింది కాచుకోరామా" వెన్ను చరిచేడు విశ్వామిత్రమహర్షి

ఆగ్నేయ వాయవ్యాస్త్రాలు ప్రయోగించేడు రాముడు రాళ్ళూ, బండలూ నుగ్గు నుగ్గయిపోయేయి. మండి మండి మాకులన్నీ నుసారిపోయేయి చీకటి పరుగు లంకించుకుంది

వికృతంగా అరుస్తూ గాలిలో యీదుతోంది తాటక

''ఎవిఁటా అరుపులు మహర్షీ!'' అని ధనుస్సులు సంధించి దిక్కులుచూస్తూన్నారన్నదమ్ములు

"కపట భాషా నాటకం వినురామా విను ప్రజల క్షేమం కోసం ఆవిడనానా అగచాట్లూ పడుతోందట మంచి చేదామనుకుంటే మనం అడ్డుతగుల్తున్నాఁవట . మనం దుండగులం . మూగజీవాల నోళ్ళు కొట్టే తుంటరులం .. జనం బలంలేని

ఒంటరులం .యింకావిను . ఆకాశంలో ఆవిడ వాణి ప్రజాక్షేమం కోసం ఆవిడ ఆవేదన . వినువిను''

పొద్దుకూకుతోంది కూలబడ్డ కారు దున్నపోతుల్లా కొండలు నల్లబడుతున్నాయి

"మాటు మణిగిందా, మనతరం కాదు దీన్ని నిగ్రహించడం సమయం మించి పోతోందిరామా''హెచ్చరించేడు మహర్షి

"గాలితో కలిసిపోయి అల్లరిచేస్తోంది మహర్షీ!" అన్నాడు రాముడు విల్లు యెక్కుబెట్టి

"ఎదురుబడితే మాత్రం ఏం చేస్తావురా ."గండ భేరుండంలా బారలుసాచి మీద పడబోయింది తాటక

పడమరను కబళిస్తున్న హస్తాన్ని ఒక్క అర్ధచంద్ర బాణంతో తుంచిపారేశాడు రాముడు గదలాంటి కోలవేపి తూర్పు నందుకోబోయే చేతికీళ్ళసందులు విరగ్గొట్టేడు. పక్షవాతం పడ్డట్టు వాలిపోయి వేలాడుతోం దాచెయ్యి గిజగిజ తన్నుకొని బాంబ్రు బాంబ్రుమనిమీద పడబోయి బెదిరి మళ్ళీ మాయమైపోయింది దిక్కులు పగలగొడుతూ గగ్గోలు పెడుతోంది

''అదిగో అరుస్తోంది ఇదే అదను రామా శబ్దభేదిని ఆశ్రయించు బ్రహ్మాస్త్రాన్ని ఆవాహనచెయ్" విశ్వామిత్రుడికి కోపం రగుల్తోంది

ఉడుము చర్మంతొడుగు చేతికి తొడిగేడు రాముడు, విల్లుకి అమ్ముతొడిగి కాలు ముందుకుసాచి, నారి చెవిదాకాలాగి నిల్చున్నాడు

"ధర్మంలా నీవిల్లు ఒళ్ళు విరుచుకుంటోంది ..సరళత్వంలా నారి హుంకరిస్తోంది నీసంకల్పం తిరుగులేనిఅమ్ము ముందు తరంమీది మీ అమ్ము వమ్ము కాదు వెయ్ బాణం వెయ్"

అమ్ము రగుల్తోంది అగ్గిరవ్వలు చిమ్ముతోంది పొగరేగుతోంది. దెబ్బతిన్న బెబ్బులిలా బొబ్బలెడుతోంది తాటక

"అదిగోశబ్దం గురిచూడు యీ దెబ్బతో యీదేశానికి పట్టినపీడ వదలిపోవాలి యువతమీరు రేపటి నవత మీరు మీద్వారా ధర్మవిజయం జరగాలి" ఘోషించే వేదఋక్కులా పలవరిస్తున్నాడు విశ్వామిత్రుడు

"జయీభవ దిగ్విజయీభవ"

గుండెల్లో రక్తం కరుడుగడుతోంది. గంగిళ్ళొత్తుతుంది తాటక వెకిలి నవ్వు నవ్వుతోంది

పసిచూపు రాకాసిమీద పడింది
గురిచూస్తున్నాడు
రాముడు
గురిచూస్తున్నాడు.



# హీరో

హీరో విధిగా ఆరడుగుల ఎత్తు కండలు తిరిగిన దేహం మీద ఉంగరాల జుట్టుతో మరీ అందంగా వుంటాడట— అతని ఛాతీ ముప్పయ్యేనిమిది అంగుళాలకు తక్కువ వుండడానికి వీల్లేదు దివ్య మోహన విగ్రహము కలిగినవాడు అతను ఎప్పుడూ బ్రహ్మాండమైన పనులే చేస్తూంటాడు విధిగా ప్రేమించి కాసేపు విరహ వేదననుభవించి అందుకో బోలెడు వేదాంతం మాట్లాడి, చివరకు అమాంతంగా పెళ్ళాడ్డమో, లేక మరణించడమో చేసి మరీ గొప్పవాడైపోతాడు ఎప్పుడూ విలువైన దుస్తులే ధరించి ఏ పనీ లేకున్నా హుషారుగా జల్సాగా తిరగడం శ్రీవారి హాబీ సార్ సార్ ఆ హీరో గురించి నేను రాయలేను సార్! ఒట్టుసార్! గొప్పోళ్ళ గురించి గొప్పోళ్ళే గొప్పగొప్ప పుస్తకాలు రాయగలరు సార్! ఆ హీరో గురించి మీరు చదివి తరించదలుచుకుంటే ఏ లైబ్రరీ కెళ్ళినా బండ్ల కొద్ది పుస్తకాలు దొరుకుతాయ్ సార్! ఆ ఓపిక కూడా లేకుంటే ఏ సినిమా చూసినా సరిపోద్ది! .

నేను మాత్రం ఓ కథ చెప్పాలనుకుంటున్నాను అందులో హీరో ఎవరో తేల్చాల్సింది మీరే సార్!

కథ క్లోజప్‌లో చెప్పేముందు ఫ్లాష్ బాక్ కొంత చెప్పాలి

అదిగో! లాంగ్‌షాట్‌లో తాళ్ళతోపు. తాళ్ళతోపు వెనకాల కొండ. తాళ్ళతోపు ముందు డొక్కు గుడిసెల వరుస గూడెం ఆ గూడెంకు ఉత్తర దిక్కున నాలుగు ఫర్లాంగుల దూరంలో సున్నం కొట్టిన పెంకుటిండ్లు, వాటి మధ్యలో నిటారుగా నిలుచున్న రెండంతస్థుల మేడగల ఊరు

ఆ ఊరు తిండి వుండి పని లేనోళ్ళది. ఈ గూడెం పని ఉండి తిండి లేనోళ్ళది గూడెంలోని ఏ ఒక్కడి కడుపు సంవత్సరములో ఏ ఒక్క దినమూ నిండదు ఎవరి తలమీద వెంట్రుకలు నూనె రాసి నున్నగ దువ్వి వుండవు ఏ శరీరానికైనా నిండుగా కనీసం పాతది, చిరిగిపోయినది మాసినదైనా-గుడ్డుండదు వాళ్ళ గుడిసెలను ఎండకాలపు గాడుపుదుమారాలల్లో చూడాలె-రివ్వున గాలి దూసుకొచ్చి గుడి

అల్లం రాజయ్య

సెల జొచ్చిందంటె, ఇంటిమీది ఎండు గడ్డిని, జనుప చెత్తను తుంగను ఎత్తుక పోతె, వాళ్ళ బరిబద్ద ఎముకల్లాగా వాసపు కొయ్యలు మిగులుతయ్ ఇంతకూ ఆ గూడెం ఎక్కడిదనుకున్నారు? స్వతంత్ర భారతదేశములోనిదే! ఆ గూడెంలోని మనుషులు సెక్యులర్ రాజ్యంలోని షెడ్యూల్డు కాస్టోల్లు అచ్చ తెలుగులో 'మాదిగోళ్ళు'

గుడిసె గుడిసెకు ఎంతో దయానీయమైన చరిత్ర వుంటుంది? ఆ చరిత్ర దేశానికి కవసరం లేదు క్లోజప్‌లో ఏగుడిసెను పరిశీలించినా ఎంతో హృదయ విదారకమైన కథలు విన్పిస్తాయి ఎన్నో మూగ గుండెలు రోదిస్తూ కన్పిస్తాయి ఎంతో మంది రోతుకు పీక్కపోయిన కండ్లు వర్షిస్తాయి

వాళ్ళ ఏడుపు, ఆ దరిద్రం, ఆ పెంట కుప్పల బ్రతుకుల దయనీయ స్థితి, ఆ నోరులోని జీవాల మూగవేదన-ఆ అమాయకుల మీద జరిగే క్రూరమైన దోపిడి తరతరాల దగా క్లోజప్‌లో చూడాలంటే చాలా చాలా ధైర్యముండాలి



ప్రస్తుతానికి ఆ గూడెంలో ఓ గుడిసె — ఆ గుడిసె ముంగట ఓ ఎముకల గూడు లాంటి మనిషి పాత చెప్పుతెగిన వుంగటాన్ని పండ్ల సందులో ఇరికిచ్చుకొని సర్వశక్తులూ కేంద్రీకరించి గుంజుతున్నడు అతని ముందు తోలు ముక్కలు, పగిలిన కుండ, అందులో మురుగు వాసనవేసే నీళ్ళు. ఇనుప సువ్వ, ఇనుపగూటం, మోటుకత్తి. నాలుగైదు ఈతకమ్మ లున్నయ్. అతని పీక్కపోయిన ముఖం

మీసాలు, గడ్డం కలిసిపోయి వికృతంగా ఉంది అతనికి కొంచెం దూరంలో గుడిసె సూరు కింద ఇంకో ఎముకల గూడు, ముందట మట్టి ముద్దలాంటి పిల్ల పాలు చీకుతున్నది ఆవిడ తల మాసిరేగి వుంది రేగిన తలను ఎడమచేత్తో పండ్లు బిగబట్టి గోక్కుంటున్నది

గుడిసెకు ఇరవై గజాల దూరంలో మూడడుగుల పిలగాడు దడికొయ్యల పండ్లతో కొరుకుతూ-రెండు దడికొయ్య లను రెండు చేతులతో పట్టుకొని తల రెండింటి మధ్య ఇరికించి రెండు ఎము కల గూళ్ళవేపు నిర్లక్ష్యంగా చూస్తు న్నడు ఎవరో రేగడిమట్టి బొమ్మను దడికొయ్యల్లో ఇరికిచ్చినట్లుగా ఉన్నడు ఆ పిలగాడి అవయవాలను దేనికది గుర్తించడం కష్టం అసలు అవి ఏయే అవయవాలు అన్నది నిర్ణయించడం సులువుకాదు ఓ పెద్ద సైజు వంకాయను కుందామా నున్నగలేదు ఆ పిలగాడి ఒంటిమీద గోచిగుడ్డ తప్ప మరేదిలేదు గోచిగుడ్డ ఎప్పటిదో ఏరంగుదో? పిల గాడికి కూడ తెలియదు. పిలగాడికి బోడి గుండు లాంటి తలమీద జుట్టున్నది, తాటి కాయకు వెంట్రుక లతికిచ్చినట్టుగ

సమయము అంబటాల్లదాటిపోయింది సూర్యుడు ముఖం చిట్లిస్తున్నాడు పాలే రోల్లు, కయికిలోల్లు, అంబలి గంజి త్రాగేసి మూతులు, చేతులు నాకేసి పను లల్ల కురుకుతున్నరు అంబలి గంజి లేనోల్లు, నీల్లుదాగి నిట్టాడులకొరిగి సొమ్మసిలి కూకునోల్లు ఎవరో తరుము తున్నట్టుగ పనులమీది కురుకుతున్నరు ముసలోల్లు, ముతకోల్లు తంగెడు చర్మము కోసం తంగెడు పుల్లలను కోలలతోటి బాదుతున్నరు గునుసుకుంటూ-మూలుగు కుంటూ - ఎవడో పెద్దమ్మ గుడికాడ కుక్కోలె ఏడుస్తున్నడు-ఇంకెవడో గుడి సెలో బూతులు తిడుతున్నడు-ఏదో గుడి సెలో పసిగుడ్డు గూడెం పేలిపోయేటట్టు, లేత పేగులు తెగిపోయేటట్టు ఏడుస్తున్నది తాడి చెట్టుమీద రాబందొకటి ఆశగా చూస్తోంది

"ఓర్రాయపోశ - నీబొంద మురుగ రావేంరా? పొద్దెక్కుతంది బర్లకాడికి పోవ్ర?" ఆడ ఎముకల గూడు దడికాడి పిలగాన్నుద్దేశించి అరిచి "దిగలేవే పోరీ! పీక్కతింటన్నవ్—పొద్దెక్కుతంది — తోటోల్లం తెల్లిపోతంద్రు-" సంటిదాని వీపుమీద చరిచింది

సంటిది చావుకేక పెట్టింది

"లం కొడుక ఏం దింటవుర-ఓరి బద్మాషీలమ్డికొడుకా! రావురా' నీయవ్వ నేనాడిదాక తె రెండుగాల్లందుకొని బండ క్కొడుత-" పాతసెప్పు కిందేసి పిల గాడ్ని హెచ్చరించిండు ఇంకో ఎముకల గూడు

ఆ దడికాడి పిలగాడి పేరు రాయ పోశాలు అందరు పిలిచేది రాయపోశడు కాస్త బెదురుగా మాపిండు

"నీ యవ్వ నేన్ పోనుపో—బర్లు మడుగులబంటె-లేగలు సేన్లల్లకు సెంగ లిత్తయ్ లేగలెంటబడి సేనురుకుతె-బర్లు లేపి మక్కల జొత్తయి - అయ్యోనిమిది ఇయ్యోనిమిది నిన్న ఆనోల్లే (బూతు మాటసార్-) నా ఎన్నంత కమిలేటట్టు




గొట్టింది తెల్జోన్న కర్రచీకి-నీయవ్వ నేను పోనుపో! నా కెరికలేదుపో___" కాళ్లు తపతప నేలకేసి కొట్టింది అటు యిటూ రాగం తీసుకుంటూ ఎగిరింది

"షోకేం జేత్తవురా! ఏమన్నాలె మరో? మందిపోరగండ్లంత ఇరుసలు మూడు గుంచాలు తెచ్చుకుంటే పదేండ్లు ముడ్డికింద బెట్టుకొని నాగురాలు సేత్తన్నవ్ ఇంగ యీడితో నా సాతగాదు ఇనవయ్య కొడుకు బాగోతం" అని ఆడ మనిషి సదరు రాయపోశని మాతృమూర్తి నిక్కచ్చిగా చెప్పింది

''గదేందిరో? ముగ్గురి రెక్కలాడితెనె మంతల కత్తలేదు ఇగ నువ్వు గిట్లనిత్తెం కిర్‌కాట్కం బెడ్తె బంచత్-ఇగెట్లరా?-నీయవ్వ! కొడుకా! కావుర మచ్చిందారా నీకు-ఎట్ల బోవో సూత్త" దడిపొరుక నూడ టీక్కాని సదరు రాయపోశని అయ్య రాయపోశని మీది కురికింది

రాయపోశడు వచ్చే ప్రమాదాన్ని గ్రహించి పరుగందుకున్నడు ఎముకల గూడు కొంతదూరం ఉరికి ఎగపోసింది

గుడ్లు తేలేసి గుండెలు రాసుకొని ఓపిక వచ్చిన తర్వాత కొడుకును తెలంగాణా భాషలో చాలాసేపు తిట్టి "ఎక్కన్నన్న బోంద్రని" దడిపొరకను ఇసిరి వేసి పొలాల గట్లమీదినుంచి పనిమీదికి వెళ్లిపోయింది

రాయపోశడు తండ్రినుంచి తన్నులు తప్పించుకుని ఫర్లాంగు దూరంలోవున్న ముసలి జువ్విసెట్టు మానికెక్కిండు పర్మనెంటు రక్షణకోసం. వాడికడుపులో ఆకలి కరకర లాడ్తోంది. . వీపులో నిన్నటి

దెబ్బల బాపతు జొన్నకఱ్ఱ వాతలుమండు తున్నయ్ వీపు తడుముకున్నడు వాతలు లూకినయ్—తొడలు చూసుకున్నడు— కండ్లల్ల గుబగుబ నీళ్ళూరినయ్—"దొంగ లంజకొడుకు పటేలోడు క మ ల దు న్న పోతుకంటె కటికోడు—విలవిల కొట్టు కున్న ఇడవలేదు—ఆనవ్వ—'' మను సులో తిట్టుకున్నడు

'అయ్యాంగడి, కొడుకీ అంగడి, తల్లేడుబర్లు దొంగయేనాయె—పోరన్ని బుదురకిచ్చి తోల్తడా? బరిగందు కొని గెదిమె—ఆ పటేలోనికేం బుట్టిందో? సన్గటి పోరడని గుడుక సూడకుంట ఏడ వర్తె ఆడగొట్టె—ఆటకోయిలపోరగండ్లు యాడ పెయిమరిపి కూకున్నరో? అని సేతులకు జెట్టలు, నరుప్పలు బుట్టలావు చెల్లించు కుంటాండు సెడి సెల్లిచ్చు కునోళ్ళంత సెర్లకేపోతరు—అతిలావు దుట్టుతనము సేసినోడు అగ్గిల్నే కాల్తడు. పోరన్ని అరుమనుకల (18కిలోల)జొండ్ల కుంచుకుని నాలుగు లేగబొక్కలని ఆటి తోటట్టుగ ఎనిమిది బర్లగొట్టవట్టె—కాలు సెయ్యి ముదురని పోరనికి కయిలిముచ్చు బర్లు ఏడాగుతయి అయిగుడుక పటేలో నోలె బాగా బలిసున్నయ్ ఏడబోయిందో గద—' బిడ్డను వాకిట్లో కుదేసి 'ఓరి రాయపోశో? ' అని ఓలలెత్తి పిలుసు కుంటూ జువ్విచెట్టుకెల్లి నడిచింది రాయ పోశని తల్లి

జువ్విచెట్టుమీద భయంతోటి, దుఃఖం తోటి, నిన్నటి దెబ్బల తాలూకూ నొప్పి కొటి, ఆకలితోటి మొండికేసి కూర్చొన్న తోడుకును చూచింది

'పోశవ్వ దిగిరారా! బాంచెన్—నీ కాల్మొక్త—రారా! అంబలిదాగి పోదువు రారా!' జువ్వికింద నిలుసుండి బ్రతిమి లాడింది

'నీయవ్వ నేనురాను పో' " కాస్త మనసు అంబలికోసం మెత్తబడ్డది దిగిన తరువాత కొడుతదేమోనని లోపలభయం పీకుతంది

'రారా! నన్నదిరిచ్చుకోకు, కయిక లోల్లంత పోయింద్రు—ఎనుకయిపోతే పటేల్ చెప్పందుకుంటడు మా నాయన కాదు రారా—" అన్నది తల్లి

కొడుకు కాసేపు మౌనంగా ఉండి 'నేనుబోత పోయే?' అన్నడు చిట్టచివరకు

'ఇగో సెల్లెగ్గింతంబలి దాగిచ్చి మంచా లేయ్. నేను జొన్నకోతకు బోతన్న— బాంచెన్ జరపెయిల భయముంచుకొని బర్లకాడ కూసుండు ఆటకోయిల పోర గండ్లతోటి పిర్రగోనెలాడు కుంట పెయి మర్చిన సాట్టలు జెయ్యకు—"అని బుద్దులు చెప్పి జువ్విచెట్టు క్రిందినుంచి నల్లరేగడి చేనల్లోకి బిరబిర నడిచింది

రాయపోశడు చెట్టుదిగి గుడిసెలకొ చ్చిండు .చెల్లె వాకిట్లో గుక్కపట్టి ఏడు స్తోంది చిప్పల అంబలి పోసుకొచ్చి చెల్లెకింత తాగిచ్చి తనింతదాగిండు ఎడమ చేత మూతి తుడుచుకుని మూలకున్న కఱ్ఱ తీసుకొని వీధిలకు నడిచిండు

గుబగుబమనే గుండెలతోటి పటే లింటికి బోయిండు అటూ ఇటూ తొంగి చూచిండు అరుగుమీద బట్టకుర్చీ ఖాళీ గుండటంచూపి పటేల్ 'కోతల కాడికి పోయిండుగావచ్చు'నని తనకు తనేధైర్యం








చెప్పుకుని అడుగులో అడుగేసుకుంట సడీ సప్పుడు కాకుండ బర్లనిడుసుకుని, లేగల పొది తడుకతీసి లేగలను, బర్లను కొట్టు కొని వాగులకు పోయిండు

నాలుగు ఒట్టెలు తుంగను బరుకు బరుకున పీక్కతింటున్నయ్ నాలుగు బర్లు మడుగు నీల్లల్లో సామూహిక జలక్రీడలోని ఆనందాన్ననుభవిస్తున్నయ్ మొపలు తీసుకుంటూ—తోకలతోటి నీల్లమీద తపతప కొడుతున్నయ్ మేస్తున్న బర్లు ఓరగంట మడుగులోని నీల్లను చూసికూడ జలక్రీడను విరమించుకొని మేస్తున్నయ్ లేగలు తుంగలో గరిక పోశలను ఏరుక తింటున్నయ్

రాయపోశడు బర్రెంక చెట్టు మొదట్లో కూర్చుండి కాసేపు పాతుపాటలు పాడుకున్నడు అడివి అంచుల తీతువపిట్ట శృతి కలిపింది వాగు అవతలి ఒడ్డుమీదనుండి పాలకొడిసె పూల వాసన మత్తుగా వీస్తోంది తీగదారు పొదలు విరిగబూచి తలలూస్తున్నయ్ మోదుగు పూలు పిల్లగాలికి పడిపడి నవ్వుతున్నాయ్ మడుగుల మీదినుంచి గాలి సల్లగా వీస్తుంటే బర్రెంక చెట్టు నీడన రాయపోశడు నేల మీది కొరిగిండు లేగలు చెట్టు నీడకు చేరి ఒకటినొకటి నాక్కుంటున్నయ్

అట్లా అంటుకున్న రాయపోశని కండ్లు మాపటెండ సురుక్కు మనేటాల్లకు విడిపోయినయ్

కండ్లు తెరిచిన రాయపోశడు 'ఇప్పుడే తెల్లారిందని' కాసేపు వాపోయిండు పడమటిదిక్కు పొద్దును చూచి గాబరాపడ్డడు మూసుకపోతున్న కండ్లను తెరిపించి మడుగుకెల్లి చూచెటాల్లకు గుండె గుబేలు

మంది బర్లులేవు - లేగలు లేవు-దక్షిణపు పొద్దును దీనంగా చూపింది

'నీ యవ్వగిప్పుడు తెల్లారలే—మాప టేల్లయ్యింది బర్లేడ నచ్చినయ్' అను కొంటుంటే ఆదుర్దాతోటి, భయంతోటి కాళ్ళు గజగజ వనికినయ్

బర్రెంక చెట్టు మీది కెక్కి సుట్టూ చూచిండు దూరంగా బర్లు లేగలు నల్ల రేగడి చేండ్లో మేస్తున్నయ్ - కయికిలో ల్లంత బారులుగా చేను కోస్తున్నరు చేన్లో జొన్న మెదలమధ్య పటేల్ నిలుసున్నడు

గిదగిద చేను దగ్గరికి ఉరికి వచ్చేసరికి కోపిన జొన్న చేను మెదలల్లో పటేల్ 'యమధర్మరాజు వేషంలో ఉన్న చింది మాదిగి చంద్రనోరె' నిలుచున్నడు చేతులో జొన్నకర్ర ఆడిస్తున్నడు

పటేల్‌కు కొంచెం దూరంలో కొడు వళ్ళు భుజాలమీదేసుకొని ఇండ్లకు మర్లే ప్రయత్నంలో కూలోల్లంత గుడ్డలు, ముంతలు సదురుకుంటున్నారు

పటేల్ రాయపోశని చూడగానే క్లోజ ప్‌లో క్రూరమైన ముఖంతోటి 'దొంగ లమ్డికొడుక-బర్ల మేపుమని ఆరుమనకలి త్తె రొజు ఇడిపిపెడ్తన్నవ్ — తూమెడుకు దిన్నయ్ — నీ యవ్వమిండెడి త్తడా బంచత్—' చేతులున్న కర్రతోటి రాయ పోశని మీది కురికిండు జొన్నకర్ర రాయ పోశనిమీద దద్దులు లేపుతోంది

'నీ కాల్ మొక్కుత పటేలా — నీ బాంచెన్ పటేలా! నన్ను కొట్టకుండ్రి' రాయపోశడు నల్లరేగడి గరుకు పెల్లల్లో విలవిల తన్నుకుంటూ కోటిదండాలుపెట్టు కుంటూ దీనాతిదీనంగా ఏడుస్తూ వేడు కున్నడు

ఆ దారుణాన్ని, బలిసిన కండలుగల పటేల్ మొరటుచేతుల బలాన్ని భరించలేక మూడడుగుల ఎముకలు తేలిన రాయ పోశడు విలవిల తన్నుకుంటుంటే అంత మంది కూలోల్లు చూచుకుంటూ నిలబడ్డరు. ఒక్కల పెదిమలు విచ్చుకోలే—ఒక్క గుండె కోపంతోటి మండిపడలేదు పసి పోరన్ని, పదేండ్లపోరన్ని ఏ ఒక్కచేయి ఆదుకోలే—ఒక్క కొడువలి ఎదురు తిరు గలే—అరవై మంది తల్లుల్లో రాయపోశని తల్లి వున్నది అదికూడ 'ఇది అన్యాయెం పటేలా పోరన్ని కొట్టద్దు పటేలా—' అనలే—

పటేల్ చేతుల్లని సత్తువకు అలసట కలుగలేదు కోపంతోటి కొరికే పండ్లు ఆపలేదు దెబ్బమీది దెబ్బ కొడతూనే వున్నాడు

నల్లరేగడి పెల్లల్ల బొర్లుతున్న రాయ పోశడు తాడుతెగిన గానం బద్దోలె పివ్వున లేసిండు కట్టెపుల్లల్లాంటి చేతుల్లో నెత్తురు జిలజిల ప్రాకింది బిగుసుకున్న సేతులతో ఓ మట్టి పెల్ల పైకి లేపింది కట్టెపుల్లల్లాంటి కుడిచేయి సుడికత్తోలె ఊగింది గురి చూసిండు పటేల్ తల పటేల్‌మంది

"అన్న సంపుతివిర " అని పటేల్ దంటు (జొన్నకర్ర) పారేసిండు

తరతరాలుగా ఎన్నో తలలను తాకట్టు పెట్టుకున్న పెద్దతల-ఎన్నో కొంపలు నిలు వున కూల్చిన తల, ఎంతమందియో చీరలు చింపేసిన తల ఎంతమందియో భూములు గుంజుకున్న తల-మేడలు మిద్దెలు కట్టిన

తల—ఎన్నో తలలను నిర్దాక్షిణ్యంగా తీయించిన తల—మరెన్నో తలల బ్రద్దలు కొట్టిన తల—గండుమీసాలు, ఎర్రెకండ్ల పెద్ద తల—పదేండ్ల మాదిగి రాయపోశని కట్టెపుల్లల్లాంటి చేయివిసిరిన మట్టిపెల్లకు పగిలింది

కొడండ్లు భుజానేసుకొని ఎకరాలకెకరాల చేనుగోసిన కూలోల్లంత ఆ పిలగాడి తెగింపుకు విస్తుపోయిండ్రు

ఎడమచేత తలతాకి చూసుకున్న పటేల్‌కు ఎర్రటి నెత్తురు కనిపించేసరికి ఎర్రెకండ్లు బగ్గుమన్నయ్

'ఏడీ-ఆ లంజకొడుకేడీ-వానవ్వను (బూతుమాటసార్)' అని రెండవసారి విజృంభించుదామనుకునేసరికి — వాడు పదేండ్ల రాయపోశడు లేడిపిల్లవోలె, పంజరం కొరికేసిన చిలుకోలె—అస్తమిస్తున్న సూర్యుని ఎర్రటి కిరణాలను సవాలు చేస్తూ—నల్లరేగడి దుమ్ము రేపుకుంటూ పరుగెత్తుతున్నడు ఎవరికీ అందకుండ

'ఒరేయ్ — పటేలోడా! బగ్గ బలిసినోడా! ఇగరారా!' అని బూతులు తిట్టుకుంటూ పరుగెత్తుతోంది వీరత్వం కూలోల్లకు పరుగెత్తుతున్న రాయపోశడు పడమటి కొండలాగా కన్పించిండు

అట్లా పరుగెత్తిన రాయపోశడు అందరిలాగా చేతులు కట్టుకొని గజగజ వణుకుతూ పటేల్ ఇంటి ముంగటికి పోలేదు అట్లా తాళ్ళతోపు ముంగట కనిపించే గూడెంకు గాని, ఊళ్ళెగ్గాని పోలేదు

వాడు ఎముకలగూల్ల అయ్యఅవ్వలకు మళ్ళా కనిపించలేదు

ఏ బస్సులో ముల్లెలు మోస్తున్నడో? ఏ హోటల్లో ఎంగిలి కప్పులు కడుగుతున్నడో? ఏ సారా కొట్టు ముంగట కూరుకుతున్నడో? ఏ రిక్షాను లాగలేక లాగుతున్నడో? ఏ వర్కు షాపులో మోటార్లు తుడుస్తున్నడో? ఏ లంజెల కంపనీ ముంగట కావలున్నడో? ఏ రైల్లో జేబులు కత్తిరిస్తున్నడో?

కాని సార్! సార్ ! నా మూడడుగుల బక్కచిక్కిన హీరో అలాంటి పనులెప్పుడు చేయడని గట్టిగా నొక్కి చెప్పగలను సార్—హీరోలెప్పుడు చిన్నచిన్న పనులు చేయరంటే చేయరుగాక చేయరు

నా హీరో ఈ దగాకోరు సమాజంతో రాజీపడి తుచ్ఛమైన, నీచమైన బ్రతుకు బ్రతకడు సార్! ఏ అడివి కడుపులోనో అలసటలేని పోరాటాన్ని, ఎంతో ఉన్నతమైన ఆశయాన్ని భుజానేసుకొని తిరుగుతుంటాడు సార్!

రేపటి అందరి వెలుగుకోసం తన జీవితాన్ని చీకట్లచాటున గడిపేస్తూ అదనుకోసం ఎదురుచూస్తూ, దొరికిన అదనును సక్రమంగా వినియోగించుకొంటూ గడిపే రాయపోశడు నా హీరో సార్



# మ ధు ర స్మృ తి

మౌనాన్ని భుజాన మోసుకుంటూ
ఒంటరితనం తోడుగా
తలవంచుకుని నడుస్తున్నాను
గమ్యంలేని బాటవెంట
అనంతంగా అవిఘ్నంగా
నడుస్తూనే వున్నాను.
నా హృదిలో నా జ్ఞాపకాల గదిలో
ఎన్నెన్నో స్మృతులు! శృతులు!!
ఆనంద పదధ్వనులు! హాలాహల విన్యాసాలు!
మారణ హోమాలు! మహాత్ముల రక్తధారలు!
కథలు! కన్నీళ్ళు! వేదనలు! వీరావేశాలు!
వేషాలు! రోషాలు! విషాగ్నులు!
ఎన్నెన్నో గతం తాలూకు నిజాలు!
మానవచరిత్ర తాలూకు నీడలు!!
అయినా
నడుస్తూనే వున్నాను
మంచిరోజుమీద మంచి మనగలిగే గడియమీద
ఆశతో నడుస్తూనే వున్నాను
నీరసంగానే అయినా నడుస్తూనే వున్నాను....
ఇన్నాళ్ళకి ఇన్నేళ్ళకి
నా వీపు తట్టిందో స్నేహ హస్తం
"ఏమోయ్ ఏమోయ్ నేస్తం
కాస్త మెల్లగా నడువోయ్ దోస్తూ
నీ వెంట నీ వెనుక మేమూ వస్తాం"
ఒక్కసారి వెనుదిరిగాను—
ఒక్కటికాదు వందకాదు
వేనవేల గుండెల్లో గొంతుల్లో
మార్మోగుతోంది ఆనంద బృందగానం!
ఆ వెంట సాగుతోంది

వింశతి విజయ పతాకల రథం
సామ్యవాద పథంలో!
నా
తనువు పులకరించింది
మనసు పరవశించింది
"నా గుండెల్లో నా కండ్లల్లో
ఈ స్వప్నం ఈ స్వర్గం
పదిలంగా దాచుకుంటాను
పదికాలాలపాటు మురిసిపోతాను"
ఆనందబాష్పాలు తుడుచుకుంటూ
తమస్సు విడిన మనస్సుతో
ఉషస్సు జిమ్మిన ఆశల్తో
సరదాగానే సంతోషంగానే నడుస్తున్నాను
ఇంతకీ చెప్పలేదు కదూ?
కళ్ళాలులేని గుర్రాన్ని నేను
కాలం నా నామధేయం
మానవాభ్యుదయమే నా ధ్యేయం!

—సింహప్రసాద్

[వంశీ ఎ మెచ్యూర్ అవార్డ్స్ 1976 పోటీలో తృతీయ ఉత్తమ కవితగా ఎన్నిక కాబడింది.]

---



# తప్పు

శీలంశెట్టి రమాదేవి

సావిత్రి తప్పు చేసింది.

సావిత్రి తప్పు చేసింది.

సావిత్రి తప్పు చేసింది.

శరీరం ఉడికిపోతోంది. రక్తం కాగిపోతోంది. ఉద్రేకంతో అశాంతిగా కుర్చీలో అటూ ఇటూ కదిలాడు బాలకృష్ణ. అతని కళ్ళముందు ఆఫీస్ ఫైళ్ళు కనిపించటం లేదు. సావిత్రి డయిరీలోని పేజీలు కనబడుతున్నాయ్.

'తప్పు చేశాను' అని సావిత్రి పదేళ్ళ క్రితం రాసుకొన్న అక్షరాలు కనిపిస్తున్నాయ్

ఎంత ఘోరం? ఎంత అవమానం?

ఇలాంటి సావిత్రినా తను ప్రాణం కన్న మిన్నగా చూసుకొంటోంది. ఇలాంటి అపవిత్రురాలినా తన సరసన జీవితం గడపడానికెన్నుకుంది?

"సార్ " ప్యూన్ పిలుపుతో ఆలోచనల్లోంచి వెలుపలి కొచ్చాడు బాలకృష్ణ

"ఏమిటి?"

"ఆఫీసరుగారు పిలుస్తున్నారు .."

లేచి లోపలికి నడిచాడతను.

"ఆ ఫైలు రడీ చేశావా?"

కొద్దిగా తడబడ్డాడు బాలకృష్ణ.

" ఇంకా పూర్తి కాలేదండీ "

అబద్ధమాడేశాడు. అసలు ఆ ఫైలు వంక చూడనేలేదు.

"త్వరగాకానీ ఇవాళే పూర్తవాలి."

"అలాగేనండీ "

సీట్లో కూర్చుని అతికష్టం మీద దృష్టి కేంద్రీకరించి ఫైలు తెరిచాడు. పూర్తయేసరికి సాయంత్రం అయిదయిపోయింది. త్వరత్వరగా ఆఫీసర్ ముందా ఫైలుంచి. ఆయన సంతకం చేయించి డిశ్పాచ్‌లో పడేశాడు. అప్పటికే మిగతా గుమాస్తా లంతా వెళ్ళిపోయారు. తనొక్కడే రోడ్డు మీదకొచ్చాడు బాలకృష్ణ. అంతవరకూ అతను బలవంతంగా దూరంగా నెట్టిన ఆలోచనలన్నీ ఒక్కుమ్మడిగా అతన్ని ఆవహించినయ్.

సావిత్రి తప్పు చేసింది.

ఇప్పుడేమిటి చేయడం?

సావిత్రికేం శిక్ష విధించాలి?

ఆమెను వదిలేయడమా? వదిలేస్తే పిల్లల సంగతేమిటి? ఇద్దరు పిల్లల్నీ వదిలి తనుండగలడా? ఏం? ఎందుకుండలేడు? వాళ్ళు తనకు పుట్టారో లేక ..అవును— ఒకసారి తప్పు చేసింది మరోసారి చేయలేదని నమ్మకం ఏమిటి?

ఎంచేతో ఆలోచన నచ్చలేదు బాలకృష్ణకి. సావిత్రి డయిరీలో వివరంగా

రాసివుంది. తను తప్పుచేసిన విషయం చేసిన తప్పుకు పశ్చాత్తాపపడుతున్న విషయం — మరోసారి చేయగూడదని తీసుకొన్న నిర్ణయం అన్నీ చదివాడతను నిజంగానే సావిత్రి తన దగ్గరకొచ్చాక తనని మోసగించలేదు మనస్ఫూర్తిగా తననే భర్తగా అంగీకరించింది ఇవన్నీ తన అంతరాత్మకు తెలుసు అసలు సావిత్రి లాంటి స్త్రీకి మోసం చేయడం కూడా రాదు

ఏదేమయినా తప్పు తప్పే!

ఈ విషయంలో తను రాజీ పడలేడు ఆమెకూ తనకూ ఇకముందు ఎలాంటి సంబంధమూ ఉండదు ఇది తననిర్ణయం కాని ఆమెనంత తేలిగ్గా ఎలాంటి దండన లేకుండా వదిలేయడమే తనకు నచ్చడం లేదు అలా అని ఆమె గొంతు పిసికి చంపడానికి కూడా తనకు మనసొప్పటం లేదు తను మరీ అంత క్రూరస్వభావుడు కాదు ఇంటి దగ్గర కొచ్చేశాడు బాల కృష్ణ

తలుపు తాళం తీసి లోపలికడుగు పెట్టాడు ఇంట్లో సావిత్రి లేకపోయినా వున్నట్లే అనిపిస్తోంది.

ఇటువంటి సమయంలో సావిత్రి పుట్టింటి దగ్గరుండడం మంచిదయింది ఎదురుగ్గా ఉన్నట్లయితే ఆవేశంలో తనేం చేసేవాడో తనకే తెలీదు

పడగ్గదిలో స్టాండ్ మీద సావిత్రి చీర వెళ్ళాడుతూ కనిపించింది. తనకు ఎంత గానో నచ్చిన చీర అది ఆ చీర సావిత్రి కట్టుకు తీరాలని, ఎంత ఖర్చయినా వెను దీయక కొన్నాడది అది చూసి సావిత్రి



ఎంత మురిసిపోయిందని? ఆ చీర తీసి ఓ మూలకు విసిరికొట్టాడు బాలకృష్ణ.

ఇంట్లో ఎక్కువసేపు వుండబుద్ధి కాలే దతనికి. స్నానం ముగించి, బట్టలేసుకుని రోడ్డుమీద కొచ్చాడు

ఎక్కడికి కెళ్ళాలో తెలీలేదు

మనసు బాగోనప్పుడు ఈశ్వర్రావ్ మంచి కాలక్షేపం ఈశ్వర్రావ్ ఇంటికి చేరుకొన్నాడు బాలకృష్ణ

ఈశ్వర్రావ్ డాబామీద కూర్చుని వాళ్లావిడతో కారమ్స్ ఆడుతున్నాడు

"ఏమిట్రా, మొఖం తెలుగు సిని మాలా జిడ్డుగావుంది?" అనడిగాడు బాల కృష్ణని చూసి నవ్వుతూ

అతని భార్య లేచి వెళ్ళిపోబోయింది

"మాకు కొంచెం కాఫీ పంపించు రాజ్యం" అన్నాడు ఈశ్వర్రావ్

బాలకృష్ణ ఈశ్వర్రావ్ కెదురుగ్గా కుర్చీలో కూర్చున్నాడు

"ఈమధ్య ఎక్కడా అంతులేవే మిట్రా? ఊరెళ్లావా?" అడిగాడు ఈశ్వ ర్రావ్

"ఊహు! ఇక్కడే ఉన్నాను " క్లుప్తంగా అన్నాడు బాలకృష్ణ

"నేనే మీ ఇంటి కొద్దామనుకుంటు న్నాను " తిరిగి అన్నాడతను

"ఎందుకు?"

"వచ్చే శుక్రవారం నా పుట్టిన్రోజు మన ఫ్రెండ్సందరినీ పిలిచి సరదాగా పార్టీ ఇద్దామని "

"వెరీగుడ్! బావుంది " నవ్వు తెచ్చుకొంటూ అన్నాడు బాలకృష్ణ.

"అవున్రా! లేపోతే జీవితం మరీ చప్పగా అయిపోతోంది అప్పుడప్పుడు మన పాత స్నేహితుల మందరం సర దాగా కాసేపు గడిపితేగాని మళ్ళీ కొద్ది రోజులపాటు ఉత్సాహంగా ఉండలేము అసలు నన్నడిగితే ప్రతినెలా ఒకడు అందరికీ పార్టీ ఇచ్చేట్లు ఏర్పాటు చేసు కోవాలి "

"అవును "

"నువ్‌మరీ అంత డల్‌గా అఘో రింవా వేమిటి?" నవ్వుతూ అడిగాడతను

బాలకృష్ణకేం జవాబు చెప్పాలో తెరీ లేదు హఠాత్తుగా అతనికో ఆలోచన తట్టింది

"రాత్రి నేనో కధ చదివాను దాన్ని గురించే ఆలోచిస్తున్నాను " అన్నాడు బాలకృష్ణ

"నిన్ను ఆలోచింపజేసే కధలు కూడా వస్తున్నాయన్నమాట తెలుగులో! బావుంది ఇంతకూ ఏమిటా కధ?"

"పదేళ్లు కాపురం చేసిం తర్వాత హఠాత్తుగా ఓరోజు భర్తకి తన భార్య వివాహం కాకముందు ఓసారి కాలు జారిందని తెలుస్తుంది " ఈశ్వర్రావ్ మొఖంలోకి చూస్తూ అన్నాడు

"ఏం చేశాడతను?" ఆత్రుతగా అడి గాడు ఈశ్వరరావు

"భార్యను చంపివేశాడు "

"ఏడ్చినట్లుంది కధ "

"ఏం? ఎందుకని?"

"లేపోతే ఏమిటి? ఎప్పుడో పెళ్ళికాక ముందు చేసిన తప్పుకి శిక్ష ఇప్పుడా? అక్కడికి ఆ భర్తగాడెప్పుడూ అలాంటి తప్పు చేయనట్లు మనదేశంలో స్త్రీ అతి




చౌక అయిన వస్తువుగా తయారయింది స్త్రీకో నీతి, పురుషుడికో నీతీ ఉన్నంత కాలం ఇలాంటి కథలే రాస్తూంటారు "

బాలకృష్ణ ఉక్కిరిబిక్కిరయ్యాడు

వివాహానికి ముందు తనూ శారద అనే ఓ అమ్మాయితో ప్రణయకలాపాలు జరిపాడు

నిజమే! అయినా తనూ, సావిత్రీ ఒకటెలా అవుతారు? 'స్త్రీ' ఎప్పుడూ పవిత్రంగానే ఉండాలి మగాడెలా ఉన్నా ఫరవా లేదు

తన ఆలోచన తనకే ఎబ్బెట్టుగా కనిపించింది బాలకృష్ణకు

ఈశ్వర్రావ్ భార్య ఇద్దరికీ కాఫీ తీసుకొచ్చి ఇచ్చింది.

త్వర త్వరగా కాఫీ తాగి "ఇంక వెళ్తాన్రా" అంటూ ఇంటివేపు బయల్దేరాడు బాలకృష్ణ.

ఆ రాత్రంతా నిద్రపట్టనే లేదతనికి

ఏం చేయాలా అన్నదే ఆలోచన అయిపోయింది

అసలా సావిత్రి డైరీ తన కంటపడక పోయినా బాగుండేది ఎందుకో ఆమె పాత పెట్టె వెతుకుతూంటే అడుగున కనిపించినయ్ నాలుగు డైరీలు. వివాహానికి ముందు ఆమె దినచర్య ఏమిటో సరదాగా తెలుసుకోవాలనిపించి చదివాడు అంతే! అదే కంటకమయిపోయింది. అదే తన జీవితాన్ని సర్వనాశనం చేయబోతోందిప్పుడు

ఎప్పుడో నిద్రపట్టిందతనికి మెలకువ వచ్చేసరికి బాగా పొద్దెక్కిపోయింది

ఆఫీసుకి వెళ్ళబుద్ధి కాలేదతనికి. వారం రోజులకు లీవ్‌లెటర్ పంపించాడు

మధ్యాహ్నం సావిత్రి దగ్గర్నుంచీ మరో ఉత్తరం వచ్చింది తనింక పుట్టింట్లో ఉండలేదుట తక్షణం వచ్చి

తీసుకెళ్ళాలిట. ఆ ఉత్తరం చింపి అవతల పారేశాడు బాలకృష్ణ ఇంటికి తాళంవేసి గమ్యం తెలీకుండా బయల్దేరేడు అనుకోకుండా బస్‌స్టాండ్ దగ్గరకు నడిచేడు చాలా రద్దీగా వుందక్కడ

తనుకూడా కొద్ది రోజులు ఈ ఊరి నుంచి పారిపోతే? ఎక్కడికి పోగలడు? తన మిత్రబృందం అన్ని ఊళ్ళల్లోనూ వున్నారు ఎక్కడికి పోయినా నాలుగు రోజులు గడిపిరావచ్చు ఎటూ తెగటం లేదతనికి మధ్యమధ్యలో సావిత్రి గురించిన ఆలోచనలు జొరబడుతున్నాయ్ ఏమిటి చెయ్యడం? సావిత్రిని వదిలెయ్యవలసిందేనా?

తన ఆలోచనలకు తనకే కోపం వస్తోంది

వదలకపోతే ఇంకెందుకు? పిగ్గూ. శరం వున్నవాడెవ్వడూ అలాంటి భార్యను ఏలుకోడు

"కృష్ణా " సన్నని గొంతు వినబడి ఆలోచనల్లోంచి తేరుకొని అటువేపు చూశాడు బాలకృష్ణ ఇలా తనని 'కృష్ణా' అని పిలవడం ఒక్కరికే చేతనవును శారదకే అలా పిలిచే అలవాటుంది

ఎదురుగ్గా నిలబడ్డ శారదని ఓ పట్టాన గుర్తించలేక పోయాడతను చిక్కి, శల్యమైపోయిందామె ఆమెను చూస్తూంటే పాతరోజులు కళ్ళముందు కదిలి, అభిమానం పొంగుకొచ్చింది

"ఇక్కడేం చేస్తున్నావ్!" ఆశ్చర్యం నుంచి తేరుకొంటూ అడిగాడు బాలకృష్ణ

"టీచర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూకొచ్చాను. "

బాలకృష్ణ కర్థం కాలేదు శారదకు ఉద్యోగం ఎందుకవసరమయింది. ఆమె భర్త పెద్ద ఉద్యోగస్తుడేగా!

"మీ ఆయనకు నీ సంపాదనకూడా అవసరమయిందా?" అడిగాడు బాలకృష్ణ నవ్వుతూ

"నే నిప్పుడు ఆయన్తో ఉండటం లేదు " తలొంచుకుంటూ అంది శారద.

"ఏం?" ఆశ్చర్యపోతూ అడిగాడతను.

"ఆయన నన్ను వదిలేశారు "

"ఎందుకూ?"

అతని కళ్ళల్లోకి ఓసారి చూసి నెమ్మదిగా అందామె "అదే! ఆరోజు మనం చేసిన తప్పుకి ప్రతిఫలం " అలా అంటూంటే ఆమె గొంతు గద్గదికమయింది

బాలకృష్ణ గుండెలు ఝల్లుమన్నయ్

ఏమిటి శారద చెప్తోంది? ఆ రోజు తాముచేసిన తప్పు ఇప్పుడు ఆమె జీవితాన్ని బలి తీసుకొందా? ఏమిటీఘోరం? నిజానికి ఆరోజు జరిగిన ఆ సంఘటనలో ఆమె దేమీ తప్పులేదు అంతా తన బలవంతంమీదే జరిగింది శారద భయపడతూనే ఉంది అభ్యంతరం చెప్తూనే ఉంది అయినా తను వినిపించుకోలేదు ఆనాటి తన తప్పుకి ఈరోజు శారద శిక్ష అనుభవిస్తోందా?

కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్ బాలకృష్ణకి

శారదా! నువ్ చెప్పేది నిజమేనా?"

"నిజమే కృష్ణా' మేమంటే గిట్టని




వారెవరో ఆ విషయం ఆయన చెవి నేశారు ఆయన నన్ను నిలదీసి అడిగారు నిజం చెప్పక తప్పలేదు అంతే! అదే రోజు నన్ను మా ఇంటికి పంపించి వేశారు అక్కడితో మా వైవాహిక జీవితం అంతమయిపోయింది ఆయన మరో వివాహం చేసుకొంటున్నట్లు కూడా తెలిసింది చేసేదిలేక నా బ్రతుకయినా స్వతంత్రంగా గడవాలని ఉద్యోగం వెతుకుకున్నాను."

ఏదో బస్ వచ్చి ఆగిం దక్కడ

"వెళ్తాను కృష్ణా! బస్ వచ్చింది "

అనేసి హడావుడిగా బస్‌వేపు నడిచి గుంపులో కలిసిపోయిం దామె. అయిదు నిమషాల తర్వాత బస్‌తోపాటు ఆమె కూడా కనిపించలేదు

ఆమె భర్తమీద ఎక్కడలేని కోపం వచ్చింది బాలకృష్ణకి. అతగాడు చేసిన పని ఏమాత్రం సబబుగా కనిపించటం లేదు ఏనాడో శారదచేసిన తప్పుకి ఇప్పుడు ఆమెని శిక్షించటమా?—

హఠాత్తుగా సావిత్రి గుర్తుకొచ్చిం దతనికి మరికొద్ది సేపట్లో సావిత్రి వాళ్ళ ఊరు వెళ్ళే బస్‌లో కూర్చుని ఉన్నా డతను ఇప్పుడతని మనసు తేలిగ్గా ఉంది



సీరియల్



# మనిషికి ఏం కావాలి?

—కొమ్మూరి వేణుగోపాలరావు

ఆశ్చర్యం! నమ్మినా నమ్మకున్నా, యిష్టపడినా లేకున్నా మన ప్రమేయం లేకుండా కొన్ని సంఘటనలు జరిగిపోతూ వుంటాయి ఒక్కోసారి పొరపాటున నోరుజారి

జరిగిన కధ

సునీతికి చిన్నతనం నుంచీ సాహసకృత్యాలంటే ఇష్టం హఠాత్తుగా యాక్సిడెంట్‌లో సునీతి తండ్రి చనిపోయాడు తల్లితోసహా పెదనాన్న పంచన చేరింది సునీతి సునీతి తల్లి ఆ ఇంట్లో పనిమనిషిలా చూడబడుతోంది సునీతి తల్లి తనను బలవంతం చేయబోయిన బావ బారినుండి తప్పించుకొనే ప్రయత్నంలో అతని ప్రాణం పోయింది జైల్లోనే జబ్బుచేసి మరణించిందామె సునీతిని నారాయణమ్మ ఆదరించింది పొరుగింటి కృష్ణమూర్తి దంపతులు సునీతిని సర్కస్ చూపిస్తామని తీసికెళ్ళారు దారిలో కాఫీ త్రాగిన తర్వాత సునీతికి కళ్ళు తిరిగినట్లనిపించింది సునీతిని మోసంచేసి తీసుకుపోయి, ఆమెను అనుభవించ ప్రయత్నించాడు కృష్ణమూర్తి కృష్ణమూర్తి బారినుంచి తప్పించుకుని పారిపోతున్న సునీతిని ఆదుకొన్నారు రాజారావుగారు పిల్లల్లేని రాజారావుగారు సునీతిని దగ్గరుంచుకొని చదివిస్తున్నారు సునీతి కాలేజి చదువులో ప్రవేశించింది రాజారావుగారికి వేరే మరో భార్యా, సంసారం ఉన్నదన్న విషయం తెలిసి ఆయనంటే అసహ్యం కలిగింది సునీతికి కాని రాజారావు ఏ పరిస్థితులలో తాను అలా చేయవలసి వచ్చిందో చెప్పినప్పుడు ఆయనలోని మంచితనం తెలిసొచ్చింది సునీతికి మద్రాసులో క్రికెట్ మాచ్ చూడటానికి వెళ్ళినప్పుడు శ్రీకాంత్‌తో పరిచయమయింది సునీతికి వీరిద్దరిమధ్య చనువేర్పడింది నారీద్వేషి అయిన తన ప్రాణస్నేహితుడు విశ్వందగ్గరకు సునీతిని తీసి కెళ్ళాడు విశ్వానికి స్త్రీలపైగల హీనమైనఅభిప్రాయాలకు అసహ్యంచుకుంది సునీతి తన ప్రేమో, విశ్వం స్నేహమో తేల్చుకోమని హెచ్చరించింది శ్రీకాంత్‌ను శ్రీకాంత్ తల్లడిల్లిపోయాడు. రౌడీలబారినబడ్డ సునీతిని రక్షించాడు విశ్వం శ్రీకాంత్‌ని పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యం అతని దగ్గర వ్యక్తపరచింది సునీతి బార్‌లోంచి బయటికి పంపేయబడ్డ విశ్వాన్ని తన కారులో తీసుకొని అతని రూంకెళ్ళింది దింపెయ్యడానికి విశ్వానికి యాక్సిడెంటయితే శ్రీకాంత్‌తో కలసి హాస్పిటల్‌కెళ్ళి అతన్ని చూసొచ్చింది సునీతి ఒంటరిగా వెళ్ళికెళ్ళవస్తూ వర్షానికి తలదాచుకొనేందుకు దగ్గర ఇంటి వరండాలో కెళ్ళిన సునీతి, ఆ ఇంట్లో విశ్వాన్నిచూసి ఆశ్చర్యపోయింది

వెంటనే నాలిక కరుచుకుంటాం అయినా ఆ తొందరపాటు ఫలితంగా మనం భరించటానికి వీల్లేని వాతావరణాన్ని గంటలకొద్దీ భరించాల్సివస్తుంది అలాగే అడుగుతీసి

అడుగు వేయటంలో చూపే అజాగ్రత్తల మూలంగా జీవితగమనాలే మారిపోతూ వుంటాయి.

అతని మాటకు జవాబు చెప్పకుండా, కదలకుండా మెదలకుండా అలానే నిల్చున్నాను

"బాగా తడిసిపోతున్నారు పర్వాలేదు లోపలకురండి "

అప్పటికే నేను ఉలకలేదు పలకలేదు

"ఈసారి చప్పగా తడిసి కుప్పకూలిపోతే - వెనకటిలా శుశ్రూషలు చెయ్య లేను "

వళ్ళు మండింది అతని ముఖంలోకి కోపంతో చూశాను అందులో వ్యంగ్యం, పరిహాసం - అలాంటివేమీ కనిపించలేదు గాని, అతని కళ్ళలో నా కర్థంకాని వెలుగు చూస్తే, అక్కడ్నుంచి తప్పించుకుని పారిపోదామనిపించింది

"పలకరేం?" అంటూ అతను ఒక అడుగు యివతలకువేసి దగ్గరగా వచ్చాడు.

గభాలున ప్రక్కకు జరిగి, వర్షంలోకి ఒక్క ఉదుటున దూకెయ్యబోయాను

నా వల్ల కాలేదు ముందుకు వెళ్ళటానికి బదులు నేను వెనక్కి కొట్టుకు పోతున్నాను ఏం జరిగిందో తెలుసుకునే లోపల అతను నా భుజం వొదిలిపెట్టి తలుపు గడియవేస్తూ "సాహసాలు చెయ్యటం మంచిపని కాదు అందులో ఏమీ కలిసిరాని నీ లాంటి అమ్మాయికి" అన్నాడు

నాలో కోపం సెగలు చిమ్మింది "నన్ను బలవంతంగా లోపలకులాగే అధి కారం నీ కెవరిచ్చారు?" అన్నాను

"నువ్వే యిచ్చావు "

"నేనా?"

"అవును పదే పదే నాకు కనిపించావు నాచేత రక్షించబడ్డావు నన్ను రక్షిం చావు నీ ధైర్యం నాకు నచ్చింది నాకు నచ్చిన మనుషుల్ని దగ్గరకు లాక్కునే అధి కారం నాకుంది "

"నీ అధికారాన్ని చిటికిన వ్రేలుతో ఎగరకొట్టగలను "

అతను నా దగ్గరగా వచ్చి నా ముఖంలోకి సూటిగా, అనునయంగా చూశాడు. ఆ చూపుల్లో పూర్వపు కాఠిన్యం కనబడలేదు

"సునీతీ! నేను నారీద్వేషినే కావచ్చుగాని మానవత్వం వున్న మనిషిని ఇవేళ మనమిద్దరం పోట్లాడుకోవద్దు. మాట్లాడుకుందాం "

"నాతో నీకేం మాటలు?"

"చెబుతాగా అలిసిపోయివున్నావు అలా కూర్చో."

అప్పుడు చూశాను ఆ గదిని ఎక్కడపడితే అక్కడ చిందరవందరగా వున్న సామాన్లతో అస్తవ్యస్తంగా వుంది గదిలో ఓ ప్రక్కన పేము కుర్చీ, దానిముందు చిన్న టీపాయి, దానిమీద విస్కీసీసా, ప్రక్కనే సగం ఖాళీచేసి వున్న గాజుగ్లాసూ

"ఈ యింట్లో ఎలా సాక్షాత్కరించానని ఆశ్చర్యంగా వుంది కదూ! అప్పుల బాధ భరించలేక ఆ యిల్లు అమ్మేశాను. ఈ మధ్యనే యిది అద్దెకు తీసుకున్నాను నీకు అసహనంగా వున్నా వర్షం వెలిసేవరకూ యిక్కడ గడపక తప్పదు కూచో" నాకు చేరువలో వున్న మరో పేముకుర్చీ చూపించాడు

చేసేదిలేక వెళ్ళి కూర్చుని, తల ప్రక్కకి త్రిప్పుకున్నాను

అతను వెళ్ళి, తన స్థానాన్ని ఆక్రమించటం, విస్కీగ్లాసు నోటి దగ్గర పెట్టుకోవటం చూడకపోయినా తెలుస్తూనే వుంది

"సునీతీ' ఐ లైక్ యూ?"

అతనివంక తిరిగి చూడలేదు

"దీనికి నువ్వు ఎన్ని అర్థాలైనా చెప్పుకోవచ్చు కాని యీ లైకింగ్ అనేది చాలా విశాలమైన పదమని నేననుకుంటున్నాను కాని స్వార్థానికి దూరమైన మనసుతో అంటున్నాను శ్రీకాంత్ నిన్ను ప్రేమించాడంటే ఆశ్చర్యంలేదు "

ఈ సొదంతా నా కెందుకు అందామనుకున్నాను. కాని ఏమి జరుగుతున్నదో- అతని సమక్షాన్ని విసుక్కుంటున్నాను కాదనలేకుండా వున్నాను. కఠినంగా వుండా లనుకుంటున్నాను ఓడిపోతున్నాను

శ్రీకాంత్ సమక్షంలో జీవితంలోకి దూరిపోవాలన్న తాపత్రయంతో కూడిన వేదాంతిలా మసులుకోగలుగుతున్నాను

నేను ద్వేషించే యీ విశ్వం దగ్గర జీవితంనుంచి తప్పించుకోలేని మనిషిలా మసిలిపోతున్నాను

"ఆ రోజు రాత్రి ఎవరో వచ్చి నన్ను కారులో యింటికి చేరవేసినట్లు తెలుస్తోంది ఆ మసక తెలివిలో ఆ స్త్రీ కమలలా అనిపించింది "

కమల! ఆ రోజు 'నన్ను విడిచివెళ్ళకు కమలా' అంటూ అతనన్న మాటలు గుర్తువచ్చాయి

"కమల నా భార్య ఆమెను పెళ్ళిచేసుకున్న తొలిరోజుల్లో స్త్రీ అంటే ఏమిటో తెలిపింది ఆమెతో గడిపిన తొలిఘడియల్లో యీ సృష్టికి నిర్వచనం తెలిపింది అప్పుడే ప్రేమకు అర్థం తెలుసుకున్నాను నా జీవితంలో అంతవరకూ దగ్గరగా వచ్చిన స్త్రీలు యిద్దరు ఒకరు అమ్మ రెండవది కమల అమ్మను అప్పట్లో మాతృమూర్తి అంటే యీమే అనుకున్నాను. ఆమెలో దేవతని చూశాను కాని ఒకనాడు నదిలో తమ్ముడ్ని రక్షించకుండా శ్రీకాంత్‌ని కాపాడిన కారణంగా ఆమెలోని దేవత క్రమంగా హరించిపోయి ఓ ఆడది ఎలా దెయ్యంగా మారగలదో గమనించాను అప్పట్నుంచీ ఆడదంటే భయంపట్టుకుంది అసహ్యమూ వేసింది జీవితంలో పెళ్ళనేది చేసుకోకుండా ఆజన్మాంతం బ్రహ్మచారిగానే వుండిపోదామనుకున్నాను కాని అనుకోకుండా కమల ప్రవేశించింది మనం ఎంత అల్పులం! ఎంత అరికట్టుదామనుకున్నా ఆమె ప్రవేశాన్ని నిరోధించలేకపోయాను ఓ శక్తిలా, ప్రభంజనంలా, మలయమారు

# భగీరథుని అడుగు జాడల్లో

"గలగలా పారేటి గంగమ్మ తల్లీ
చల్లని చూపుతో సంపదలనివ్వు"

నదులు ఉప్పొంగి గట్లు తెంచుకుని వరదల ఉరవడితో, ఉరుకులు పరుగులతో ప్రవహిస్తూ ఉంటే నదీమతల్లిని శాంతింప జేయడానికి ఊరి ముత్తైదువులు పసుపు కుంకుమ, హారతి పళ్లాలతో జానపద గీతాలు పాడుతూ నది గట్టుకు చేరి పసుపు కుంకుమలు, కొత్త రెవికమడతలు నదిలోకి విడవడం అలనాటి ఆచారం మానవుడు ప్రకృతిని తన సౌభాగ్యంకోసం వినియోగించుకోవడం నేర్చిన తర్వాత నదులనుకూడా అదుపులోకి తెచ్చాడు అవి సముద్రాన్ని వదిలి మన పంట భూములను ఆశ్రయిస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్ నదుల రాష్ట్రం మన రాష్ట్రంలో బీడు భూములను బంగారం పండే పంట భూములుగా మార్చడానికి వీలుగా నీటి పారుదల సౌకర్యం కల్పించడానికి భగీరథ ప్రయత్నం జరుగుతూనే వుంది

ఐదవ ప్రణాళిక కాలంలో **4,65,000** ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించాలి

భారతీయ ఇంజనీరింగ్ ప్రతిభకు నిదర్శనంగా నాగార్జున సాగర్ వంటి ప్రాజెక్టులు వెలుస్తున్నాయి తెలంగాణాకు వరప్రసాదం పోచంపాడు ప్రాజెక్టు రు **182** కోట్లతో నిర్మిస్తున్న వంశదార ప్రాజెక్టు మన రైతుల భవిష్యత్తుకు వెలుగుబాటలు

— o —

సమాచార, పౌరసంబంధ శాఖ హైదరాబాదు

తంలా, అగ్నిపువ్వులా ఆక్రమించేసింది దెయ్యాన్ని మరిచిపోయాను స్త్రీని గురించి నేనే అపార్థం చేసుకున్నాననుకున్నాను ఈ ప్రపంచాన్ని జయించగలిగినంత శక్తి వచ్చేసి నట్లనిపించింది విజయగర్వంతో ఊగిపోయాను రెండేళ్ళు స్వప్నావస్థలా గడిచి పోయాయి కాని ఒకనాడు "

మాటలు ఆగిపోయాయి ఒకటి రెండు నిమిషాలు గడిచినా మళ్ళీ వినరాలేదు ఏం జరిగింది? ఎంత వద్దనుకున్నా తలత్రిప్పి అతనివంక చూడకుండా వుండలేక పోయాను

గ్లాసెత్తి గడగడ తాగేస్తున్నాడు కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా మండుతున్నాయి ఇంతకుముందు చూపింది ఇతన్నేనా మాట్లాడింది యితనేనా అన్నట్లుంది రూపం

బయట వర్షం వెలసిన చప్పుడు తెలుస్తోంది

గ్లాసు ఖాళీ అయాక మరోసారి నింపుకుని అలాగే గడగడ త్రాగేశాడు

ఆశ్చర్యంగా చూస్తున్నాను

త్రాగి గ్లాసు క్రింద పెట్టేసి నా వంక చూశాడు ఆబ్బ! ఎంత అనంత గోళాల్లా వున్నాయా నేత్రాలు!

"ఏమన్నాను? నేను కమలని ప్రేమించానని చెప్పానా? అబద్ధం శుద్ధ అబద్ధం" గట్టిగా అన్నాడు

"కమలంటే నాకు అసహ్యం ద్వేషం, పగ "

" "

"నువ్వంటే లైకింగ్ అని యిందాక చెప్పానా? నో' యింపాజిబుల్ నాకు ప్రపంచంలో ఏ ఆడదన్నా యిష్టం వుండటానికి వీల్లేదు యు ప్లీజ్ గో "

లేచి నిల్చున్నాను మెదడంతా బండబారినట్లయిపోయింది ఇహ అక్కడ ఒక్క క్షణమైనా నిల్చోకుండా తలుపులు తెరుచుకుని గబగబ బయటకు వెళ్ళిపోయాను

## 15

నా సొంత సంగతులలా వుంచి రానురానూ నాన్నగార్ని చూస్తోంటే నాకు దిగులుగా వుండసాగింది ఆయన కల్లాకపటంలేని మనిషి ఇతరుల్ని ప్రేమించటమే ఆయనకి వచ్చు పిరికితనం, ఆత్మవంచన పరవంచన ఆయనకి అసహ్యం ఆయన కుటుంబంలో అనేక కలతలు రేగుతున్నాయి ఆడవాళ్ళు విజృంభించి గృహ కల్లోలాలు శక్తి వంచన లేకుండా లేవదీసి ఒకళ్ళతో ఒకళ్ళు పొత్తు కలవకుండా పాటుబడుతున్నారు కోడళ్ళని కంట్రోల్ చెయ్యలేకపోయిన కొడుకులు తాగుళ్ళకూ క్లబ్బులకూ అలవాటు పడిపోయి జీవితాలను మలినం చేసుకుంటున్నారు కూతుళ్ళు వాళ్ళ వాళ్ళ మొగుళ్ళను వెనకేసుకొచ్చి అసహ్యంగా బయటపడి పోతున్నారు

ఒకసారి నాతో నాన్నగారన్నారు! "ఎంత మనస్సు విప్పి మాట్లాడినా, ఎదుటి వాళ్ళని అర్థంచేసుకుని వివరించినా నిజాన్ని చెప్పి ఎవర్నీ కన్విన్స్ చెయ్యలేమమ్మా

లోకంలోని చేదుని మరమ్మత్తు చెయ్యలేమమ్మా శివుడు గనుక గరళాన్ని గొంతులో యిముడ్చుకున్నట్లు యీ చేదునంతా కంఠం వరకూ దిగమ్రింగి నిలద్రొక్కుకున్న వాడు విజయవంతంగా నిలబడతాడు ఇతరుల్ని శాసనం చేద్దామని తాపత్రయపడేవాడు అర్థంకాని త్యాగాలను విరజిమ్మి, తనుమాత్రం నలుగుతూ వుంటాడు ఈ నిజం యిప్పుడు తెలుసుకున్నానమ్మా "

ఆయన ! ఎంత గుండెల లోతుల్నించి మాట్లాడుతారు'

అలాంటి వ్యక్తి సముఖంలో వున్నప్పుడు యీ ప్రేమలూ వ్యామోహాలు— యివన్నీ అవాస్తవం అయినట్లూ మానవత్వపు విలువలు ఒకటే శాశ్వతం అయినట్లూ తెలుసుకున్నట్లయి ఒక విధమైన విరాగత్వం పుట్టుకొస్తుంది

ఆయన సాధించనిదేమిటి?

అట్టడుగు స్థితినుంచి మిలియనీర్ అయినాడు ఎవ్వరికీ లొంగకుండా తన మార్గాన్నే పయనించాడు అయినా అశాంతి తప్పలేదు

ఒకరోజు కొంచం నలతగా కనిపించాడు

"ఏమిటి నాన్నగారూ అలా వున్నార"ని అడిగాను

"ఈ మధ్య కొద్దిగా గుండెల్లో నొప్పి వస్తోందమ్మా" అన్నారు

నాకు భయమేసింది "తొందరగా డాక్టరుగారికి చూపించుకోండి నాన్నా నిర్లక్ష్యం చెయ్యకండి" అన్నాను వాణికే గొంతుతో

"చూపించుకున్నానమ్మా అలసటవల్ల వస్తుందన్నారు అంతే "

ఏమయినా నాకుమాత్రం భయం భయంగానే వుంది

"పదమ్మా అలా పోయివద్దాం" అన్నారు

"మీరు ప్రక్కన కూర్చోండి నీరసంగా వున్నారు నేను డ్రైవ్ చేస్తాను" అని వెళ్ళి స్టీరింగ్ ముందు కూర్చున్నాను

"నాన్నగారూ! ఎటు పోనివ్వమంటారు? మనం ఎప్పుడూ వెళ్ళి కూర్చునే టాంక్‌బండ్ దగ్గరకా?"

"కాదమ్మా నీకివేళ ఓ విచిత్రమైన వ్యక్తితో పరిచయం చేస్తాను పోనియ్యి దారి చెబుతాను?"

ఆయన మధ్య మధ్య త్రోవ మార్చవలసినప్పుడు డైరెక్షన్స్ యిస్తున్నారు నేను పోనిస్తున్నాను

"నాకు ఒక్కోసారి చిత్రమైన ఆలోచనలు వస్తూంటాయమ్మా ఈ తండ్రీ, పిల్లలూ—బాంధవ్యాలు ఒక్కోసారి విసుగు పుట్టిస్తూంటాయి పిల్లలు ఎలాంటి వాళ్ళ యినా ఎన్నో సందర్భాలలో వాళ్ళని ద్వేషించినా, తిట్టుకుంటున్నా తిమురుకుంటున్నా తనకున్నదంతా చివరకు వాళ్ళకే ధారపొయ్యాలని మానవుడు తాపత్రయపడుతూ వుంటాడు ఈ ప్రలోభానికి అర్థంలేదు నాకో చిన్న ప్రయోగం చెయ్యాలనిపించింది నా వ్యాపారంలో ఒక భాగమైన పల్వరైజింగ్ మిల్స్‌ని అకస్మాత్తుగా సర్వ హక్కు

లతో ఒక వ్యక్తికి ధారాదత్తం చేసేశాను అతని దగ్గరకే యిప్పుడు నిన్ను తీసుకెడుతున్నాను?''

నిజంగా నాన్నగారు నాకు విచిత్రపురుషుడిలానే కనిపించారు ప్రాణంపోతున్న సమయాల్లోనైనా మనుషులు ఆస్తులంటే పాశం వేసుకుని విలవిల్లాడుతూంటారు ఈయన ఎంత తేలిగ్గా యీ బంధాన్ని తెంచుకుంటున్నారు?

మరో పది నిమిషాల తర్వాత చిన్న అందమైన యింటి ముందుకు వచ్చాక "యిక్కడ ఆపమ్మా" అన్నారు

ఇద్దరం లోపలకు వెళ్ళాం రెండు మూడు రోజులలోపలే అలంకరించినట్లు కొత్త ఫర్నిచర్‌తో, నిర్మలంగా నిరాడంబరంగా వుంది

ఎవరో గుమాస్తాలాంటి వాడు ఎదురుగా వచ్చాడు

నాన్నగార్ని చూసి తత్తరపాటు పడుతూ "మీరా? కూర్చోండి సార్ అయ్యగార్ని పిల్చుకువస్తాను" అని గబగబ లోపలకు వెళ్ళాడు

ఇద్దరం సోఫాలో ప్రక్కప్రక్కన కూర్చున్నాం

ఒక నిముషం గడిచాక లోపల్నుంచి ఒక వున్నతాకారం బయటకు నడిచి వచ్చింది

తృళ్ళిపడ్డాను ఎవరితను? విశ్వమేనా? పైజమా, లాల్చీ వేసుకుకుని వున్నాడు నీట్‌గా తల దువ్వుకున్నాడు వయసు ఎన్నో సంవత్సరాలు తగ్గిపోయినట్లు కుదురుగా, నిండుగా వున్నాడు

నాన్నగార్ని చూసి వినయంగా చిరునవ్వుతో నమస్కారం చేశాడు నా వంక తల త్రిప్పయినా చూడలేదు

"ఈమె మా అమ్మాయి సునీతి "

అప్పుడు నా వంక తిరిగి నమస్కారం చేశాడు ముఖంలో ఎలాంటి ఆశ్చర్యం కాని ఉత్కంఠతగాని లేదు

అనుకోకుండా చేతులు రెండూ జోడించి నేనూ నమస్కరించాను

"విశ్వం! ఈ యిల్లు సౌకర్యంగా వుందా?"

అతను విశ్వమే ఈ వింత ఎలా జరిగింది? అసలు ఎవరితను? ఇన్నివిధాలుగా నా దగ్గరకు ఎలా వస్తున్నాడు?

అతను తల ఊపాడు

"కూర్చో "

ఎదురుగా వున్న పేముకుర్చీలో కూర్చున్నాడు 'ఇతనికి పేముకుర్చీలంటే యిష్టం కాబోలు' అన్న ఆలోచన అనుకోకుండా మెదిలింది

"సార్! నాకు కొన్ని సందేహాలున్నాయి అడుగుతాను "

"అడుగు "

అతను బిజనెస్‌కు సంబంధించిన ప్రశ్నలు ఏవేవో అడుగుతున్నాడు నాన్న

# దేవుడెక్కడున్నాడు?

"నా విష్ణుః పృథ్వీపతిః" పాలించే రాజుకాక వేరే దేవుడు లేడని వేద, పురాణకాలాల నాటి విశ్వాసం

దీనిమీద పరంపరగా జరిగిన తిరుగుబాటుల ఫలితంగా ప్రజాస్వామ్యం వచ్చింది

ఆ విశ్వాసమే నిజమైతే యివాళ పరిపాలిస్తున్న ప్రజలే దేవుళ్లు గదా పంచాయితీ రాజ్యం వచ్చాక ప్రజలే రాజులు, ప్రజలే దేవుళ్లు

ప్రజాస్వామ్య స్వేచ్ఛా విహంగం శాంతి కపోతంతో ఆకాశం లోకి ఎగిరింది భూమ్మీద నడిచే మనిషి మనసులో పుట్టి రెక్కలు వచ్చి రిక్కల దాకా ఎదిగిన సామాన్యుడి సమస్యలు ఎన్నో అంత ఎత్తున వాడికి కనిపించాయి పంచాయితీ రాజ్యం వాటిని ఒకటొకటే తీర్చేసింది

సవరించబడిన పంచాయితీ రాజ్య చట్టం అమలు జరిగిన తర్వాత పాలనాధికారం పూర్తిగా ప్రజల పరం అవుతుంది

పంచాయితీ రాజ్యం రామరాజ్యానికి పర్యాయపదం అవుతుంది

దేవుడెక్కడున్నాడు? ఎవరికీ కనిపించని దేవుడు యివ్వాళ సామాన్య ప్రజల్లో కనిపిస్తున్నాడు

— ο —

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

గారు వాటన్నిటికీ ఓపికగా జవాబులు చెబుతున్నారు నాకుమాత్రం మనసు మనసులో లేదు అక్కడ్నుంచి ఎప్పుడు వెళ్ళిపోదామా అని తొందరపాటుగా వుంది

ఓ అరగంట గడిచాక వాళ్ళ సంభాషణ ముగిసింది నాన్నగారు నావంక ముఖం త్రిప్పి "యిహ పోదామా?" అన్నట్లు చూశారు ఎప్పుడా ఎప్పుడా అని చూస్తోన్న నేను సరేనన్నట్లు తల ఊపాను

ఇద్దరం లేచి వచ్చేస్తోంటే అతను కారుదాకా వచ్చాడు సాగనంపటానికి అతని వంక చూడకుండానే నేను స్టీరింగ్ ముందు కూర్చున్నాను

"అతన్తో అంత ముభావంగా ప్రవర్తించావేమమ్మా?" అనడిగారు

"అతనిపట్ల నాకంత సదభిప్రాయం కలగలేదు నాన్నగారూ "

"ఏ మమ్మా?"

"అతను నా కళ్ళకి త్రాగుబోతువాడిలా కనిపించాడు "

"నీ కళ్ళకి అలా యిప్పుడెందుకు కనిపించాడో చెప్పలేను గాని చాలా కొద్ది రోజుల క్రితంవరకూ అతను త్రాగుబోతయిన మాట నిజమే కాని యిప్పుడు కాదు?"

నా కర్థంకాలేదు ఆ వాన వచ్చిన మధ్యాహ్నం నాటి సంఘటన జరిగి యింకా పదిహేను రోజులు కూడా కాలేదు

"పది రోజులక్రితం వరకూ యిలా జరుగుతుందని నాకూ తెలియదు ఓ సాయంత్ర మనసు బాగుండక బిలియర్డ్స్ ఆడటానికి క్లబ్బుకి వెళ్ళాను అక్కడ వొంటరిగా ఓ మూల కూర్చుని త్రాగుతున్నాడు అతన్నీ మధ్య ఎప్పుడూ చూడ లేదు కాని ఎవరో తెలుసు ఎలా అంటే అతని తండ్రికి నాకూ బాగా స్నేహం వుండేది నా బిజినెస్ ఒడుదుడుకుల్లో వున్న సమయంలో ఆయన నాకు చాలా సహాయంచేశాడు కూడా ఫలాన వారి అబ్బాయి అని తెలియగానే నేను పులకించి వెళ్ళి అతన్తో పరిచయం చేసుకున్నాను రాత్రి చాలా పొద్దుబోయే వరకూ యిద్దరం మాట్లాడుతూ కూర్చున్నాం నేనర్థం చేసుకున్నదేమంటే అతను బంగారంలాంటి మనిషి కాని ఎందుకో పెర్వర్షన్ వచ్చింది ఆ రోజు నేను ఎలాంటి స్థితిలో వున్నా నంటే యీ ఆస్తినీ, బంధాల్నీ అన్నీ తెంచుకుని సరస్వతిని తీసుకుని ఏ దూర ప్రాంతాలకైనా వెళ్ళిపోవాలన్నంత తీవ్రస్థాయిలో వున్నాయి నా ఆలోచనలు అతన్ని చూడగానే ఎందుకో అభిమానం కలిగి నా ఆలోచనల దోవమళ్ళింది జీవితంలో ఏదయినా భరించవచ్చుగాని వంటరితనం భరించలేం అతన్ని బాగుచేస్తే ? చిన్న ప్రయోగం చెయ్యాలనిపించింది 'నువ్వు త్రాగుడు మానేస్తే నా ఆస్తిలో కొంత భాగానికి నిన్ను వారసుడ్ని చేస్తాను" అన్నాను అతను నవ్వాడు "నాకు ఆస్తుల మీద వ్యామోహంలేదు" అన్నాడు అని మళ్ళీ 'అయినా యీ ఛాలెంజి తీసుకోవాలని వుంది ఈ జీవితం నాకూ సుఖంగాలేదు ఎవరినో ద్వేషిస్తూ రోజుని వ్యర్థం చేసుకుంటూ బ్రతకటం నిరర్థకం అనిపిస్తోంది మార్పుకావాలని అనిపిస్తోంది

పదండి ముందు వెళ్ళిపోదాం అన్నాడు అంతా క్షణాలమీద జరిగినట్లు జరిగిపోయింది రెండు మూడు రోజుల్లో అతను కొన్ని లక్షల ఆస్తికి వారసుడైపోయాడు

మరి మీ ఇంట్లోని వాళ్ళు బాధపడరా నాన్నగారూ

అన్నీ వున్నా బాధపడేవాళ్ళు ఎప్పుడూ దేనికోదానికి బాధపడుతూ ఉంటారు వాళ్ళ బాధకి విలువలేదు

* * *

మరునాడు శ్రీకాంత్ దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళాను రేడియో వింటూ చాలా ఉల్లాసంగా కనిపించాడు నన్ను చూసి అతని ముఖం మరింత వికసించింది

వెళ్ళి ప్రక్కన కూర్చుని అతని చేతిని నా చేతుల్లోకి తీసుకున్నాను

ఏమిటి అనుకోకుండా యీ సాక్షాత్కారం?

నిన్ను చూడకుండా వుండలేకపోయాను

అదేం?

'నాకు తెలీదు

రేడియో వాల్యూం తగ్గించాడు

'శ్రీకాంత్! నీవళ్ళో తలపెట్టుకుని కాసేపు పడుకుంటాను '

అతని జవాబుకోసం ఎదురు చూడకుండా కొంచం యివతలకు జరిగి అతని ఒడిలోనికి ఒరిగి కళ్ళు మూసుకున్నాను

అతని మృదువైన వ్రేళ్ళు నా ముంగురుల్నీ నుదురునూ చెంపల్నీ నిమురుతున్నాయి ఆ వేళ్ళు కళ్ళని స్పర్శిస్తూ కొంచంసేపు కదిలాయి

సునీతీ! ఏడుస్తున్నావా?

ఉహూ ఏదో విషాదం

ఎందుకు?

తెలియటంలేదు

ఏమీ మాట్లాడలేదు ఒంగి నా నుదురు ముద్దు పెట్టుకుని మళ్ళీ నా చెంపల్ని సవరిస్తూ మామూలుగా కూర్చున్నాడు

"శ్రీకాంత్! పద ఎక్కడికైనా వెళ్ళిపోదాం

దేనికి ఇక్కడ మన స్వేచ్ఛకి ఏం తక్కువ?

మన స్వేచ్ఛకు మనమే బంధాలు వేసుకుంటున్నామనిపిస్తోంది

నో! అలా జరగదు అలా జరగటానికి వీల్లేదు

'శ్రీకాంత్! నీకెంతో యిష్టమైన వాళ్లు నన్ను వొదులుకొమ్మని శాసిస్తే ?

అలా శాసించే హక్కు అవసరం ఎవరికున్నాయి?

మీ విశ్వమే ఆ పనిచేస్తే?

'అతన్నే ఒదులుకుంటాను దృఢ స్వరంతో అన్నాడు




నీమీద అధికారం చూపించటానికి ప్రయత్నిస్తే?

నిన్ను నానుంచి వేరుచెయ్యటానికి ప్రయత్నించిన ఎవరైనాసరే—నా శత్రువే

అలా చాలాసేపు అతని ఒళ్ళో పడుకుని పడుకుని వుండిపోయాను

మానవ జీవితాలు ఎక్కువగా విషాదాల మయమేనేమో ప్రతి సంతోషకరమైన సంఘటన వెనకా విషాదం కొంత మిళితమై వుంటుంది-అసలు సంతోషమనేది భ్రాంతి విషాదమనేది వాస్తవమూ-నేమో అనిపిస్తోంది?

మనిషికి కోరుకున్నవి అన్నీ లభిస్తున్నా - తప్పటడుగులు వెయ్యడం వాటి తాలూకు దుష్ఫలితాల ననుభవిస్తూండటమూ జీవిత సిద్ధాంతవేమో

## 16

రోజులు గడిచిపోతున్నాయి పరీక్షలు దగ్గరకు వస్తూ వుండటవల్ల నేను చదువుమీద మనసు నిమగ్నం చెయ్యటానికి ప్రయత్నించసాగాను

ఈ మధ్యలో ఉషనూ జ్యోతినీ కొన్నిసార్లు కలుసుకొనకపోలేదు

ఉష రోజు రోజుకూ మెంటల్ అయిపోతున్నట్లు కనిపెట్టాను ఎప్పుడూ అసంతృప్తి అనుమానం కొన్నిగంటలు వంటరిగా వుండవలసివస్తే జీవితమంతా శూన్యమైపోయినట్లు అపోహపడటం వినయబాబును తన సందేహాలతో సూటిపోటి మాటలతో కాల్చుకు తినటం

ఇహ జ్యోతి పెళ్ళయిన తొలి రోజుల్లోనే మురారి అసలు బ్రతుకును అర్థం

చేసేసుకుంది ఇంటినిండా వున్న సామాన్లన్నీ అప్పులుచేసి కొన్నవే మనిషి అబద్ధాలమయం ఓరాత్రి అప్పులవాడు వచ్చి తలుపులుకొట్టి వాగ్వివాదం పెరిగి పదిమందీ చూస్తూండగా మురారిని చెయ్యి చేసుకుని వెళ్ళాడుట జ్యోతి కన్న కలలన్నీ కరిగిపోయాయి అది దిగులులో రోజు రోజూ కృశించిపోసాగింది

ఇవన్నీ మనసుని నలిపేస్తున్నాయి

తర్వాత అన్నిటికన్న దురదృష్టకరమైన సంఘటనలు జరిగాయి

ఓ ఉదయం నాన్నగారి ఆఫీస్‌బాయ్ ఎవరోవచ్చి ఆయనకు హార్ట్ ఎటాక్ వచ్చిందనీ హాస్పటల్‌లో ఎడ్మిట్‌చేశారనీ చెప్పాడు

కళ్ళముందు ఏవో చీకట్లు కదిలినట్లయింది

అమ్మ ముఖంలోకి చూశాను అందులోని భావాలు అర్థం చేసుకొనటానికి నా అంతస్థు సరిపోలేదు

పద వెడదాం అంది

ఇద్దరం హాస్పటల్‌కి వెళ్ళేసరికి ఆయన కరొనరీకేర్ యూనిట్‌లో వున్నారు మన స్పృహలోలేరు ఆయన కుటుంబ సభ్యులంతా దాదాపు అక్కడే వున్నారు

నాన్నగారికి చాలా సీరియస్‌గా వున్నట్లు అర్థమయింది

అమ్మ వులకటంలేదు పలకటంలేదు క్రమంగా సాయంత్రమైంది ఉప్పటి దాకా పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు

విశ్వం నేను వెళ్ళింది మొదలు అప్పటిదాకా అక్కడే వున్నాడు

చీకటి పడబోతూండగా అమ్మ నన్ను దగ్గరకు పిలిచింది 'నువ్వు యింటికి వెళ్ళిపో సునీతీ! నేను ఇక్కడే వుంటాను

తల ఊపాను

బయటకు వచ్చేస్తోంటే విశ్వం నావెంట హాస్పటల్ గేటుదాకా వచ్చాడు ఇద్దరం ఏమీ మాట్లాడుకోలేదు నేను టాక్సీ ఎక్కి వచ్చేశాను

ఇంట్లో ఒక్కదాన్నీ పడుకునివుంటే నిద్రమాట అలావుంచి గుబులు గుబులుగా వుంది మన దరిదాపుల్లో ఏది చూడటానికి యిష్టపడమో అవే తరుచు తటస్థిస్తూ వుంటాయి

అర్ధరాత్రి వరకూ ఎచ్చిదానిలా ఇంట్లో అటూ ఇటూ తిరుగుతున్నాను అప్పటిదాకా లైట్లు వేసే వుంచాను నీరసం అనిపించి లైట్లన్నీ తీసేసి ప్రక్కమీదకి వెళ్ళి పడుకున్నాను

ఎంతసేపు గడిచిందో తెలీదు ఎవరో బజర్ నొక్కారు

ఇంకా చీకటిగానేవుంది మళ్ళీ లైటువేసి 'ఎవరూ? అంటూ వెళ్ళి తలుపు తీశాను

ద్వారం అవతల విశ్వం నిలబడి వున్నాడు

వెంటనే నా మనసు ఏదో కీడుని శంకించింది.

"నాన్నగారు పోయారు."

ఒక్క గావుకేక వెయ్యాలనిపించింది. కళ్ళు చీకట్లు క్రమ్మాయి.

తూలి పడబోతుంటే అతను పట్టుకున్నట్లు తెలుసు.

కాసేపట్లోనే తేరుకున్నాను. "పదండి" అన్నాను.

అతను కారు డ్రైవ్ చేస్తోంటే ప్రక్కన మౌనంగా కూర్చున్నాను. కళ్ళ వెంట నీళ్ళు కారిపోతున్నాయి.

మేము వెళ్ళింది హాస్పటల్‌కి కాదు. నాన్నగారి ఇంటికి.

తపస్సు చేస్తున్నట్లు, సమాధిలో వున్నట్లు పడుకుని వున్నారు.

ఒక 'గ్రేట్ సోల్' వెళ్ళిపోయింది.

ఈ జగత్తులో శూన్యమే మిగిలినట్లయింది.

అమ్మ ముఖం చూడటానికి ధైర్యం చాలలేదు. అసలు ఆమెవైపు తిరగటానికే భయంవేసింది.

మనుషులు వస్తున్నారు. వెడుతున్నారు. ఏమేమో తతంగం జరుగుతోంది.

చివరకు

నాన్నగార్ని తీసుకు వెళ్ళిపోయారు. వెంట విశ్వం కూడా వెళ్ళాడు.

నాకు తెలియదు. నేను వెక్కి వెక్కి ఏడుస్తున్నాను.

ఎప్పటికో .అమ్మదగ్గరకు వెళ్ళాను.

"అమ్మా! వెడదాం రా"

అమ్మ లేచింది.

"రా అమ్మా పోదాం"

అమ్మ కదిలింది.

ఇంటికి వచ్చేసరికి చీకటి పడిపోయింది. గదులన్నీ లైట్లు వెలిగించాను. వెలుగేదీ? బావురుమంటున్నది ఇల్లు.

అమ్మ తమ గదిలో శిలా విగ్రహంలా కూర్చుంది.

బయటకువచ్చి వసారాలో చాలాసేపు వంటరిగా నిలబడ్డాను. ఎంత ఆపుకుందామన్నా ఏడుపు వచ్చేస్తోంది.

అక్కడ వుండలేకపోయాను. మళ్ళీ లోపలకు వెళ్ళాను.

ఎప్పుడు పడుకుందో-అమ్మ మంచంమీద వాలివుంది. ముఖం గోడవైపు తిరిగివుంది.

దగ్గరకువెళ్ళి ఆమె బుజంమీద చెయ్యివేసి "అమ్మా!" అని పిలిచాను.

పలకలేదు.

"అమ్మా! అమ్మా" అని మళ్ళీ పిలిచాను. ముఖాన్ని ఇటువైపు బలవంతంగా

త్రిప్పుకున్నాను.

కళ్ళు ఎటుచూస్తున్నాయో చెప్పటం కష్టం. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆడుతున్నాయి. వళ్ళు వేడిగానే వుంది. పలకదు. మనిషిలో కదలికలేదు.

"అమ్మా! అమ్మా!!" అని ఎన్నిసార్లో పిలిచాను.

జవాబులేదు.

డాక్టర్ని పిల్చుకురావాలి. ఇంట్లో ఎవరూలేరు. ఏమయినాసరే-ఒంటరిగా వొదిలేసయినాసరే వెళ్ళి పిల్చుకురావాలి.

ఆవేశంగా పరుగులాంటి నడకతో యివతలకు వచ్చాను.

విశ్వం గేటు తీసుకుని లోపలకు వస్తున్నాడు.

"అమ్మ అమ్మ " అంటున్నాను అతన్నిచూసి వగరుస్తునన్నట్లుగా.

"ఏం జరిగింది?"

ఏదో చెప్పాను.

అతని కర్థమయింది. లోపలకు వచ్చి చూశాడు.

పరిస్థితి బోధ పడింది. "డాక్టర్ని తీసుకువస్తాను" అంటూ రివ్వున వెళ్ళిపోయాడు.

నిమిషాలు యుగాల్లా గడుస్తున్నాయి.

బయట కారాగిన చప్పుడు. విశ్వం డాక్టరుతో లోపలికి వచ్చాడు. ఆయన చాలా జాగ్రత్తగా పరీక్షచేసి గబ గబ రెండు మూడు ఇంజక్షన్లు ఇచ్చాడు.

"ఆవిడ షాక్‌లోవుంది. బయటకు కదిల్చే స్థితిలోకూడా లేదు. గ్లూకోజ్ యిక్కడే స్టార్ట్ చేస్తాను. ఇవి త్వరగా పట్రండి."

ప్రిస్క్రిప్షన్ పేపరుమీద రాసిచ్చాడు.

నేను బొమ్మలా జరిగేదంతా చూస్తున్నాను.

విశ్వం మెరుపులా వెళ్ళి కాసేపట్లో డాక్టరు రాసినవి తీసుకొచ్చాడు. డాక్టరు కొంచం అవస్థపడి అప్పటి కప్పుడు గ్లూకోజ్‌డ్రిప్ స్టార్ట్ చేశాడు.

"నేను చెయ్యవలసింది చేశాను. బాటిల్ తర్వాత బాటిల్ కంటిన్యువస్‌గా ఫ్లో కానివ్వండి. ఇదిగో ఆ బాటిల్ అయిపోగానే యిలాచేస్తే చాలు" అని ప్రొసీజర్ చూపించాడు.

ఇంకేదో మెల్లగా మాట్లాడాడు. నాకు వినబడలేదు. తర్వాత డాక్టరు వెళ్ళిపోయాడు.

మంచంమీద పాలరాతి విగ్రహంలా పడుకునివున్న అమ్మని చూస్తూ అలాగే నిలబడ్డాను. ప్రక్కన ఎవరోవచ్చి నిలబడ్డట్లయింది. విశ్వం!

అతనివైపు తిరిగి ఏడుపు గొంతుతో అన్నాను "ఈ రాత్రికి నన్ను ఒంటరిగా విడిచివెళ్ళొద్దు. ప్లీజ్."

(సశేషం)



# (7) అనుకూలవాతావరణం

వసుంధర

కథ వ్రాయాలన్న కోరిక నాకు మొట్ట మొదటిసారిగా హైస్కూల్లో ఫర్టుఫారం చదువుతున్నప్పుడు కలిగింది. మాస్కూల్లో కథలపోటీ పెట్టారు. కథలు వ్రాయడ మనేది గొప్ప విద్య అనీ—అది పుట్టుకతో అబ్బవలసినదే తప్ప మరోలా రాదనీ అభిప్రాయపడి నేనా పోటీలో పాల్గొన లేదు. అయితే ఆ పోటీలో బహుమతి రామనాధానికి రావడంతో నా అభిప్రాయాలన్నీ తలక్రిందు లయ్యాయి.

రామనాధం నా క్లాసు మాత్రమే కాదు, క్లాసులోకూడా నా పక్కనే కూర్చుంటాడు. తెలివితేటలకు మార్కులే కొలబద్ద అనుకునే పక్షంలో అతను నాకంటె తెలివైన వాడు కాదు. ఏవరేజ్ స్టూడెంటతను. తెలుగు కాంపోజిషన్ నా స్థాయిలో వ్రాయాలన్నది అతని కోరిక. నేను కవినో రచయితనో కావలసి ఉందనీ భాషను నేను వ్రాసే శైలిలో వ్రాయగలగడం ఎంతోమందికి కానీ సాధ్యపడదనీ రామనాధం నన్ను తరచుగా మెచ్చుకుంటూండేవాడు. కథల పోటీలో పాల్గొనవలసిందని రామనాధం నన్ను మరీమరీ ప్రోత్సహించాడు. అప్పుడు నేను చలించలేదు. కానీ అతనికి బహుమతి వచ్చేక మాత్రం చలించాను. రామనాధం తనకు బహుమతి వచ్చిందని గర్వపడలేదు. నేను పోటీలో పాల్గొని ఉంటే ఈ బహుమతి నాకేవచ్చి ఉండేదని, ఏ విషయంలోనైనా తను నా తర్వాతనేననీ, ఈ మాత్రం వ్రాయడం కేవలం నా సావాస ఫలితంగానేననీ అతనన్నప్పుడు-ఆ మాటల్లో అతని వినయం, సహృదయతలకు బదులుగా—నా గొప్పతనాన్ని మాత్రమే చూశాను.

రామనాధం వ్రాసిన కథ చదివాను. చాలా పేలవంగా ఉన్నట్లు తోచింది. అందులో నాకు కనిపించిన లోపాలు నిర్మొహమాటంగా రామనాధానికి చెప్పగా

అతను మారు మాట్లాడకుండా అన్నీ ఒప్పేసుకుని—"నువ్వు మంచి కథకుడివే కాదు. విమర్శకుడివికూడా"—అని మెచ్చుకున్నాడు.

నా బుర్రలో ఎన్నో కొత్త ప్లాట్లున్నాయి. అన్నింటికీ కథల రూపాలనివ్వాలనుండేది. కానీ అందుకు వీలుపడేదికాదు కారణం వేరేలేదు. నా చిన్నతనంలోనే తల్లిపోయింది. నాన్న వేరే వివాహంచేసుకున్నాడు. మా నాన్న రెండో భార్యను నేను అమ్మా అనే పిలిచేవాడిని కానీ కేవలం మా ఇద్దరిదీ భౌతికమైన అనుబంధంగా వుండిపోయేది. తను నాకు అమ్మ అనిపించేలా నా సవతితల్లి ఎన్నడూ మసలేది కాదు.

మా క్లాసు మొత్తానికి నేనే తెలివైనవాడినన్నది నిర్వివాదాంశం. స్కూల్లో నా కున్న మంచిపేరు ఈ కొత్త అమ్మకు నచ్చదు. నా చదువు సాగకుండా ఉండేందుకామె నాకు ఎన్నో పనులు చెప్పేది. చదువుకునేందుకు—ఇంటివద్ద నా కున్న సమయం అతి స్వల్పం. అందులో కొంత సమయాన్ని కథలకు వినియోగిస్తే చదువు సున్నా చుడుతుంది.

నా తెలివి తేటలతో భవిష్యత్తుకొక బంగారుబాట ఏర్పరచుకోవా లన్నది నా ఆశయం. అందుకే నాలోని కవితావేశాన్ని బైటకు రానివ్వకుండా ఎలాగో నొక్కిపట్టి హైస్కూలు చదువు పూర్తిచేశాను.

నాది చాలా దురదృష్ట జాతకమనుకుంటాను. హైస్కూలు చదువు పూర్తయ్యే సరికి—మా ఊళ్ళో కొత్తగా కాలేజీ వెలిసింది. కాలేజీ చదువులకైనా నా సవతి తల్లి బాధలు తొలగిపోతా యనుకున్నాను. మనసులో విచారిస్తూనే మా ఊరి కాలేజీలో చేరాను.

కాలేజీలో చేరాక ఇంట్లో నాకు పూర్వంమీద కాస్త స్వతంత్రం వచ్చింది. ఇంట్లో మరీ ఇదివరకటంత పని ఉండడం లేదు. అదీకాక నా కిద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లాయీ ఉన్నారు. వాళ్ళకు నేనంటే చాలా ఇష్టం. మా స్నేహమూ, ప్రేమాభిమానాలూ — నా సవతి తల్లిలో కూడా రవంత మార్పు తీసుకువచ్చాయి.

ఇంటికి పెద్ద కొడుకును నేను. చదువ బాగా వస్తోంది. మాకేమీ వేరే ఆస్తి పాస్తులు లేవు. నాన్నగారు రిటైరైపోతే ఈ సంసార భారం నాదే. అమ్మలో వచ్చే మార్పుకిదే కారణమనుకుంటాను.

నన్ను చాలా దృశ్యాలు కదిలిస్తున్నాయి. అడుక్కునే వాళ్ళను చూసినప్పుడూ, రిక్షావాళ్ళను చూసినప్పుడూ నా హృదయంలో ఏదో మూల కలుక్కుమంటుంది. ఏదోగేయంలాంటిది మెదుల్తుంది. వెంటనే వ్రాయాలనుంటుంది. కానీ నాకు చాలామంది స్నేహితులున్నారు. వాళ్ళు సృష్టించే వ్యాపకాలున్నాయి. నాకున్న కొద్ది సమయమూ వీటికే చాలడంలేదు. కథలుకానీ, గేయాలుకానీ వ్రాయాలంటే కాలేజీలోకూడా మధ్య మధ్య తీరుబడి వస్తూంటుంది కానీ ఆ సమయాల్లోఎక్కడో మూల కూర్చుని వ్రాసుకోడానికి బదులు-స్నేహితులమధ్య చర్చలు జరపాలని ఉండేది. ఆ చర్చలు చాలా మజాగా ఉంటాయి. వాటిలో మేష్టర్లుంటారు, ఆడపిల్లలుంటారు, సినిమాలుంటాయి-ఇంకా






ఏవేవో ఉంటాయి. ఈ చర్చల ఆకర్షణలో- రచనలు చేయాలన్న ఆవేశం మరుగున పడిపోయింది.

మా కాలేజీకి ఫస్టుగా బీయస్సీ ప్యాసయ్యాను. నా తర్వాత చదువుగురించి చర్చ వచ్చింది. ఏదో ఉద్యోగం చూడమంది అమ్మ. నాన్నమాత్రం కష్టపడైనా సరే ఎమ్మెస్సీ చదవాలన్నాడు. దానిమీద ఇంట్లో వాగ్వివాదాలు జరిగాయి. ఏదేమైనా నేను మాత్రం చిట్టచివరకు పై చదువులపేరుతో- విశాఖపట్నం చేరుకోగలిగాను.

రెండంటే రెండు సంవత్సరాలు కష్టపడితే చాలు—నా భవిష్యత్తుకు బంగారు బాట పడుతుంది. అందుకే నేను నాలోని కవితావేశాన్ని జోకొట్టి వాల్తేర్లో రెండు సంవత్సరాలు అహోరాత్రులుశ్రమించాను. ఫలితంగా నా సబ్జక్టులో యూనివర్సిటీకి ఫస్టువచ్చాను.

ఇప్పుడు ఇంట్లో మాత్రమే కాక బయట కూడా నా స్థానం పెరిగింది. నాకు వెతుక్కుంటూ పెళ్ళి సంబంధాలు రాసాగాయి. పెళ్ళిళ్ళ బజారులో నాన్న నా రేటుని చాలా పెంచేశాడు. మా అమ్మకూడా నా మీద ఆప్యాయత కురిపిస్తోంది. నాన్నగారు రిటైరు కావడానికింకా రెండు సంవత్సరాల వ్యవధి మాత్రమే వుంది.

ప్రొఫెసరుగారి ప్రోద్బలంమీద నేను ఉద్యోగ ప్రయత్నాలు వదిలి—రీసెర్చిలో జేరాల్సొచ్చింది. నెలకు మూడువందల రూపాయల స్కాలర్‌షిప్. అందులో వందరూపాయలు నాన్నకు పంపించేవాడిని. పీ హెచ్ డీ త్వరగా పూర్తి చేసుకుని ఉద్యోగం చేపట్టవలసిన బాధ్యత నాకున్నదని తెలుసును కాబట్టి రీసెర్చి

ఆడుతూ పాడుతూ చేయలేదు. మిగతా వారెవ్వరూ కష్టపడని విధంగా కష్టపడ్డాను. అందువల్ల రెండు సంవత్సరాల్లోనే నా వర్క్ యించుమించు పూర్తయి పోయింది. అప్పుడు నా సీనియర్ ఒకతను థీసిస్ రాస్తున్నాడు. అందువల్ల ప్రొఫె సరుగారతని విషయం చూస్తూ చాలా బిజీగావున్నారు. ఈ కారణంగా నాకు కాస్త తీరుబడి వచ్చింది. రచనలు చేయ డానికి చాలా మంచి అవకాశం. కానీ మళ్ళీ ఆటంకం వచ్చింది. నాకు పెళ్ళ యింది.

కుసుమ నా జీవితంలోకి ప్రవేశిస్తూనే ఆవేశాన్ని తీసుకువచ్చింది. అయితే అది కవితావేశం కాదు. ప్రణయావేశం. కొన్ని నెలల పాటు నేను ప్రపంచాన్ని మరచి పోయి ఆమెతో విహరించాను. రచనలు చేస్తే సమయం వృధా అయిపోతుందని - క్షణం కూడా వృధా కాకుండా కుసుమతో గడపాలని నాకుండేది.

కుసుమ మైకంలో నేనింకా చాలా కాలం వుండాల్సి వచ్చేది కానీ పరిస్థితులు కుదరనివ్వలేదు. నా సరదాలకు నా రీసెర్చి స్కాలర్‌షిప్ చాలకపోవడం. ఇంటి బాధ్యతలు నాన్న రిటైరు కావడం మూలంగా పెరగడం అటుంచితే— నా స్కాలర్‌షిప్ గడువు పూర్తి కావ స్తోంది. థీసిస్ గురించి కనీసం వెయ్యి రూపాయలు ఖర్చుచేయాల్సివుంది. నావద్ద ఏమీ మిల్వలేదు. స్కాలర్‌షిప్ అయిపోతే ఏమి చేయాలో నాకు తోచడం లేదు. ఈనగాచి నక్కల పాల్చేయడం నాకిష్టం లేదు. ఎలాగో థీసిస్ సబ్మిట్ చేయాలి.

అదే సమయంలో నా ప్రొఫెసర్‌గారికి ఆరునెల్ల ఫారిన్ ఛాన్సు వచ్చింది. తిరిగి వచ్చేకగానీ నా థీసిస్ చూడడం వీలుపడ దన్నారాయన.

వెంటనే ఉద్యోగ ప్రయత్నాలుమొదలు పెట్టాను. నెలకు నాలుగువందల జీతం మీద ప్రైవేట్ కాలేజీలో వుద్యోగం దొరి కింది. ఖర్చు రోజుల్లో నా స్థాయి మనిషికి ఆ డబ్బు చాలదు. సంఘంలో నాకు హోదావుంది. కొత్తగా పెళ్ళయినవాణ్ణి. ఇంటి బాధ్యతలు. ఇవన్నీ కాక థీసిస్ గురించి డబ్బు నిలవేయాలి. పెళ్ళికి వచ్చిన కట్నం—పెళ్ళి ఖర్చులు పోగా— మిగిలినది నాన్న తీసేసుకున్నాడు. ఆయన కేవేవో ఖర్చుబడడం సహజం కదా!

అసలైన కష్టకాలం నాకు మొద లయింది. పైకి డాబుగా రోజులెలా గడి పానో నాకే తెలియదు. నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్న భార్య నాగురించి కోరి కలు చంపుకుంటూంటే నాకది రంపపు కోతగా ఉండేది. ఉద్యోగం చేస్తూండగా వరుసగా రచనలు చేయవచ్చునని ఆశిం చిన నాకు బాగా ఆశాభంగమైంది.

కోర్కెలను చంపుకోవడంలో ఉన్న బాధ నాకు తెలిసింది. పేదవాళ్ళ కష్టాలకు అర్థం నాకు తెలిసింది. మధ్యతరగతి వాళ్ళ అసలు స్వరూపం కూడా నాకు తెలి సింది. ఇవన్నీ కలసి నాలో కొత్త భావాలు కొత్త ఊహలు కలిగిస్తూంటే—రకరకాల రచనలు చేయాలని నాకు అనిపించింది.

కానీ కష్టాలు నన్ను బాధిస్తున్నంత కాలమూ — వాటి నెలా నివారించాలా అన్న ఆలోచనలకు వినియోగించడంతోనే




సమయం అయిపోయేది. కష్టాల గురించి రచనలు చేయడానికి నాకు వ్యవధిలేదు.

నాది దురదృష్ట జాతకమే ఏమో - నా కష్టాలకు పెరుగుదలే కానీ, తరుగుతున్నట్లు లేదు. కుసుమ గర్భవతయింది. చెల్లెలు పెద్ద మనిషయింది. తమ్ముడు కాలేజీ చదువుల కొచ్చాడు. వీటిమధ్యనే నా థీసిస్ కూడా సబ్మిట్ చేయాల్సి వచ్చింది.

అన్నీ ఖర్చులే. అన్నింటికీ డబ్బు కావాలి. అప్పుడప్పుడు ఆత్మహత్య చేసుకోవాలనిపించేది. కానీ జీవితం మీద నాకింకా చాలా ఆశవుంది. ఆ ఆశ ఆత్మహత్య ప్రయత్నాల నాపు చేయించింది. అదీ మంచిదే అయింది.

సుమారు రెండు సంవత్సరాలు అన్ని కష్టాలూ పడ్డాక నానొక కంపెనీలో నెలకు పదిహేనొందల రూపాయల మీద ఉద్యోగం దొరికింది. ఉద్యోగం చాలా సుఖమైనది. కంపెనీ తయారు చేసే వస్తువుల క్వాలిటీ కంట్రోలు చూడాలి. కానీ నాకు నేనై స్వయంగా చేయవలసినదేమీ లేదు. రకరకాల టెస్టులు చేశాక టెస్టు రిపోర్టు నా దగ్గరకు వస్తుంది. అది సరైనదేనని నేను సర్టిఫై చేయాలి. కంపెనీవారికి నా అర్హతలే కానీ సమర్థత అవసరంలేదు. ఏమైతే నా కెందుకు? నాక్కావలసింది డబ్బు.

రెండు మూడు సంవత్సరాలలో నాకు సంబంధించిన అన్నీ కష్టాలూ తీరిపోయాయి. ఇప్పుడు ఏటా కంపెనీ వారిచ్చే బోనసు డబ్బుతో లగ్జరీ అయిటమ్సు కొనాలని నేనూ కుసుమా ప్లాన్సు వేస్తున్నాం. అప్పుడే వాయిదాల పద్ధతిమీద రిఫ్రిజరేటర్ కూడా కొనేశాం.

చెల్లెలికి పెళ్ళయింది. ఆ పెళ్ళికొక్కావల

# వెంకన్నకు వెన్ను పొంగింది

ఒక మారుమూల ఊళ్లో కాడెద్దుల వెంకన్న పాతకాలానికి చెందిన రైతు. వున్న నాలుగెకరాలు తరీభూమే అయినా "పిట్టని కొట్టా పొయిలో పెట్టా" అన్నట్టుగా సాగుతూంది జీవితం. ఊరు ఊరంతా ట్రాక్టర్లు, ఎరువులు మేలురకం విత్తనాలు—అంటూ కోడై కూస్తూన్నా తాను మాత్రం మడి గట్టుకుని తాతల నాటి పాతకాలపు వ్యవసాయాన్ని వదలక పోవటాన కాడెద్దుల వెంకన్న అని నలుగురూ గేలిచేశారు. వెంకన్నకు ఉక్రోషం వచ్చి, స్వయంగా వెళ్ళి ఆధునిక పనిముట్లు, ఎక్కువ పంట ఇచ్చే వరివంగడాలు మొదలైన విషయాలు తెలుసుకొచ్చాడు.

తనకు ట్రాక్టరు అద్దెకిచ్చారు.

దున్నుకోను అప్పు యిచ్చారు.

సబ్సిడీ రేటుకు ఎరువులు ఇచ్చారు.

తన భూమి పరీక్షించి అధికంగా దిగుబడి వచ్చే విత్తనాలు ఇచ్చారు. ఆ యేడు ఎప్పుడూ లేనంత ఎక్కువగా—5 రెట్లు పంట వచ్చింది.

వెంకన్న వెన్ను పొంగింది.

వెంకన్న నిన్నటిదాకా మట్టి మనిషి. ఇప్పుడు బంగారం పండిస్తున్నాడు.

—: o :—

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ
డైరెక్టరుచే ప్రకటితము.

10/77-78

పిన డబ్బు కంపెనీ నాకు అప్పుగా ఇచ్చి ప్రతినెలా నా జీతంలోంచి వందరూపాయలు చొప్పున కట్ చేసుకుంటోంది. ఒక తమ్ముడి చదువు పూర్తి కావస్తోంది.

జీవితం హాయిగా వుంది నాకు. భవిష్యత్తు బంగారులా అనిపిస్తోంది.

ఆఫీసులో నాకో ఎయిర్ కండిషన్డ్ రూముంది. రోజల్లా అందులోనే కూర్చుంటాను. నాకున్న పని చాలా తక్కువ. గవర్నమెంటుద్యోగం కంటె కూడా సుఖంగా వుంది నాకు.

ఇప్పుడు కథలు రాయడానికీ, రచనలు చేయడానికీ కావలసినంత తీరుబడి నాకు. ఆఫీసులో ఎయిర్ కండిషన్డ్ రూములలో కూర్చుని నాకున్న తీరుబడిని రచనలుగా మార్చడం మొదలుపెట్టాను.

చిన్నతనంలో రామనాధం నా గురించి అభిప్రాయం పడినది నిజమే— అచిరకాలంలోనే నేనొక మహా రచయితగా పేరు పొందాను. నా రచనల్లో కనబడే వాస్తవికత, శైలిలో కనబడే బలం. చాలా మందిని ఆకర్షించాయి. పేదప్రజల ఆకలి మంటలు, గొప్పవాళ్ళ దౌర్జన్యాలు, మధ్యతరగతి వారి త్రిశంకుస్వర్గం—ఇవీ నా రచనల్లోని ముఖ్యాంశాలు. ఎప్పుడో ఒక రోజున మహత్తర ప్రజాశక్తి దుష్టశక్తుల పైన తిరగబడి—సర్వమానవ సౌభ్రాతృత్వాన్నీ, సమానత్వాన్నీ తీసుకురాగలదన్న ఆశాభావం నా రచనల్లో వ్యక్తమవుతుంది. అందుకవసరమైన ప్రోత్సాహం వాళ్ళకు సరఫరా చేస్తుంది.

నా రచనలకు ఎంత పేరొచ్చిందంటే—

ఒక ప్రముఖ పత్రిక ఒక ప్రత్యేక సంచికకుగానూ నా గేయాన్ని కోరింది. ఆఫీసులో వ్రాయడం మొదలుపెట్టాను. మండు టెండలో మలమల మాడే మానవుడా ఓ మానవుడా-నిండని కడుపుతో గిలగిల లాడే శ్రామికుడా ఓ శ్రామికుడా—ఎండుటాకులా.

నా రచన హఠాత్తుగా ఆగిపోయింది. కారణం వేరే ఏమీ లేదు. కరెంట్ ఫెయిలై గదిలో దీపం ఆరిపోయింది. అంతే అయితే గేయం వెంటనే వ్రాయగలిగి వుండేవాడినేమో-కానీ కరెంట్ ఫెయిల్ కావడానికి—ఎయిర్ కండిషనర్ లోపల ఏదో షార్టవడం కారణం కావడంతో — అది రెండు రోజుల వరకూ బాగుపడక పోవడంతో నేను రెండు రోజులవరకూ ఆ రచన జోలికి వెళ్ళలేకపోయాను.

## రచనా - లహరి

(శిక్షణా కేంద్రం)

నిర్వాహణ : మేఘశ్యామ్&రాధారాణి

కథలూ_నవలలూ వ్రాయటం ఎలా? ఈ అంశంపై ఆరు నెలల పోస్టలు ట్యూషను ద్వారా అందరికీ సులభంగా అర్థమయ్యే పద్ధతిలో కోర్సు రూపొందించబడింది.

ఉత్సాహవంతులైన సాహితీ ప్రియులు తమకు కావలసిన యితర వివరములకు స్వంత చిరునామా గల కవరు (125 పైసలు) జతపరుస్తూ వెంటనే వ్రాయండి.

మేఘశ్యామ్
8_8/6 శ్రీబాలాజీ సదన్,
ఖమ్మం,

ఎయిర్ కండిషనర్ బాగుపడ్డాక— గేయం పూర్తి చేశాక — నా శ్రీమతికి చూపించాను. అది చదివి కుసుమ భయపడింది. మీ రక్తం పీలుస్తూన్న నల్లుల్ని వెతికివెతికి కాలరాచి, మీ రక్తం పీల్చూస్తూన్న దోమల్ని చేయివేసి నలిపివేసి. మీ రక్తం పీలుస్తూన్న జలగల రక్తాన్నే కళ్ళజూసి .

ఈ వాక్యాలకే కుసుమ బెదిరిపోయి "ఎందుకండీ ఈ రెచ్చగొట్టే కవిత్వం . ." అంది కుసుమ.

నేను నవ్వి — "భయపడకు. ఈ కవిత్వం విని రెచ్చిపోయి విప్లవం తీసుకు రావడానికి అన్నార్తులకి తీరుబడిలేదు. ఈలాంటి కవిత్వం వ్రాయడానికి-నాకున్న లాంటి సదుపాయాలుంటే కానీ కుదరదు. ఈ సదుపాయాలుండి ఈ కవిత్వం వ్రాసే వారివల్ల ఎవరికీ ప్రమాదమూ లేదు. ఇలా వ్రాయడంల్ల నాకేమో పేరు వస్తుంది. ఈ అనార్తులకీ, పీడితవర్గానికీ—నాబోటి గాళ్ళే నాయకులు. నాకు సంబంధించినంత వరకూ వాళ్ళు కేవలం నా కథావస్తువులు. అంతకుమించి వారిమీద నాకాసక్తిలేదు. అలాగే మరికొంత మందికి వారి వ్యథలే జీవనోపాధి.—ఇదీ సంగతి-" అన్నాను.

కుసుమ కర్థమైందో లేదో తెలియదు కానీ సంవత్సరాలు గడిచిపోతున్నా నా కథావస్తువులలా మార్పు లేకుండానే ఉంటున్నారు. నా రచనల్లో మాత్రం నానాటికీ కొత్తదనం వెల్లివిరుస్తోంది!



# ఇవిగో కన్నీళ్లు దోసిళ్లు పట్టండి!

జీవంపోసిన దేవుడు, మళ్ళా ఆ జీవాన్ని లాక్కుపోయేవరకూ ఈ మధ్యకాలంలో మనిషిపొందే ఆశలూ, ఆరాటాలు, అనుభవాలూ, అనుభూతులూ అన్నిటినీ కలబోసి చూసుకుంటే, దానినే జీవితం అంటారని మొన్న నాతో ఒక స్నేహితుడు చెప్పాడు. నిజమోనేమో. జీవితాన్ని గూర్చి చాలామంది రచయితలు, రచయిత్రులూ రకరకాలుగాపోల్చి నిర్వచించారు. ఒకరు (జీవితం భయంకరమైనదని భావించి వుంటారు) జీవితం అంటే ఒక సాగరం అని, ఉప్పొంగే కెరటాలే కష్టాలు(సుఖాలకూడా అవేరూపాలేమో) అని అంటే, మరొకరు (జీవితంలో నైరాశ్యం, వైరాగ్యం పొంది వుంటారు) జీవితం అంటే ఒక ఎడారి అని, ఆశలు ఎండమావులని, తుఫానులు కష్టాలని, అక్కడక్కడా ఎదురయ్యే ఒయాసిస్సులే, అప్పుడప్పుడూ కలిగే ఆనందాలు అనీ చెప్పారు. మరి ఇంకొకరేమో (జీవితం అంటే ఆది, అంతం, అర్థం ఇవేమీ తెలిసి వుండకపోవచ్చు వాళ్ళకి. అందుకే ఆశగా) జీవితం అంటే ఒక పయనం. ఎక్కడికో, ఎందుకో, అలా నిరంతరం సాగిపోతూ, మజిలీలు చేసుకుంటూ చివరికి ఏదో గమ్యం చేరుకుంటాం అంటూ వ్యాఖ్యానించారు.

ఎవరు ఎలా చెప్పినా మొత్తానికి (అన్నిటి అర్థం) జీవితం అంటే ఒకటే. మా స్నేహితుడు చెప్పాడన్నానుగా. అదే చాలా సింపుల్ నిర్వచనం. ఏది ఏమయినా, జీవితం అంటే ఏమిటి అన్నది కాదు మనకు కావల్సింది. ఈ జీవితం సాగించటం ఎలా? అన్నది ప్రతిమనిషీ తనను తాను ప్రతిక్షణం వేసుకోవాల్సిన ప్రశ్న. నిజానికి కొందరికి ఆ ప్రశ్న వేసుకోవాల్సిన అవసరం రాకపోవచ్చు. కాని, కొందరికి మాత్రం అది జవాబులేని ప్రశ్నగా రూపొందుతుంది అనటంలో ఆశ్చర్యంగాని, హాస్యాస్పదంగాని లేదు.

జీవితం సాగించటం ఎలా? అన్న ప్రశ్నకి ఈ రచయితలు సమాధానం చెప్పరు. కారణం, దానికి బోలెడు దార్లున్నాయి అంటారు. ఒక బిజినెస్ చేయొచ్చు. బ్లాక్ మార్కెటింగ్ చేయొచ్చు. నోరుంటే ఎదుటివాణ్ణి మింగేయొచ్చు.

---

'యిందన'

ఏమీ చేతగాకపోతే అణా, పైసా అడు క్కుని తిని బ్రతకొచ్చు. 'బ్రతకటానికి దార్లు లేకపోవటం ఏమిటోయ్' అంటారు. కాని, ఒక్క విషయం. బ్రతకటానికి ఏదో దారి వున్నంతమాత్రాన అందరికీ బ్రతికేయడం సాధ్యమా? అసలు బ్రతక టానికి ఆ దార్లు సరిపోతాయా? ఉహుం. కాదు. ఎన్నటికీ కానేరదు.

ఏవో దార్లు వెతుక్కుంటూ, ఎలాగో పొట్ట నింపుకుంటాం. అయినా ఈ పొట్ట నింపుకోవటం దేనికి? బ్రతకటానికా? బ్రతకటానికి తినటం. తినటానికి బ్రత కటం. ఇదేనా జీవితం? ఇంతేనా జీవితం? ఉహుం కాదు.

ప్రతి మనిషికీ ఆ ఆశ, ఆరాటం, జీవించాలని కోరిక వుండవా? వుంటాయి తప్పకుండా. మరయితే కొందరు ఉరేసు కొని, విషం మింగి చస్తుంటారు ఎందు కని? వాళ్ళకు ఆ కోర్కెలు లేకనా? ఉహు కాదు. వాళ్లల్లో ఉన్న కోరికలు కొందరు చంపేస్తారు. కాని వారు చంపుకోరు. ఆ ఆశలు చచ్చిపోయాక ఇక మనిషే చచ్చి పోతాడు. అంతే కాని . కాని .నేనూ అదే పరిస్థితుల్లో ఈ సంఘం .... సాంప్రదాయాలు ఈ మనుషులూ అందరూ. . నా ఆశల్ని, మనసుని నిలు వునా ఊనీ చేశారు. అయినా నేను ఎందుకో బ్రతికి వున్నాను. అంటే అంటే . నేను నాకీ .అర్ధంకాని ... విచిత్రావస్థలో నేను ఉహు . కాదు... కాదు...మరోసారి...మరో కందుకూరి .. లాంటి మహనీయుడుద్భవించి . మృతి చెందిన మా బ్రతుకుల్లో..ఇంత అమృతం చిలకరిస్తాడని వెర్రి ఆశ. పిచ్చి వూహ. అర్ధరహిత భ్రమ. వ్యర్ధనిరీక్షణ.

కోరికలు అంటే ఏమిటి? అవి ఎలా వుద్భవిస్తాయి? వూహ వచ్చినప్పట్నుండి మనిషిలో తనచుట్టూ, తనకంటె మనోహ రంగా. మనోజ్ఞంగా వున్న వస్తువులు చూసినప్పుడు, వాటిని తన స్వాధీనం కావాలనే స్వార్ధం మొలకెత్తుతుంది ఇదే ఆశ. ఇవే కోర్కెలు, మనిషిలో కోర్కె లుద్భవించటం తప్పుకాదు. ఆ కోర్కెలు నెరవేర్చుకోవటానికి ప్రయత్నించటం కూడా తప్పుకాదు. కాని, అలాంటి కోర్కెలు తమ ఒక్కరికే ఉంటాయనుకో వటం ఎదుటి మనిషికికూడా ఉంటాయని ఆలోచించకపోవటం, అదే మనుష్లో పెద్ద తప్పు. రక్తమాంసాలతో, విజ్ఞానం' వివేకంతో ఉదయించిన ప్రతిమనిషికి కోర్కెలు తనకు తెలియకుండానే పుట్టు కొస్తాయి. నాకూ అలాగే కొన్ని కోర్కెలు ఉన్నాయి. అవి ఏమిటి అని మీరు అడక పోవటం నాకు బాధనిపించటం లేదు. కాని, నీకూ వున్నాయా అని ఆశ్చర్యంగా చూస్తుంటే...

అక్కడే, అప్పుడే నాకు కోపం, ఆవేశం, ఏడ్పు, నిరాశ అన్నీ కలిసి పొంగుకు వస్తాయి. నాలో ఉన్నవి చాలా చిన్న కోరికలు. ప్రతివ్యక్తీ కోరుకునే కనీసపుకోర్కెలు. అయినా అవి నాపాలిట గగనకుసుమాలు కావటం ఆశ్చర్యకరం కాదు. బాధాకరం.

నాకు ఉదయాన్నే లేచి చల్లగాలిలో తిరిగిరావాలని వుంటూంది. కాని నేను పది గంటల ప్రొద్దెక్కేవరకూ లేవరాదు.

ఎందుకు లేవరాదు అన్న ప్రశ్నకు జవాబు నాకు రాలేదుగాని, లేస్తే ఏమవుతుందో మాత్రం తెల్సింది. నేను ముందుగా లేస్తే నాకంటె వెనుక నిద్రలేచినవాళ్ళు నా మొహం చూడరు. చూడకూడదు. ఖర్మ కాలి చూశారంటే వాళ్ళకు ఏదో అఘాయిత్యం అవుతుందని తిడతారు. నిజానికి వాళ్ళకు ఏమీకాదు. నాకే అభిమానం చచ్చిపోతూ వుంటుంది వాళ్ళ తిట్ల వర్షానికి.

వాళ్ళు నా మొహాన్నిచూసి ఎందుకలా తిడతారన్న ప్రశ్నకు జవాబు శూన్యం. కాని, అద్దంలో చూసుకుంటే కనిపిస్తుంది నాలోని లోపం. పసిమిఛాయలు మెరిసే పసుపుపూతలోలేవు నా ముఖారవిందంలో కలువల వన్నెలు గూర్చే కాటుకరేఖలు లేవు నా కనుకొనల్లో. సింధూరపు సౌందర్యాన్ని ఇనుమడింపజేసే కుంకుమ బొట్టులేదు నా నుదుట్లో.

ఆ రూపులు దిద్దుకోవాలన్న కాంక్ష, శ్రద్ధ వున్నాయి నాలో. కాని వాటిని ధరించకూడదని ఈ మనుషులు పెట్టే హద్దూ, ఆరడీ నా చుట్టూ తిరిగిసీ. నన్ను కళావిహీనం చేస్తుంటే నేనేం చెయ్యను?

పట్టు చీరలు గరగరలాడించుకుంటూ, తిరగాలని వుంటుంది నాకు. అయినా తెల్ల ముతకచీరలే చుట్టబెడుతున్నారే.

కారం, కారంగా, వెచ్చ వెచ్చగా, మసాలా గారెలు తినాలని నోరూరుతుంది నాకు. కాని, చప్పిడి మాత్రమే నా నోట కుక్కుతున్నారే.

చెంగు, చెంగున లేడిపిల్లలా ఇళ్ళన్నీ తిరిగి రావాలని వుంది. కాని, నాలుగ్గోడల మధ్య కూలద్రోసి, తలుపులు వేస్తున్నారే.

నా చుట్టూ ఈ విపరీతాలు, ఈ హద్దులు ఈ కత్తులబోన్లు, ఈ కాపలాలు. ఈ కసాయి పనులు ఎందుకు? ఇవన్నీ నాకే పరిమితమా? నాలాంటి ఆడాళ్ళందరికీ ఇలాంటి జీవితమేనా? ఉహూ కాదు. అందరి ఆడాళ్ళకీ కాకపోయినా, నా లాంటి ఆడ వాళ్ళందరికీ ఇదే జీవితం అని నాకు తెల్సింది. నాకు ఈ శిక్షేమిటి? అంటే నా ఖర్మ కాలిందన్నారు. అలా అని నేను సరిపెట్టుకోలేను. ఇది దేవుడు చేసిన ఘోరం అన్నారు. కాదని ఇది మనుషులు చేసిన కిరాతకమేనని నాకు ప్రత్యక్షంగా ఋజువవుతోంది.

పెళ్ళాం చచ్చిన మగాడి చుట్టూ లేని హద్దులూ షరతులూ మొగుడు చచ్చిన ఆడవాళ్ళకి మాత్రం ఉన్నాయి. భర్తృహీన అయిన ఆడదానికిలేని మళ్ళీ పెళ్ళిహక్కు మగాడికి మాత్రం వుంది. అది విచిత్రం కాదు, అన్యాయం. మగాడిలోని అడ్డదార్లు త్రొక్కిన స్వార్థానికి గుర్తు సమాజంలోని పక్షపాతానికి నిదర్శనం.

నా బ్రతుకు నా ఆశలు చచ్చిపోయినందుకు నేను బాధపడటం లేదండీ. కాని ఈ దేశంలో ఒక ఆడదానిగా పుట్టినందుకు మాత్రం కుమిలిపోతున్నాను. ఈ దేశం నాది అని చెప్పుకోవటానికి సిగ్గుపడుతున్నాను. పవిత్రమైనది భారత దేశం అన్న గొంతు విని, వాస్తవంగా కనిపిస్తోన్న ఈ కల్మషం, పతనం చూసి నివ్వెరపోతున్నాను. ఈ దేశంలోని స్త్రీని దేవతగా ఆరాధిస్తారని చెప్పుకుంటూ వెన్ను విరుచుకు తిరుగుతారు మీరు. కాని

ఈ దేశంలో ఒక ఆడదాని కన్నీటితో కడుపు నింపుకుంటున్నాం అన్న గుజులు మీ గుండెల్లో ఏ మూలనో రగలక పోతుందా?

ఆడది అబల అశక్తురాలు అని మీరు అనుకుంటారు. మీరిచ్చే బిరుదులకి, మీరు చేసే సన్మానాలకి మురిసిపోయి అమాయికంగా మీ చేతుల్లో బానిసై పోయి. మీ కాళ్ళక్రింద నలిగిపోతుంది అని మీరు భావిస్తున్నారు. కాని నిజం అది కాదండీ. ఈ దేశంలో మీ యింటి ఆడపడుచులుగా పుట్టినందుకు మీ పేరు నిలబెట్టేందుకు, మా బ్రతుకులు బలిచేసుకొని త్యాగార్పణం చేస్తున్నాం అని మీరు గమనిస్తున్నారా. మూడునాళ్ళ ముచ్చట కోసం మీరింత పక్షపాతవైఖరిని అనుసరించినా, మేము మీలో పరివర్తన రాకపోదు అన్న ఆశతో సహనంతో నిరీక్షిస్తున్నాం వున్న విషయం మీరు గుర్తించగలుగుతున్నారా. లేదు... లేదు... లేదు. మీలో మనసు వుందని . వివేక జ్ఞానం వుందని. ఆడవాళ్ళ చేత తిరుగుబాటు చేయించుకున్న అపఖ్యాతి ఆపాదించుకోరని మేము అనుకుంటున్నాం.

ఓ శాస్త్రవేత్తలారా! మీ చూపులు క్రిందికి దించండి. మీ చుట్టూ మనుషుల బ్రతుకులు సరిచేయలేని మీరు ఆకాశంలో ఏదో ఘనకార్యం సాధిస్తారా?ఎవరికోసం?

ఓ రచయితలారా! మీ జీవిత సమస్యలకు పరిష్కృతి చేసుకోలేని మీరు. ఇంకా ఎన్నో కథలల్లి ఉద్ధరిస్తారా? ఎందుకోసం?

ఓ వనితల్లారా! అన్నిరంగాల్లో ఉరుకుతున్నామని, మీలో మీరే సమస్యలు సృష్టించుకొని ఎంతకాలమిలా సతమతమవుతారు? ఎవరో విసిరిన ఈ బ్రతుకుల్లోని ముళ్ళకంచెలు ఎత్తి పారబోసేందుకు, ప్రతి ఒక్కరూ నడుము కట్టి ముందుకు దుమకండి. మొగుడు తెచ్చి పడేస్తే మీరు వండి వార్చిపెడితే . ఇదేనా మీ జీవిత పరమార్థం... ఇందుకేనా మీరు బ్రతికేది. కాదు .మీలో నిద్రించే చైతన్యాన్ని మేల్కొలిపి, చరిత్రలో ఆడదాన్ని కూడా సువర్ణాక్షరాలతో లిఖించండి అప్పుడే ఆడదీ ఒక మనిషేనన్న గుర్తింపు.

ఏమిటో ఆవేశంతో ఈ నాలుగ్గోడల మధ్య కూర్చుని ఈ బంధిఖానా జీవితంలో విముక్తి లేక ఇలా గొంతు చించుకుంటానేగాని, ఈ నా గోడు వినిపించుకునే నాధుడు ఎవడు? ఉన్నాడు... ఒక్కడే ఒకడు.... అతడే . అతడే కందుకూరి.... కాని కాని ... ఈ నాడు లేడు... అయినా మరోసారి వస్తాడు. నిజం. తన దేశం ఎలా కుళ్ళిపోతోందో ఆతడికి తెల్సు. ఆ దేవుడితో దెబ్బలాడి మళ్ళీ వస్తాడు. మా బ్రతుకుల్లో అమృతం చిలకరిస్తాడు. అదే ఆశతో...ఒక్క ఆడదాని ఆర్తనాదం వినిపించుకోని ఈ గడ్డు సమాజంలో నా అన్న మనిషి కోసం విలపిస్తోన్న ఈ వృధా కన్నీళ్ళు ఇవిగో. కారిపోతున్నాయి దోసిళ్ళు పట్టండి?






పేద కవులకు అక్షర లక్షలూ, పేద బాలికలకు అంగాంగాభరణాలూ దానంచేసి 'కలాపోసన'లో సాటిలేని దక్షిణ నాయకుడుగా వాసికెక్కిన శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థానకవి ఎవరు? పెద్దన్నగారా? లేక తెనాలిరామలింగడా? లేక అష్టదిగ్గజాలనే ముద్దు పేరుగల ఏనుగులన్నీనా? అనే చర్చ బుర్ర లెప్పుడో పర్రలై నెత్తిమీది జుట్టూడిపోయి పిలకలు మాత్రం మిగిలిన పండిత శ్రేష్ఠులు లోగడనే ఓపిక చచ్చేదాకా ఎవరూ చదవని పత్రికా రాజాల్లో కొనసాగించి వున్నారు.

ఆ చర్చ ఫలితంగా ఏం తేలిందో నాకిప్పుడు గుర్తులేదు గానీ అప్పట్లో 'ఆస్థాన కవి' పదవి అంటూ ఒకటుండేదనీ, అది మన పవిత్ర సాంప్రదాయాల్లో ముఖ్యమైనదనీ మాత్రం అందరికీ జ్ఞాపకం వచ్చేసింది.

ఆ తర్వాత పనీపాటూలేని ఉత్సాహవంతులు కొందరు తీవ్రపరిశోధనలు కొనసాగించి "ఆదిమ కాలంలో ఆస్థాన కవులు, ఆటవిక యుగంలో ఆస్థానకవులెందరు? రాతియుగంలో ఆస్థానకవుల వైభవము" వంటి అమూల్య పరిశోధనా రచనలెన్నో వ్రాసి తెలుగువారి అజ్ఞానాన్ని పారద్రోలి చైతన్య వంతుల్ని చేసేసేరు.

ఆ తర్వాత రిటైర్డు తెలుగు మేష్టర్లనేకులు కలసి ఘనమైన ఏలినవారి వద్దకు ఊరేగింపుగా వెళ్ళి "మేమంతా పనీ పాటూ లేక గోళ్ళు గిల్లుకుంటూ, విస్తళ్ళు కుట్టుకుంటూ కాలక్షేపం చేస్తూండటం చూసి సరస్వతీదేవి కాటుక కంటినీరు చనుకట్టుమీదికి ప్రవహించి అక్కడ స్మగుల్డ్ 'బ్రా'గానీ లేదుగదా అనిపించేటంత ఘోరంగా ఏడ్చేస్తోంది. మేమేం ఆ రామలింగడికిగానీ, అష్ట ఏనుగులకు గానీ తీసిపోయే వాళ్ళమా? మాలో ఒకర్ని ఆస్థాన కవిగా వేసి మన పవిత్ర సాంప్రదాయాల్ని కొనసాగించండి. సరస్వతీదేవి ఏడుపుకూ, మా ఏడుపుకూ అడ్డుకట్టలు కట్టేసి ఆ నీళ్ళతో సాహిత్యరంగంలో బంగారు పంటలు కాకున్నా కనీసం కాగితం పంటలన్నా పండించి చరితార్థులు కండి" అని విన్నవించుకున్నారు.

ఏలినవారున్నూ ఆలోచించి "ఈ చదువుకున్న గాడిదలముందు మనం రాతి యుగపు సాహిత్య మర్యాదలు కూడా తెలీని వాళ్ళంగా బయటపడిపోవటం ఏం బాగోలేదు" అనుకున్నట్లున్నారు. అనుకుని వెంటనే "సరే! ఓ ఆస్థానకవి కావలెను" అని ప్రకటించేసేరు.

ఇప్పట్లో ఆడ ఓటర్లలాగా అప్పట్లో

తెలుగు మాష్టర్లుగా పనిచేసి రిటైరై పోయిన మహాపండితుల సంఖ్య జాస్తీగా వుండేది వారంతా ఆ పదవికోసం కుస్తీపట్టి, పట్టి అసలే ఓపిక చచ్చిన వయసు గనుక త్వరగానే చతికిలబడి పోయి రాజీకి వచ్చేసేరు.

ఫలితంగా ఎవరికైలే ఎక్కువ పళ్లూడి, కీళ్ళుసడలి, నిదానంగా పంచ రత్నాలు రాసే ఓపిక వుందో వారే ఆస్థాన కవి పదవికి అర్హులు అని తీర్మానించే సేరు. ఆ విధంగా ఇప్పటికే కొందరు ఆస్థానకవులు ఎన్నికై సకల భోగాలూ అనుభవించి, పదవిలో వుండగానే "కీర్తి" శేషులై రాజలాంఛనాలతో దహనం చేయబడి నేరుగా నన్నయ, తిక్కన, కాళిదాసాది ప్రముఖుల సన్నిధి కేగి ధన్యులై అక్కడివారికి మన ఘనత వివరించి మనల్నీ ధన్యుల్ని చేసేరు.

అదంతా గతం. పాతకాలపు పండి తుల యుగం వెళ్ళిపోయింది. ఇరవై సూత్రాల సంకీర్తనంతోనూ, అయిదు అంశాల భజనల్తోనూ చైతన్యవంతమైన ఆధునిక యుగమిది. అందుకు తగ్గట్టే ఆధునికుడైన యాభై ఏళ్ళ యువ కవిని ఆస్థానకవిగా నియమించి తమ ప్రగతి శీలతను చాటారీసారి ఏలినవారు. అందుకు మనమందరం బేషరతుగా సంతోషిం చాలి.

'మీ నిజాం రాజు జన్మ జన్మాల బూజు' అని వాపోయిన దాశరధి సదరు బూజుగారి కొడుకుతో కలిసి ఇండస్ట్రీలు స్థాపించేసి దేశాన్ని పారిశ్రామికవంతం చేసేసేందుకు కంకణం కట్టుకున్న సంజ యులవారూ, వారి మాతృమూర్తి ఎమర్జ న్సీలో జరిపిన "తిమిరంతో సమరం"ను అనన్య సామాన్యంగా గానంచేసి చరితార్థు లైన మహాకవి.

"నా తెలంగాణ కోటి రతనాల వీణ" అని గానంచేసిన దాశరధిగారిప్పుడు "ముత్యాల పల్లకిరా, ఆరుకోట్ల మన ఆంధ్రప్రదేశ్" అంటూ ఆస్థానకవి హోదాలో ఆ పల్లకినెక్కి ఊరేగగల స్థాయికి ఎదిగేరు. శుభం

అలాంటపుడు "అసలు ఆస్థానకవి పదవే ఈ రోజుల్లో ఇంకా వుండటం హాస్యాస్పదం. అది ఫ్యూడల్ సాంప్ర దాయం" అని కొందరు ఆ పదవి దొరకని వాళ్ళు విమర్శించటం చాలా అన్యాయం. నిజానికి ఫ్యూడల్ వ్యవస్థలోకన్నా ప్రజాస్వామ్యంలోనే అలాంటి అవసరా లెక్కువ

అమధ్య రాజ్‌భవన్‌లో గవర్నరు గారో కవి సమ్మేళనం ఏర్పాటుచేసి కొద్ది మంది బుద్ధిమంతుల్ని పిలిచి సదరు కవుల గానం తనతోపాటు విని ఆనం దించమని ఆదేశించేరు. ఆ కొద్దిమంది బుద్ధిమంతుల్లో ఒకణ్ణయే మహద్భాగ్యం నాకూ దొరికింది

మొత్తంమీద ఓ డజనున్నరమంది మహాకవులు వేదిక నలంకరించేరు. మూడు డజన్లమంది అదృష్టవంతులం శ్రోతల స్థానాల్నలంకరించేం.

'ఏమిటి సార్! ఈ కవి సమ్మేళనం ఏ సందర్భంగా ఏర్పాటుచేశేరూ?' అని ప్రశ్నించేనో శ్రోత మిత్రుడిని. ఆయన గారు బుర్ర గోక్కుని, ఇంకెవర్నో

సంప్రదించి "గవర్నరుగారి సరదా కోసం" అని తెలవిచ్చేరు. అతని అజ్ఞానానికి చింతించాను. తర్వాత తీరిగ్గా ఓహో! మన గవర్నరుగారెంత కవితా ప్రియులు అని ఆనందించేను.

ఆ హాజరయిన కవులలో అన్ని గోత్రాలవారూ వున్నారు. మధ్యాక్కరలు, చంపకమాలలు, శార్దూలాలు గట్రారాసే వారేగాక సందర్భానుసారంగా అభ్యుదయ, విప్లవ కవితలురేసే ఘనాపాఠీలు కూడా వున్నారు. జైళ్ళలోనేగాక రాజ్ భవన్‌లో కూడా విప్లవ కవులకు స్థానం ఇవ్వగలిగిన ఏలినవారి విశాల దృక్పథానికి నేనెంతో మురిసిపోయేను.

తర్వాత గవర్నరుగారు మగ కవులకూ, వారి శ్రీమతి ఆడ కవులకూ తలోక శాలువా సమర్పించుకోగా వారున్నూ భక్తి ప్రపత్తులతో అందుకుని కవితేజం డబుల్‌గా వెలిగిపోతూండగా తలా ఓ సింహాసనంలోనూ చదికిలబడి తమవంతుకోసం ఎదురు చూడసాగేరు. శాలువాలు సమర్పించుకోవటం అయిపోగానే గవర్నరుగారి సతీమణి ఏదో అర్జెంటు పనిమీద వెళ్ళిపోయేరు.

కవులంతా ఒకరి తరువాత మరొకరు ఎమర్జన్సీ వెలుగులో దేశం సాధిస్తున్న విజయాలను గురించి పోటీలుపడి చందోబద్ధంగానో, వచన కవిత్వంలోనో సంకీర్తనం చేస్తుండగా గవర్నరుగారు తన్మయులై మాగన్నుగా వింటూ వుండిపోయేరు. శ్రోతలందమేం మాత్రం ముందు వరసలోని వాళ్ళు మినహా గుసగుస లోకాభిరామాయణంలో మునిగిపోయేం. అదంతా చూశాక నాకు గవర్నరుగారి కవితా దాహం మీద అపార గౌరవం ముంచుకు వచ్చింది. తెలుగువారు కాక పోయినా తెలుగు కవులకు శాలువాల కోసం ఎంతో డబ్బు తగలేసి పిలిపించి, వారి కవితను తెలుగు శ్రోతలకన్నా శ్రద్ధగా ఆలకిస్తున్నారే! అని.

అప్పుడే నాకు అకస్మాత్తుగా ఓ అనుమానం వచ్చింది. గవర్నరుగారికి తెలుగు వచ్చా? అని.

రాదన్నాడు సోదర శ్రోత ఒకరు వాకబుచేసి.

అప్పుడు నాకు అర్థమయింది ఆస్థాన కవి అవసరం. అప్పుడంటే ఆ పోస్టు ఖాళీగా వుండిపోయింది గానీ ఆస్థానకవే వుంటే గవర్నరుగారలా ఒంటరిగా అంత పెద్ద సోఫాలో బిక్కు బిక్కు మంటూ కూర్చోనక్కర్లేదు గదా! మన తెలుగు కవుల చైతన్య గీతాలు విని మాగన్ను లోకి జారిపోనవసరం లేకుండా ఎప్పటి కప్పుడు ఆస్థానకవిగారు సదరు కవుల గానంలోని చెణుకులు, చమత్కారాలు, ద్వంద్వాలు గట్రా గురించి చిన్న చిన్న ప్రైవేటు వుపన్యాసాలిచ్చి గవర్నరుగారిని మరింత చైతన్య వంతులను చేయొచ్చుగదా!

మరలాంటపుడు ఆస్థానకవి పదవి అనవసరం అనటం అన్యాయం కాదా? పైగా అది గవర్నర్ పదవిలా మరెవరికో కాకుండా మన తెలుగువాడికే దొరికినందుకు సంతోషించవద్దా! □

# జ్యోతివిమర్శనాసమీక్షలపైసమీక్ష

జ్యోతిపై వచ్చిన సమీక్షలలో అధిక భాగం జ్యోతిని ప్రశంసిస్తూ వచ్చినవే. అయితే తక్కువ సంఖ్యలోనే అయినా జ్యోతిపై 'విమర్శ' వున్న సమీక్షలూ వున్నాయి.

## పేరున్న రచయితలేనా?

ప్రధానమయిన విమర్శ 'మీరు పేరున్న రచయితలవే ప్రచురిస్తారా? కొత్తవారికి ప్రోత్సాహమివ్వరా?' అని. ఈ విమర్శకు సమాధానం ప్రతినెలా జ్యోతి విషయ సూచికే చెబుతుంది. కథల విషయంలోనే కాదు. కార్టూన్లు కూడా అంతే 'కొత్త వారికి ప్రోత్సాహమిచ్చే పత్రికగా' జ్యోతి ఎప్పుడూ ముందే నిలబడుతుంది.

## కథలకు బొమ్మలు అవసరమా?

'కథలకు బొమ్మలు ఎందుకు. ఆ బొమ్మల స్థానంలో మరో కథనందించ వచ్చు కదా' అన్నది ఒక సూచన కొందరు పాఠకుల దగ్గర్నుంచి-కథలకు బొమ్మలు కేవలం అలంకారంకోసమే కాదని నమ్ముతుంది జ్యోతి. కథకుడి కథనానికి, తన ప్రతిభతో, 'ఆర్టిస్ట్ పాయింట్ ఆఫ్ వ్యూ'లో చిత్రకారుడు చిత్రించే బొమ్మ కేవలం ఆ కథకు వేసే బొమ్మేకాదు ... ఆ కథాసారానికి బొమ్మ రూపంలో చిత్రకారు డందించే ప్రతిరూపం. కొన్నికథలు పాఠకుల ఆదరణ పొందని రీతిగానే కొన్ని బొమ్మలూ పాఠకుల నాకట్టుకోలేక పోవచ్చునేమోగాని ...కథకు బొమ్మలు అవసరమనే మేము భావిస్తున్నాము. అయితే 'బొమ్మలు లేకుండా ప్రచురించబడే కథలు అంత మంచివికావా మీ దృష్టిలో' అంటూ నిలదీశారో పాఠకుడు. బొమ్మ లేనందువల్ల మంచి కథ కాదని మేం వర్గీకరిస్తున్నట్లుగా భావించవద్దని మనవి. కేవలం పత్రిక పిరియాడిసిటీని దృష్టిలో పెట్టుకొని పత్రికను సకాలానికి వెలువరించే ప్రయత్నంలో బొమ్మలు వేయించే వ్యవధిలేని కారణంగా మాత్రమే కొన్ని కథలకు బొమ్మలు ఉండవు. అంతేకాని, కథలలో వర్గీకరణ చేయడం కాదది.

## వ్యాసాలేవీ?

'కథలేనా వ్యాసాలు లేవా?'—ఇది మరో విమర్శ. అప్పుడప్పుడైనా వ్యాసాలు ప్రచురించ గలుగుతున్నందుకు మేము ఆనందిస్తున్నాము. అయితే ప్రధానంగా కథల పత్రికే అయిన జ్యోతిలో ఎక్కువ వ్యాసాల నందించటం, అంతగా సాధ్యంకాదు. అవకాశమున్న మేరకు, అవసరమైన ప్రతిసారీ ఒక మంచి వ్యాసాన్ని ప్రచురించడానికి జ్యోతి వ్యతిరేకం కాదు.

## కవితలు?

'కవితల సంఖ్య మరీ తక్కువగా

వుంటోంది...కనీసం నెలకో పది పేజీలన్నా కవితలకు కేటాయించండి' ఈ సూచన కొందరు పాఠకుల దగ్గరనుంచీ వచ్చింది. పైన చెప్పినట్లుగా జ్యోతి ప్రధానంగా 'కథ'ల పత్రికగా ఉంటోంది. ఇతర అంశాలకు కొంత పరిమితికి లోబడే పేజీలు కేటాయించగలము. జ్యోతిలో కవితలు ఉంటాయి కాని ఎక్కువ పేజీలు కవితలకు కేటాయించ లేము.

ఇంకా ..మినీ కథల సంఖ్య పెంచ మని చాలామంది రాశారు. మినీ కథలు మంచివిగా లభించినప్పుడు ఎక్కువగానే ప్రచురించబడుతున్నాయి. ఈ సూచనను దృష్టిలో ఉంచుకొంటాము.

అలాగే శ్రీ శ్రీ పజిల్ బహుమతి విషయంలో కూడా.. పాఠకుల సూచనల్ననుసరించి బహుమతిని నగదు బహుమతిగా ప్రకటించి....ఆల్ కరెక్ట్ ఎంట్రీలన్నిటికీ బహుమతి సొమ్మును సమంగా పంచి ఇస్తున్నాము.

## కథల పరిశీలనలో జాప్యం!

కథల పరిశీలనలో జాప్యం జరుగుతోందని ఆరోపించారు చాలామంది రచయితలు. ఈ ఆరోపణకు సమాధానమేం చెప్పగలము? పరిశీలనలో జాప్యం జరుగుతున్న మాట కొంతవరకు నిజమే. జ్యోతికి ప్రచురణార్థం వచ్చే రచనల సంఖ్య గత సంవత్సరంగా చాలా ఎక్కువగా వుంటోంది. ఆ కారణంగా ఎంత ప్రయత్నించినా రచనల పరిశీలనలో జాప్యం జరుగుతోంది. వీలయినంత తక్కువ వ్యవధిలోనే పరిశీలన పూర్తి చేసి రచయితలకు తెలిపేందుకు ప్రయత్నిస్తాము.

## కాపీ రచనలు?

అప్పుడప్పుడూ మీ పత్రికలో కాపీ రచనలొస్తున్నాయి. అలా జరగకుండా చూడలేరా? అని నిలదీసి ప్రశ్నించారు కొందరు పాఠకులు. ఇదివరకు ఎన్నో సార్లు ఈ విషయంగా మా అభిప్రాయం చెప్పాము. ఆ కాపీలకు పాల్పడే రచయితలే ఈ సమస్యకు పరిష్కర్తలు. తెలుగులో ప్రచురితమౌతున్న అన్ని రచనలూ చదవడం ఏ సంపాదక శాఖకైనా అసాధ్యమైన విషయం. అయినా మా పరంగా-కాపీ రచనలు రాకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకొంటున్నాము. ఎప్పుడైనా అలా ప్రచురించబడ్డా ఆ విషయం పాఠకుల దృష్టికీ, రచయితల దృష్టికీ తెస్తున్నామే తప్ప—ఆ విషయాన్ని దాచేందుకు ప్రయత్నం చెయ్యడంలేదు.

జ్యోతి విమర్శనా సమీక్షలో పాల్గొన్న పాఠకులందరికీ కృతజ్ఞతలు.

జ్యోతికి విమర్శనా సమీక్షలు-సమీక్షగానే కాదు-మీకు నచ్చని అంశంపై విమర్శలు పంపవలసిందన్న ఆహ్వానం మా పాఠకులకు ఎల్లప్పుడూ ఉంటుంది.

—ఎడిటర్ జ్యోతి

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక




ఆధారాలు                    అక్టోబరు '77

## అడ్డం

1. రష్యన్ డాక్టరు
4. ఇదో అర్థాలంకారం
7. సినీమా నటుడైన రంగస్థల నటుడి ఇంటిపేరు
9. మధ్యలో ఆగమంటుంది
11. అంతరం
12. చుట్ట
14. ఇసిగొల్పులు కావు ఉసిగొల్పులు
15. కొంద (తననన)
16. లా
17. 19 కి 12
19. 17 కి 12

22. విద్యున్మాల కావడానికి
23. ఉదాహరణకు "దుర్గేశనందిని"
25. చివరకు మిగిలేది ఐశ్వర్యం
26. నిజంగా నిర్బంధమే!

నిలువు

2. ప్రవహించేది
3. పోతన భాగవతంలోనిది. పూతనకాదు
4. రంభతో ఒక ఋషి చేసింది
5. కై
6. మొగ్గల లక్షణం
8. వెనుకకు తిరుగు
10. ఇటీవలి చలనచిత్రం
11. ఒక అగ్రాన్ని కనిపెట్టినవాడు
13. అనర్థాలు (15ను తాకడానికా?)
16. దిక్కు నిప్పుతో వ్రాసిస్తుంది
18. పురుషులు ధరించరు
20. కర్మలో మకారం ఎక్కడుంది?
21. పరాయి స్త్రీ
23. "___" నడక నల్లేరుమీద
24. జాగ్రత్త! అంటుకొంటే ప్రమాదం!

సెప్టెంబరు సమాధానాలు

అడ్డం: 1. వారిజాతం, 4. సీతాకోక, 8. నక్క, 9. బుధ, 11. తటిని, 12. పాలు, 13. రామ, 14. తగడు, 16. మనవి, 18. కవ్వడి, 19. కరడు, 22. కాన, 24. దార, 25. కవట, 28. రోలు, 29. సవా, 30. రక్తపాయి, 31. పుష్కరిణి.

నిలువు: 1. వానపాము, 2. రిక్కలు, 3. తంబురా, 5. తాత, 6. కోటి, 7. కనిష్ఠుడు, 10. ధమని, 14. తవ్వ, 15. గడి, 16. మర, 17. నడు, 19. కరకర, 20. బొకారో, 21. తరవాణి, 23. నలుపు, 24. దానరి, 26. వక్త 27. టపా.

---

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి అక్టోబర్ 1 తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళుగీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీ వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్మును కలిపి అందజేయబడుతుంది.

సెప్టెంబరు పదబంధ ప్రహేళిక విజేతలు:

ఎస్. శిరీష, అవనిగడ్డ, సారథి అండ్ చక్రపాణి, అనకాపల్లి. పి. లక్ష్మి, అనంతపూర్. కె. లక్ష్మి, అమలాపురం. జి. కృష్ణమూర్తి, బాపట్ల. ఇ. రాధాదేవి, బొబ్బిలి. కె. వి. యస్. మణిశర్మ, బిలాయ్. ఎస్. టి. పి. లక్ష్మికుమార్, బొండపల్లి. ఎమ్. శ్రీనివాసజనార్ధనాచార్యులు, బ్రాహ్మణ కొట్కూరు. కడప

నుంచి, పి. ఎన్. రాజేంద్రప్రసాద్, జి. వి. బాలభారత రామమూర్తి. పి. వీరారెడ్డి, చెన్నూరు. కె. డి. కె. మూర్తి, చీరాల. పి. బాలసుబ్రహ్మణ్యం, చీరాల. డి. గీతాగాయత్రి, డెహరాడూన్. కె. గోపాలకృష్ణయ్య, డొంకరాయి. గుంటూరు నుంచి ఎన్. కిషోర్ బాబు, కె. బాలకృష్ణమూర్తి. పి. కృష్ణారెడ్డి, గద్వాల. ఎన్. రామకృష్ణయ్య, గిద్దలూరు. పి. హేమనళిని. హనుమకొండ. హైదరాబాదు నుంచి పి. మల్లిక్, ఎమ్. రాజగోపాలరావు, సి. విజయలక్ష్మి, ఎస్. శేషాచారి, పి. మురళీధర్, ఎ. వి. రమణ, ఎ. ఎస్. ప్రసాదరావు, పి. శశికళ, సి. బాలత్రిపుర సుందరి, ఎమ్. సుగుణాదేవి, టి. తాతారావు, ఏరి పూర్ణాచారి, జి. వసంతలక్ష్మి, కె. ఎల్. కామేశ్వరి, కె. గోపాలరావు, ఎ. రామమూర్తి, జె. భారతి, ఎమ్. ఎస్. రామకృష్ణ, ఎమ్. భాస్కరరావు, ఆర్. బి. శాస్త్రి, ఎమ్. జగన్నాథం, కె. అశ్వర్థనారాయణ, ఆర్. సుధాదేవి, ఎమ్.శివప్రసాదరావు. శ్రీ భాష్యం శారద, జనగామ, జైపూరునుంచి కె. వి. రమణ, ఎస్. బాలకృష్ణ, కర్నూలునుంచి జె.ఎస్. శేఖర్, ఎన్. ఎమ్. శాస్త్రి, యం. శ్యామల, ఎన్. ఎల్. ఎస్. వి. సాగర్, కోటనుంచి జి. భోగేశ్వరం, జి. లక్ష్మీకాంతం. ఎ. శ్రీదేవి, కొవ్వూరి. పి. నాగేశ్వరరావు, కొత్తగూడెం. కాకినాడనుంచి సి. జయలక్ష్మి, సి. ఎస్. ఆర్. మూర్తి, ఎ. నరసింహసాయి, ఆర్. ఎస్. ఎస్. శీతారామస్వామి. కానూరు. జె. మురళీకృష్ణ, కల్పాకం. పి. ప్రభావతి, మచిలీపట్నం, పి.వి. రామారావు, మామిళ్ళ గూడెం. మద్రానునుంచి వై. సావిత్రి, వి. గోపాలకృష్ణ. బి. ప్రకాశరావు, మర్కాల్. జె. హేమలత, మల్కాపురం. పి. సరస్వతి, మల్కిపురం. ఎమ్. సంపత్ కుమార్, మండపేట. ముట్లూరునుంచి కె. వెంకట్రావ్, టి. సాంబశివరావు. సి. హెచ్. కమలాకరశాస్త్రి, నరసారావుపేట. కస్వినర్, నగరం. నెల్లూరునుంచి ఎమ్. వి. బి. రెడ్డి, ఐ. వి. రఘురామమూర్తి. ఎ. రామునాయుడు, పాడేరు. కె. రామారావు, పూనా. పార్వతీపురంనుంచి పి. విజయలక్ష్మి, ఎమ్. నరసింహస్వామి, టి. నరసింహారావు, పందిళ్ళపల్లె. టి. చంద్రశేఖరరెడ్డి, ప్రొద్దుటూర్. వి. మధుసూదన్, పరకాల. శ్రీకాకుళంనుంచి కె. వి. ఎన్. ఆచార్య, బి. బి. ఆర్. కృష్ణమూర్తి. టి. పాండురంగశర్మ, శ్రీశైలము. బి. వెంకటేశ్వరరావు, సింహాచలం. మాదేటి కృష్ణమోహన్, తుని. కె. శ్రీలక్ష్మి, తురుమెళ్ళ. ఎమ్. జి. మురళి, తిరుపతి. విశాఖపట్నంనుంచి ఎమ్. నరసింహమూర్తి, వి. నాంచారయ్య, దయానిధి పాత్రో, ఎమ్. ఎస్. స్వామి, కె. కామేశ్వరరావు, ఎన్. ఎల్. ఎన్. రాజు, ఎన్. ప్రసాద్. విజయవాడనుంచి వి. రామకృష్ణయ్య, సి. హెచ్. కల్పన. సి. హెచ్. కృష్ణమూర్తి, వెంకటభైరిపురం. వరంగల్ నుంచి ఎన్. రామశాస్త్రి, కె.యాదగిరి. తాతిరాజు వేణుగోపాలరావు, బరహంపూర్. బి. అరుంధతి, గుంటూరు. ఎమ్. హెచ్.వి. సుబ్బారావు, గూడూరు. హైదరాబాదునుంచి డి. యోగానంద్, జి. రామకృష్ణ. కె. జగన్మోహనరావు, కాకినాడ. ఎ. ఈశ్వరప్రసాద్, సోంపేట. కె. వి. నరసింహమూర్తి, సునాబేడ. సి. హెచ్. లలిత, శ్రీకాకుళం. ఎ. శివాజీ, విశాఖపట్నం. (చివరి పదిమందికి రు. 5/- చొ॥ న పంపిస్తున్నాము.)

# పలు రంగాలలో ఆంధ్రప్రముఖులు

నష్టంతో అదీ రోజుకు లక్ష రూపాయల నష్టంతో నడుస్తున్న హిందుస్థాన్ ఫొటో ఫిల్మ్స్ సంస్థకు గౌరవాధ్యక్షుడిగా పదవి స్వీకరించి, తన అనుభవంతో, వ్యాపారాదక్షతలో ఆ సంస్థను రోజుకు దాదాపు లక్షరూపాయల లాభం గడించే స్థితికి తెచ్చిన ఘనుడు....మన తెలుగు వాడే....ఆయన పేరు ఎం. కె. రాజు.

ఫోర్డ్ మోటారు కంపెనీ ఆఫ్ఇండియా లిమిటెట్‌లో పర్చేజ్ ఏజంట్‌గా తమ కెరీర్ ప్రారంభించిన శ్రీ రాజు ఇండియా పిస్టన్స్ లిమిటెడ్‌కు మేనేజింగ్ డైరెక్టరు పదవి నిర్వహించారు—ఇప్పటి హిందూస్థాన్ ఫోటో ఫిలిమ్స్ అధ్యక్షుడు గాక ముందు. అంతేగాక ఇంకా ఈయన M. K. రాజు కన్సల్టెంట్స్ ప్రయివేట్ లిమిటెడ్‌కు అధ్యక్షుడిగానూ, ఇండియన్ ఓవర్సీస్ బాంక్, సెయిల్ ఇంటర్నేషనల్ లి., హైదరాబాద్ కార్బన్స్ అండ్ కెమికల్స్ లి. అపోలో ట్యూబ్స్ లి. టమిల్ నాడు సింథటిక్స్ & ఫైబర్స్ లి. యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్ ఇన్సూరెన్స్ లి. సంస్థలలో డైరెక్టరుగా కూడా వున్నారు.

"పనిపై నిజమైన శ్రద్ధ, పట్టుదల, క్రమశిక్షణ ఉన్నప్పుడు ఏ పని చేసినా మనిషికి అద్భుతమైన సంతృప్తి లభిస్తుంది....ఆ పనిలో విజయం సంగతి ఎలా వున్నప్పటికీ "అంటారు శ్రీరాజు తమ జీవితానుభావాన్ని వివరిస్తూ.



శ్రీ ఎం. కె. రాజు

"ఆంధ్రులు తెలివిగల వారు. చేపట్టిన కార్యాన్ని సాధించగల సమర్థత వున్న వారు. కాని దురదృష్టవశాత్తూ ఆ శక్తిని సంఘటిత పరచుకోలేక పోతున్నారు" తెలుగువాడిగా, తెలుగువారిపై శ్రీ రాజు అభిప్రాయం ఇది.

శ్రీ రాజుకు ముగ్గురు కొడుకులు, ఒక కూతురూ వున్నారు.

యువతరానికి శ్రీరాజు సలహా "అడ్డదారులున్నాయని ఆశ పడకండి. మీరెన్నుకున్న గమ్యం చేరడానికి 'కష్టించి పని చెయ్యడమే' సరైన మార్గం. దేశాభ్యున్నతికి జరపవలసిన కృషిలో 'నేను' అనికాక 'మనం' అన్న సంఘటితభావంతో ముందుకు సాగండి" అని.

—పి. సరళా సూర్యారావు

# సినిమా

## నువ్వే చెయ్యగలవ్!

మనిషి 'నేనేం చెయ్యగలనూ' అన్న భావనకు లోను కాకూడదు 'నేనెన్నో చెయ్యగలను' అన్న ఆత్మవిశ్వాసం కలిగి వుండాలి ప్రతిమనిషి సాటి మనిషికి సాయం చెయ్యడంతో-అది ధనరూపేణా మాత్రమే కానవసరం లేదు—యెనలేని సంతృప్తి ఆత్మానందమూ కలుగుతుంది సర్వ మానవాళికీ ప్రేమను పంచియిచ్చి అందరినీ అలానే చేయమని ప్రబోధించిన మానవోత్తములలో క్రీస్తుకు ముఖ్యమైన స్థానమే వుంది క్రీస్తు జీవితగాధను అనన్య సామాన్యంగా, అపూర్వంగా 'కరుణామయుడు' పేరిట రంగుల్లో చిత్రీకరిస్తోంది రాభాచిత్ర సంస్థ కరుణామయుడు క్రీస్తుగా ఆ పాత్రకు జీవం పోస్తున్న నటుడు విజయచందర్ ఈ చిత్ర నిర్మాతకూడా ఎ భీమ్‌సింగ్ (దర్శకత్వం), మోదుకూరి జాన్సన్ (మాటలు) కె యస్ ప్రసాద్ (ఫోటోగ్రఫి) దిలీప్‌సింగ్ (కళ), బి గోపాలం జోసెఫ్ (సంగీతం) క్రిష్టఫర్‌కొయిలో (కోడైరెక్టర్) పాల్‌దొరైసింగ్ (ఎడిటింగ్) —సాంకేతిక సారధులుగా వున్న ఈచిత్రంలో జగ్గయ్య, చంద్రమోహన్, శ్రీధర్, రావుగోపాలరావు, పద్మనాభం,

'అమరదీపం'లో కృష్ణంరాజు, మురళీమోహన్



ముక్కామల త్యాగరాజు గిరిబాబు మిక్కిలినేని. జగ్గారావు, సి. హెచ్. క్రిష్ణ మూర్తి. ఆనందమోహన్, కాకరాల, కొమ్మినేని శేషగిరిరావు, ధూళిపాళ, మాడా, వెన్నిరాడై నిర్మల, రాజసులోచన, జయమాలిని, అనిత, కె. విజయ, విజయలక్ష్మి, జయమాధురి మొదలైన వారు నటిస్తున్నారు. పదిరీళ్ళకు పైగా చిత్రీకరణ పూర్తయింది. ఇటీవలనే క్రీస్తును శిలువవేసే దృశ్యానికిగాను ఆరు నిమిషాలకుపైనే వచ్చేపాట ఒకటి రికార్డు చెయ్యబడింది. క్రిస్టమస్ (డిశంబర్) నాటికి విడుదలయే చిత్రమిది.

అందరిదీ ఈ చిత్రం!

కేంద్ర ప్రభుత్వంచే ప్రాంతీయ స్థాయిలో తెలుగులో ఉత్తమ చిత్రంగా

'మల్లెపూవు'లో లక్ష్మి





'సతీసావిత్రి'లో ఎన్.టి.ఆర్.

ఎన్నుకోబడింది 'ఊరుమ్మడి బ్రతుకులు' చిత్రం. రంగుల్లో నిర్మితమైన ఈచిత్రం చాల తక్కువ వ్యయంతో నిర్మించ బడటమే కాదు, తెలుగులో ఒక 'కథానిక' ఆధారంగా నిర్మించబడిన కొత్త సాంప్రదాయం నెలకొల్పింది. ఊరుమ్మడి బ్రతు



'ఖైదీ కాళిదాస్'లో శోభన్ బాబు, దీ



కులు పేరిట కథగా ప్రచురిత మయ్యా కథారచయిత పి. యస్. రావు ఆ కథన నాటకంగా మలచి విజయవంతంగా ప్ర ర్శించారు. ఈ చిత్రానికి మాటలను ఆ రచయితే సమకూర్చారు. దర్శకుడ బి. యస్. నారాయణకూ, రచయి పి. యస్. రావుకూ, నిర్మాతలకూ జ్యో అభినందనలు అందజేస్తోంది.

## కొత్త దర్శకుడు!

జ్యోతి 'తెలుగుతెరకు నూతన తరం' శీర్షికలో నటుడిగా పరిచయం చేయబడ్డ దేవదాస్ (ఓసీత కథ దేవదాస్‌గా ప్రసి ద్ధుడు) అప్పట్లోనే దర్శకత్వం చేపట్టే ఉద్దేశ్యాన్ని వ్యక్త పరచాడు. ఇప్పుడా

'నెఫ్జా' (నెల్లూరు) తరఫున సంగీత దర్శ కుడు రమేష్ నాయుడిని సత్కరిస్తున్న నెఫ్జా అధ్యక్షుడు సుందరరామి రెడ్డి

ఉద్దేశానికి క్రియారూపంగా దేవదాస్ దర్శకత్వంలో నిజంగానే ఓ తెలుగు చిత్రం వస్తోంది. ఆ చిత్రంపేరు 'నిజం'. ప్రసిద్ధ రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి నాటకం 'నిజం' ఆధారంగా నిర్మితమయ్యే ఈ చిత్రానికి జంధ్యాల మాటలు, రాఘవులు సంగీతం సమకూర్చారు. కళా భారతి ఇంటర్నేషనల్ పతాకం క్రింద యం. సుందర్ రెడ్డి నిర్మించే ఈచిత్రంలో గుమ్మడి, నారాయణరావు, హేమాచౌదరి శరత్‌బాబు, రమాప్రభ, గిరిజారాణి, జయమాలిని ఇంకా ఎంతోమంది నూతన నటులూ నటిస్తున్నారు.

కొత్త స్టూడియో!

ప్రముఖ నటులు ఎ. నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావులు హైదరాబాదులో స్టూడియోలు నిర్మించడంతో నెమ్మదిగా తెలుగు రాజధానిలో తెలుగు చిత్రాల నిర్మాణంఅధికంగా జరుగుతోంది. అంతకు ముందేవున్న సారధీ స్టూడియో తర్వాత నిర్మాణమైన అన్నపూర్ణా శ్రీరామకృష్ణా స్టూడియోస్‌లకు తోడౌతూ యిప్పుడు భాగ్యనగర్ స్టూడియోస్ అన్న కొత్త స్టూడియో ప్రారంభమయింది ఆక్కడ

'యమగోల'లో సత్యనారాయణ





గాప్రాణం గోప్రాణం లో శోభన్ బాబు



శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైజెస్ వారి నూతన చిత్రంలో ముగ్గురు నాయికలు
ప్రభ శ్రీప్రియ, జయసుధ

విశాలమైన ఫ్లోర్లు ఆధునిక సౌకర్యాలతో మేకప్ గదులూ నిర్మాతలకూ నటీనటులకూ ఉండేందుకు ప్రత్యేకమైన గదులూ వున్న ఈ స్టూడియో నిర్మాణానికి ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ సంస్థ తోడ్పాటుకూడా ఉందని నిర్వాహకులు తెలియజేశారు.

కొత్త పాత్ర

నటీనటులెవరయినా సరే వారి నట జీవితంలో కొన్ని పాత్రలలోనే ప్రజలకు



విజయ మాధవీ పిక్చర్స్ వారి చిత్రంలో
నాగేశ్వరరావు, జయచిత్ర



'తరంగిణి'లో శ్రీధర్, సరిత

చిరకాలం గుర్తుంటారు. నటిగా చిత్ర రంగ ప్రవేశంచేసిన జయప్రదకు అతి తక్కువ కాలంలో అటువంటి పాత్రలు కొన్ని లభ్యమవడంతో ప్రేక్షకులకు అభిమాన తార అయింది. అంతులేని కథ, సిరిసిరిమువ్వ చిత్రాలలోని జయప్రద పాత్రలు ప్రేక్షకులను బాగా ఆకట్టుకున్నాయి. ఇప్పుడు 'భద్రకాళి' చిత్రం జయప్రదకు మరో చక్కని పాత్రను పోషించే అవకాశం కల్పించింది. ఎ. సి. త్రిలోక్‌చందర్ దర్శకత్వంలో నిర్మితమయిన ఈ చిత్రంలో ఇంకా మురళీ మోహన్, గుమ్మడి, అల్లురామలింగయ్య కె. విజయ, పండరీబాయి, నిర్మల, గిరిజారాణి మొదలయినవారు నటించారు.



'ప్రయాణంలో పదనిసలు'లో మాధవి

దొంగల్నెవరు చేస్తారు!

దొంగల్నెవరు చేస్తారు? — మనుషులే చేస్తారు. మనుషులతో నిండిన సమాజమే



'గడుసు పిల్లోడు'లో శోభన్ బాబు, జమున

మంచివాడిగా వున్న మనిషిని కూడా దొంగగా మారుస్తుంది. ఈ సత్యాన్ని చెప్పటానికే కావచ్చు తమ చిత్రానికి 'మనుషులు చేసిన దొంగలు' అని పేరు పెట్టారు శ్రీ పద్మావతీ పిక్చర్స్‌వారు. నటుడు కృష్ణ సమర్పించే ఈ చిత్రాన్ని యం. మల్లికార్జునరావు దర్శకత్వంలో యు. సూర్యనారాయణబాబు నిర్మిస్తున్నారు. కృష్ణ, కృష్ణంరాజు, మంజుల సంగీత-ప్రధాన పాత్రలలో కన్పించే ఈ చిత్రంలో మహారధి మాటలు. సత్యం సంగీతం. గోపీకృష్ణ ఛాయాగ్రహణం ఉన్నాయి.

కొత్త కలయిక!

30 సంవత్సరాల నటజీవితానుభవం కలిగిన మహానటుడు అక్కినేని నాగేశ్వరరావు 'దేవదాసు'గా ప్రేక్షకులు మరువలేని నటన ప్రదర్శించారు ఎప్పుడో నిర్మాణమైన దేవదాసు చిత్రంలో. (కోప్పడకండి; ఇది వార్తకాదు, అసలు వార్తకు ఇది నాంది!) తొలి చిత్రంతోనే సంచలన దర్శకుడిగా పేరొంది కొత్త ప్రయోగాలు చేయడంలో వెనుకాడక ముందడుగు వేస్తున్న దర్శకుడు దాసరి నారాయణరావు వీరిద్దరూ తొలిసారిగా "దేవదాసు మళ్ళీ పుట్టాడు" చిత్రంలో కలిసి పనిచేస్తున్నారు. దాసరి నారాయణరావు కథ. మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం చేపట్టిన ఈచిత్రానికి సెప్టెంబరు 20 నుంచీ షూటింగు మొదలవుతోంది. నాగేశ్వరరావు, వాణిశ్రీ షావుకారు జానకి, సావిత్రి, గుమ్మడి, ప్రభాకరరెడ్డి మొదలయినవారు నటిస్తున్నారీచిత్రంలో.

—యస్వీనారాయణ

గంగ, యమున, సరస్వతుల సంగమం

త్రివేణి

రుచి, సువాసన, పరిమళాల సమ్మేళనం

"త్రివేణి" వక్కపొడి







PHONE-270

తయారుచేయువారు..

త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీ

మేనేజింగ్ పార్ట్నర్.... దోసు వెంకటసుబ్బారావు....

పోర్టురోడ్ ............ మచిలీపట్నం (ఆంధ్ర)

KAMAL PROCESS

బ్రాంచీలు హైదరాబాద్ సికింద్రాబాద్ ఏలూరు కాకినాడ గుడివాడ విజయవాడ



Edited&Published by V Leelavathy Raghavaiah at 17B Rajaram Colony Kodambakkam Madras 600 024 & Printed byD Hanuman tha Rao at Kranti Press 12 Francis Joseph Street Madras 600001